# హిందూదేశము పేటెంటు మందులు

## (ద్వితీయ భాగము)

రచయిత


ఆయుర్వేదాచార్య

ప్రొఫెసర్, డాక్టర్. రామకృష్ణవర్మ, B. A. Bsc. & L.M.S.

అనువాదకుడు

డాక్టర్. గూడ వేంకట చలపతిరావు, H. M. D. S.





పబ్లిషర్సు

కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి


 [ వెల రు 2—0—0

# చరిత్రలు — కథలు

| | | |
|---|---|---|
| కాశీక్షేత్ర మహాత్మ్యము | 1 | 0 |
| మహాపతివ్రతల కథలు | 1 | 0 |
| మదనకామరాజు కథలు | 1 | 0 |
| హరిశ్చంద్ర (వచనం) | 0 | 8 |
| మైరావణ చరిత్ర 200 పేజీలు | 1 | 8 |
| అభయరాఘవము | 0 | 10 |
| సౌభ్రాత్రరాఘవము | 0 | 8 |
| విక్రమరాఘవము | 0 | 8 |
| మోడరన్ మేరేజస్ | 1 | 8 |
| పెద్దాపుర సంస్థాన చరిత్ర | 1 | 0 |
| పద్మనాభుని యుద్ధము | 0 | 12 |
| ప్రాచీనాంధ్ర విద్యాపీఠము | 1 | 0 |
| శ్రీకృష్ణుడు | 0 | [illegible] |
| పురూరవచక్రవర్తి కథలు | 0 | 12 |
| మహాభక్తవిజయం అను 30 భక్తుల కథలు | 1 | 8 |
| అరేబియన్ నైట్సు కథలు కంప్లీటు స్టోరీస్ | 1 | 8 |
| శుకసప్తతి కథలు | 1 | 0 |
| కాశీరామేశ్వర మజిలీ కథలు | 2 | [illegible] |
| గులేబకావలి కథలు | 1 | [illegible] |
| షట్చక్రవర్తుల ఇంద్రజాలపు కథలు | 0 | [illegible] |
| భేతాళ పంచవింశతి కథలు | 0 | [illegible] |
| అల్లూరి సీతారామరాజు చరిత్ర | 0 | [illegible] |
| పన్నెండురాజుల కథలు | 1 | [illegible] |
| పదహారు రాజుల కథలు | 1 | [illegible] |

# హిందూ దేశము
# పేటెంటు మందులు

## (ద్వితీయ భాగము)




రచయిత:

ఆయుర్వేదాచార్య

ప్రొఫెసర్. డాక్టర్. రామకృష్ణవర్మ B. A Bsc. & L. M. S.

అనువాదకుడు:

డాక్టర్. గూడ వేంకట చలపతిరావు. H. M. D. S.





ప్రకాశకులు

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి.

1957





[వెల 2—0—0

# మనవి

వైద్య సోదరులకు కృతజ్ఞుడను. వారు యీ పుస్తకపు ప్రథమ భాగముపై జూపిన ఆదరమే యీ ద్వితీయ భాగము త్వరగా ప్రకటింపబడుటకు ముఖ్యకారణము. కాని ప్రథమ భాగమందు వ్రాసి నట్లుగా యిందు మద్రాసు రాష్ట్రమందలి పేటెంటు మందులన్నిటిని చేర్చజాలక పోయితిని. యిందుకు క్షంతవ్యుడను. పృథక్కరణ వేత్త లగు శ్రీ వర్మగారు యిటీవల కొంచెము అనారోగ్యము జెందుటయు సమయమునకు సరియగు రసాయనిక ద్రవ్యములు లభింపకుండుటయు, దీనికి కారణములు. మిగిలిన మద్రాసు రాష్ట్రమందలి పేటెంటు మందులు ప్రస్తుతము పృథక్కరణ మొనర్పబడు చున్నవి. త్వరలో వీటినన్నింటిని కలిపి ఒక చిన్న అనుబంధముగా ప్రకటింప గలను. యీ ద్వితీయ భాగముపై గూడ వైద్యసోదరులు తగినంత ఆదరము జూపుదురని విశ్వసించుచున్నాను.

ఇందు వీలున్నంత వరకు యూనానీ వస్తువులకు, ఓషధులకు తెలుగు శబ్దములను పరిశీలించి వ్రాసితిని. కాని కొన్నింటిని, మన ప్రాంత్యములో ప్రచారములోలేని వానిని మటుకు యధాతథముగా వ్రాయక తప్పినది గాదు. వీటిని యూనానీ వస్తువుల నమ్ము ఫార్మసీ లకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

విధేయుడు,

అనువాదకుడు.

# హిందూదేశము
# పేటెంటు మందులు
## ద్వితీయ భాగము

---

### 1 యాంటెక్సమా (**Antexamia**)

ఇది లండనులో తయారు చేయబడుచున్నది. ప్రకటనాడంబరముచే ప్రపంచమందలి వివిధ భాగములలోను యిది విక్రయింపబడుచున్నది. $1\frac{1}{2}$ ఔన్సుల ప్రమాణముగల మందుసీసా ఖరీదు 14 అణాలు, యిది సర్వవిధ చర్మరోగములకును ఉపయోగకరమైన దని ప్రకటింపబడి యున్నది. మందును వ్రేలితో నెమ్మది నెమ్మదిగా రుద్దవలెను.

సాఫ్టు పరఫీన్ (Peraffin Saft) 35 $\frac{4}{10}$ వంతులు, యాసిడ్ బోరిక్ (Acid Boric) 1 $\frac{5}{10}$ వంతులు, తుమ్మబంక $12\frac{4}{10}$ వంతులు నీరు $5\frac{7}{10}$ భాగములు. మొత్తమును కలిపి చక్కగా నూరుము. మందు తయారగును.

### 2 ఓజేబిన్ (**Ozebine**)

ఇది ఐయిర్లండులో తయారు చేయబడుచున్నది. 8 ఔన్సుల ద్రవౌషధముగల సీసా ఖరీదు 3 రూపాయలు. అపస్మార (Swoon) వ్యాధిపై యిది పనిచేయునని ప్రకటింపబడి యున్నది. నిద్రాప్రదము శాంతిప్రదము, అయినట్టిది.

పొటాషియం బ్రొమైడు (Pottas Bromide) 2। గ్రెయిన్లు, అమోనియా కార్బొనెట్ (Ammonia C·rbonate) 16 గ్రెయిన్లు, వేచిన పంచదార – రంగుకొరకు, ఆక్వా క్లొరోఫారము 1 ఔన్సు మొత్తమును కలుపుము. పైప్రమాణముతో మందును తయారుచేసు

కొనవచ్చును. డోసు - టీ చంచా ప్రమాణము మందును ఉదయము భోజనమునకు ముందుగాను, సాయంత్రము పండుకొనుటకు పూర్వమున్నూ పుచ్చుకొన వలయును.

## 3 దవాయే సఫా

ఇది ఉన్మాద వ్యాధికి పనికివచ్చు మందు ఢిల్లీలో పేటెంటు చేయబడినది. 80 టాబిలెట్సు గల సీసా ఖరీదు 5 రూపాయలు. మందు ఉపయోగకరమైనది.

సర్పగంధ చూర్ణము 10 తులములు, చూర్ణించి నీటితో చక్కగా నూరి మిమనుపై టాబిలెట్సు చేయింపుము డోసు-ఉదయము, సాయంత్రము ఒక్కొక్క బిళ్ళ చొప్పున పుచ్చుకొని చక్కెర షర్బత్తును త్రాగవలయును,

## 4 కుర్సు జియవేతుస్

ఇది మధుమేహాముపై పనిచేయుమందు. ఢిల్లీలో పేటెంటు చేయబడినది. 30 తులముల తూకముగల టాబిలెట్సు గల సీసా ఖరీదు 1-14-0. మందు ఉపయోగకరమైనది.

దొండవేరు 29 తులములు, మిరియాలుతులము, వీటిని నీటితో మెత్తగానూరి టాబిలెట్సు చేయింపుము. మందు తయారుకాగలదు. డోసు - 6 మాముల ప్రమాసణముగల మందును, పల్చటి నీటి పెరుగుతోగాని, దానిమ్మపిత్తులనీటితో గాని, కలిపి పుచ్చుకొనవలయును.

## 5 కుహల్ జవాహిర్

ఢిల్లీలో పేటెంటు చేయబడిన సుర్మా. ఒక్కతులము మందు గల సీసా ఖరీదు 3 రూపాయలు. దీనిచే నేత్ర జాడ్యములు తగ్గిపోగలవు. మందు ఉపయోగకరమైనది.

జింకాక్సయిడ్ (Zinc Oxidum) 1 భాగము, బోరిక్ యాసిడ్ (Boric Acid) 24 భాగములు, సల్ఫేట్ ఆఫ్ కాపర్

(Sulphate of Cupram) ½ భాగము, సో్రతాంజనము 120 భాగములు, పటికి ½ భాగము. నల్లమందు 1 భాగము. వీటిని గులాబీ అర్కముతోనూరి యెండించి పిమ్మట వేపాకు రసముతో నూరుము. యిది చక్కగా యెండినపిమ్మట మెత్తగానూరి వస్త్రఘాళిత మొనర్చి సీసాలో పోయుము. ఆవశ్యకతాను సారము సన్నని యినపశలాకతో దీనిని కంటిలో వేయుము. దృష్టి తగ్గుట మొదలగు వాటిపై పనిచేయును.

## 6 ఓజోనియా (Ozonia)

యిది డబ్లిన్‌లో తయారు కాబడినది. 3 ఔన్సులమందుగల ప్యాకెట్టు ఖరీదు 12 అణాలు.

సోడియం కార్బొనెట్ (Sodium Carbonate) 77 భాగములు, నీరు 32$\frac{3}{50}$ భాగములు. సోడియం క్లోరైడ్ (Sodium Chloride) $\frac{2}{50}$ భాగములు, పొటాషియం సాల్టు (Potassium Salt) $\frac{14}{50}$ భాగములు. వీటి నన్నింటిని చూర్ణ మొనర్చి 3 ఔన్సుల తూకముగల ప్యాకెట్టులు చేయుము. వాడుకొను విధానము – ఒక తొట్టిలో వేడి నీటిని బోసి అందు ఒక్క డ్రాము యీ మందును వేసి, వివస్త్రులై గొంతు పై భాగము వెలుపలుండునట్లు కూర్చుండుము. పిమ్మట వెలుపలకు వచ్చి తుడుచుకొని పొడిబట్టలు కట్టుకొనుము. దీనిచే వాతనొప్పులు సంధి బాధలు తగ్గిపోగలవు.

## 7 హిమాంశు

యిది కలకత్తాలో పేటెంటు చేయబడినది. మధుమేహముపై పని చేయును. నాలుగు ఔన్సుల సీసా ఖరీదు 1-8-0 మందు ఉపయోగకరమైనది.

స్పిరిట్ కొడయినా (Spirit Codeina) 1 ఔన్సు టించర్ ఫెర్రీ పర్ క్లోరయిడ్ (Tr. Ferri Per Chloride) 3 డ్రాములు, టించర్ నక్సువామిక (Tr. Nuxvomica) 2 డ్రాములు, స్పిరిట్ క్లోరోఫారము

(Spirit Chloroform) 5 డ్రాములు, మిగిలినది డిస్టిలెడ్ వాటరు. మొత్తము నాలుగు ఔన్సు లుండునట్లు చేయుము. డోసు - 2 డ్రాముల మందును 2 తులముల నీటితో కలుపుకొని దినమునకు 3 పర్యాయములు పుచ్చుకొనవలయును.

## 8 కర్ణబిందు

యిది "పీలీభీత్" లో పేటెంటు చేయబడినది. సీసా ½ ఔన్సు ప్రమాణము కలదు. దీనిచే చెవిపోటు, పుండు, వాపు, మొదలగునవి తగ్గిపోవును.

కాస్టార్ ఆయిల్ (Castor Oil) 4 భాగములు, యాసిడ్ కార్బాలిక్ (Acid Carbolic) 5 భాగములు, క్లోరల్ హైడ్రేటు (Chloral Hydras ⅕ భాగము, కర్పూరము ⅕ భాగము, మొత్తమును కలుపుము. మందు తయారగును. ముందుగా చెవిని పరిశుభ్రపరిచి దీనిని 2, 3, చుక్కలు వేయవలయును.

## 9 ఓసోజేన్ (Osojen)

ఇది ఒక విధమగు తరళౌషధము. లండనులో పేటెంటుచేయబడినది. చిన్న చిన్న, పెద్ద పెద్ద, సీసాలతో యిది విక్రయించబడుచున్నది.

క్వైనైన్ గ్లిసరో ఫాస్ఫేట్ (Quinine Glyero Pchosphas) 75 భాగములు, అయిరన్ గ్లిసరో ఫాస్ఫేట్ (Iron Glycero Phosphas) 214 భాగములు, మెగ్నీషియంగ్లిసరో ఫాస్ఫేట్ (Meg Glycero Phosphas) 17 భాగములు, సోడియం గ్లిసరో ఫాస్ఫేట్ (Sodium Glycero Phosphsa) 90 భాగములు, స్పిరిట్ క్లోరోఫారము 380 భాగములు, గ్లిసరిన్ (Glycerim) 730 భాగములు. మిగిలినభాగమునీటిని కలిపి మొత్తము 2000 భాగములుండునట్లుచూచి అన్నింటినీ చక్కగా కలుపుము. డోసు - 20 నుండి 30 చుక్కలవరకు - ఒక్క ఔన్సు నీటిలో కలిపి ఆహారము తీసికొనినపిమ్మట దినమునకు 3 పర్యాయ

ములు పుచ్చుకొనవలయును. స్వల్ప వయస్కులకు డోసును తగ్గింప వలయును. యిది వాతరోగము, అలసట, బలహీనత, మూత్ర పిండము, యిన్ఫ్లూయింజా, అజీర్ణము, జలోదరము, మధుమేహము శ్వాస, క్షయ, పక్షవాతములకు ఉపయోగకరమైనది.

## 10 యాంటీపెన్ (Antipone)

యెర్రని రంగుగల యీ మందు లండనులో తయారు చేయ బడుచున్నది. 6½ ఔన్సుల ప్రమాణముగల మందుసీసా ఖరీదు 2 రూపాయలు. తీక్షణావస్థలోనున్న బలహీనత వ్యాధులపై యిది ఉప యోగింప బడుచున్నది.

సిట్రిక్ యాసిడ్ (Sitric Acid) 39$\frac{1}{10}$ గ్రెయినులు, స్వచ్ఛ మగు నీరు 1 ఔన్సు, కలుపుము. కోచనీల్ (Tr. Cochineal) కలిపి రంగు వచ్చునట్లు చేయుము. భోజనానంతరము 2 డ్రాములమందును ఒక చంచా నీటితో కలిపి పుచ్చుకొన వలయును.

## 11 జన్మఘుటీ

యిది ఆలీగఢ్‌లో ప్రచారమందున్నది. ఒక్కసీసా ఖరీదు 0-4-0 మందు ఉపయోగకరమైనది.

యేటి పుచ్చవేరు చూర్ణము 1 భాగము, నీరు 8 భాగములు వీటిని నిప్పుపైనుంచి కాచుము. నీరు నాల్గవభాగము మిగిలియుండగా చూచి దించి వడగట్టి అందు $\frac{1}{10}$ భాగము నవాసాగర ... కలిపి తిరిగి నిప్పుపైనుంచి కేవలము నవాసాగము, మిగులు నంతవరకు కాచి. దించి యెండించి చూర్ణము చేయుము. డోసు-2 వడ్లగింజల ప్రమా ణము నుండి 8 వడ్లగింజల ప్రమాణమువరకు. 0-4-0 ఖరీదు గల సీసాలో మందు ఒక్కమాస ప్రమాణము మాత్రమే కలదు. మిగి లినదంతయు తేనె యీ రెంటినీ కలిపి అరఔన్సుసీసాలో పోయుము. దీనిని కొద్ది కొద్దిగా పసిబిడ్డలకు నాకించినచో వారల వివిధ జాడ్య ములు తగ్గిపోగలవు.

## 12 శ్వాసనాశకపట్నీ

యిది లాహోరులో పేటెంటు చేయబడినది. ఒక్క పావుశేరు డబ్బా ఖరీదు 1 రూపాయి నిసిచే శ్వాసవ్యాధి సాంతముగా నశింపదుగాని తాత్కాలికముగా, గొడుమగా వచ్చుట మటుకు తగ్గిపోగలదు.

యష్టి మధుకపు చూర్ణము 4 తులములు, అవిశవిత్తుల చూర్ణము 4 తులములు. తేనె 10 తులములు. వీటిని చక్కగా నూరి ఆవశ్యకతానుసారము వ్యాధి కనుపడినప్పుడు కొద్ది కొద్దిగా ఉపయోగింప వలయును.

## 13 అర్కేర్ అమరాప్

యిది డాక్టరు ఫిరోజుద్దీన్ సాహేబుగారిచే పేటెంటు చేయబడినది. అమృతధారతో సమానముగా పనిచేయును.

అక్సీరీ (రసాయన) కర్పూర తైలము అరభాగము, నవాసాగరి ద్రావకము అరభాగము. థయిమల్ 1 భాగము, పిప్పరమెంటు 1 భాగము, టించరు క్లోరోఫారము (Tr Chloroform) అరభాగము. వీటి నన్నింటిని కలిపి యెండలో నుంచుము. కరిగి కలిసిపోవును. డోసు–1 నుండి 5 చుక్కల వరకు, కలకండ లేక చక్కెర బిళ్ళలతో కలిపి పుచ్చుకొనవలయును. ఒకటి రెండు చుక్కలు పైన వ్రాసినచో ఆమాశయ రోగములు, నొప్పులు, విషకీటక బాధలు, ప్లేగు, నశించిపోగలవు.

## అక్సీరీ (రసాయన) కర్పూరతైలము జేయువిధము

జిల్లేడుఆకుల రసములో కర్పూరపు ముక్కనుంచి యెండలో నుంచుము. రసము యెండిన పిమ్మట తిరిగి రసమునుపోసి యెండలో నుంచుము. యిటుల యేడుమార్లు చేసి కర్పూరపు ముక్కను శుభ్రపరిచి కర్పూరమునకు సమభాగము సల్ఫ్యూరిక్ యాసిడ్ కలుపుము. యాసిడ్ $\frac{1}{4}$ భాగము మిగులునంత వరకుంచి నూరినచో కర్పూరము

మాత్రలుగా చేయుటకు వీలగునట్లుగా తయారగును. దీనిని మాత్ర లుగా నొనర్చి పాతాళయంత్రము ద్వారా తైలము తీయవలయును. ఇదే అక్సీరీ కర్పూర తైలము.

## నవాసాగర ద్రావకము

చవుడు 20 తులములు తీసుకొని ఒక మట్టి చట్టిలో అడుగున సగభాగము సున్నమును పోసి దానిపై చవుడు నుంచి మిగిలిన సున్న మును పైన పోసి యేరుడు పిడకల పైనుంచి కాల్చుము. పిమ్మట చవుడును తీసుకొని చవుడుకు సమభాగముగా నవాసాగరము కలిపి మట్టి చట్టిలోనుంచి శీలమన్ను యిచ్చి 10 శేర్ల (80 తులముల శేర్లు) యేరుడు పిడకలతో పురము పెట్టుము. యిటుల మూడుమార్లు పురము పెట్టిన పమ్మట దీనినితీసి పింగాణిగిన్నెతో నుంచి రాత్రిపూట మంచులో నుంచుము. రెండు మూడు దినములలో ద్రావకముదిగును. దీనిని వడకట్టుకొని ఉపయోగింప వచ్చును.

## 14 అక్సీరీజిరియాన్

ఇది డాక్టరు నూరిద్దీన్ సాహెబుచే పేటెంటు చేయబడినది. మందు ఉపయోగకరమైనది.

తొలిచూలులో కోడెను కనిన యెర్ర ఆవు జున్నుపాలు 90 తులములు, పిస్తాపప్పు (పచ్చివి) 5 తులములు, పండినతుమ్మకాయలు (పచ్చివి) 3 తులములు, పిల్లపీచర (పచ్చిది) 5 తులములు, వీటిని విడివిడిగా మెత్తగా నూరి కలిపి అందు 10 తులముల చక్కెరను చేర్చుము. డోసు – 6 మాషముల ప్రమాణము. ఉదయము సాయం త్రము పావుశేరు పాలు లేక నీటితో పుచ్చుకొనవలయును. వీర్య స్రావము దీనిచే తగ్గిపోవును.

## 15 అక్సీర్ అజీబ్

ఇది లాహోరులో పేటెంటు చేయబడిన ప్రసిద్ధమగు మందు. దీనిచే వీర్యస్రావము, హస్తక్రియ, మొదలగు పురాతనవీర్యదోషము లన్నియు తగ్గిపోవును.

నల్లమందు 3 భాగములు, శిలాజిత్తు 3 భాగములు, లోహ భస్మము 3 భాగములు, వంగ భస్మము 3 భాగములు, గంజాయి విత్తులు 1 భాగము, పొటాషియం బ్రోమైడు 5 భాగములు. వీటి నన్నింటినీ నూరి పెసగింజల ప్రమాణ ముండునట్లు మాత్రలు చేయుము. డోసు – 2 మాత్రలు, ఉదయము సాయంత్రము పాలతో పుచ్చుకొనవలయును.

## 16 అక్సీర్ హాజమ్

అమృతసర్‌లో దీనికి మంచి ప్రచారము కలదు. ఉదర రోగ ములకును, కందిరీగ, తేనెటీగ మొదలగు వాటి విష బాధలకును చక్కగా ఉపయోగింపగలదు.

నవాసాగరసత్వము 2 భాగములు, పిప్పరమెంటు అరభాగము, నల్లమిరియాలు 1 భాగము, పిప్పళ్ళు 1 భాగము, యవక్షారము 1 భాగము, సూరేకారము (పరిశుభ్రము చేయబడినది) 1 భాగము, యేలకులు 3 భాగములు, సైంధవ లవణము 3 భాగములు, యర్ర మట్టి 5 భాగములు. వీటి నన్నింటినీ వేరు వేరుగా మెత్తగా నూరి కలుపుము. డోసు – గురిగింజల ప్రమాణమునుండి ఒక్క మాష ప్రమాణమువరకు. వేడినీటితోగాని లేక సోపు ఉపరసముతోగాని పుచ్చుకొనవలయును.

## 17 Blain's Count & Rheumatic pills

ఈ మాత్రలు విదేశమునుండి దిగుమతి చేయబడుచున్నవి. పెట్టెలో 14 మాత్ర లుండును. మందు గుణము కలదగుటచే

ప్రపంచమం దంతటను అత్యధికముగా విక్రయింప బడుచున్నది. కీళ్ల నొప్పులు, నడుము నొప్పులు, మొదలగు వాతజన్య జాడ్యములపై చక్కగా పనిచేయ కలదు.

పల్వ్ కాల్చికం (Pulv Colchicum) 210 గ్రయినులు, పొంగింపబడ్డ పటికి 35 గ్రయినులు. రెంటిని కలిపి బంకనీటితో నూరి 100 మాత్రలు చేయుము. డోసు - 1 మాత్ర చొప్పున దినమునకు 3 పర్యాయములు ఆహారము తీసికొనినపిమ్మట పుచ్చుకొనవలయును. బాధ తగ్గిన వెంటనే మందును ఆపివేయవలయును. తిరిగి ఒకవేళ బాధ కొద్దిగా కనుపించినచో 2 వారముల వరకు రెండు పర్యాయముల చొప్పున పుచ్చుకొన వలయును. మలబద్ధకము కలుగజేయు వస్తువులను పుచ్చుకొనరాదు.

## 18 బీచమ్స్ పిల్స్ (Beacham's pills)

ఇది లాంక్‌షయిర్ లో తయారు చేయబడుచున్నది. రైల్వే స్టేషనులలో దీని ప్రకటనను తరచుగా చూడవచ్చును. 56 మాత్రలు గల డబ్బీ ఖరీదు 2-4-0

ముసాంబరము 50 గ్రయినులు, శొంఠిచూర్ణము 55 గ్రయినులు, సబ్బుసోడి 18 గ్రయినులు, మొత్తమును కలిపి 100 మాత్రలను తయారు చేయుము. డోసు - 3 నుండి 6 మాత్రల వరకు. దినమునకు 3 పర్యాయములు పుచ్చుకొనవలయును, దీనిచే త్రిప్పుట, తలనొప్పి, పాకాశయ జాడ్యములు, నడుమునొప్పి, వ్యాకులత, అజీర్ణము, పైత్యాశయ వికారములు, జలుబు, బలహీనత, చర్మరోగములు, కురుపులు, వ్రణములు, అన్నియు తగ్గిపోవును.

## 19 బీచమ్ కఫ పిల్స్ (Beacham'S Cough Pills)

ఇది కూడ పై స్థానమందే తయారు చేయబడుచున్నది. మాత్రల సంఖ్యకూడ అదే.

మార్ఫియా (Morphine) ¼ గ్రయిను, అడవి వుల్లిగడ్డల చూర్ణము 12½ గ్రయినులు, అవిశవిత్తుల చూర్ణము 30 గ్రయినులు, నవాసాగరము 30 గ్రయినులు, అతిమధురపు సత్వము 40 గ్రయినులు, వీటి నన్నిటిని నూరి 10 మాత్రలను చేయుము.

డోసు - 2 మాత్రలు. దినమునకు 3 పర్యాయములు పుచ్చుకొన వలయును. ఇది దగ్గు, శ్వాస, గొంతు నొప్పులను తగ్గించి శ్వాసను సులభముగా ఆడునట్లు చేయగలదు.

## 20 పోమిస్ యాంటీ కాటరాక్ట్ మిక్చర్

## (Pomies Anti Cataract Mixture)

ఇది లండనులో ఒక కంపెనిచే తయారు చేయబడుచున్నది. డబ్బీలో 2½ డ్రాములమందు కలదు. ఖరీదు 2 రూపాయలు. కంటిలోని పువ్వులకిది ఉపయోగపడు చున్నది.

పొటాషియమ్ అయొడయిడ్ (Potass odide) 5½ భాగములు, గ్లిసరిన్ (Clycerine) 51½ భాగములు, గోధుమ సత్వము ఆరున్నర భాగములు, డిస్టిలెడ్ వాటరు 31½ భాగములు, వీటినన్నింటిని కలుపుము. దీనిని ప్రతిదినము కంటిలో బ్రష్‌తో రెండు మూడు పర్యాయములు వేయుచుండ వలయును.

## 21 పయామ్ సఫా

ఇది హిందూస్థానీ లేబరేటరీ, ఢిల్లీలో పేటెంటు చేయబడినది.

యర్రమట్టి 6 భాగములు, మిరియాలు 6 భాగములు, నవాసాగరము 6 భాగములు, ఉమ్మెత్త విత్తులు 3 భాగములు, వీటి నన్నింటినీ వేరు వేరుగా నూరి కలుపుము. డోసు -- గురిగింజ ప్రమాణము. నీటితోగాని, సోంపుఉపరసముతోగాని పుచ్చుకొన వలయును. దీనిచే సర్వ అమాశయ జాడ్యములుతగ్గి జీర్ణశక్తి చక్కగాకలుగును.

## 22 తెరపాక్ అకర్

ఢిల్లీలో యిది పేటెంటు చేయబడినది. దీనికి చక్కని ప్రశంస, ప్రచారము కలదు. యిది వంధ్యా దోషమును పోగొట్టి సంతానోత్పత్తికి తగినవారలనుగా చేయకలదు. దీనిని ఋతుదినమునకు పిమ్మట మూడు దినముల వరకు పుచ్చుకొనవలయును.

లింగదొండ వేరు 6 మాషములు, ఏనుగ దంతపు చూర్ణము 6 మాషములు, చంద్రకాంతి పుష్పములు 6 మాషములు. వీటిని సూరి 21 భాగములు చేయుము. రోసు – ఒక్కభాగము మందును పాలతో కలిపి స్త్రీ పురుషు లిరువురు సమ భాగములుగా పుచ్చుకొనవలయును.

## 23 ట్యూబర్ క్లోజిన్ (Tuber Closin)

అమెరికాలో దీనికి చక్కని ప్రచారము కలదు. యిచ్చట గూడ అత్యధికకముగా యిది విక్రయింపబడుచున్నది. యీమందు 1 నెంబరు, 2 నెంబరు అని రెండురకములుగా నున్నది ఒకొక్కటి 13 ఔన్సుల ప్రమాణము కలదు.

### 1 నెంబరు

పొటాష్ బ్రోమయిడ్ $3\frac{4}{10}$ భాగములు, గ్లిసరన్ 12 భాగములు, ఆయిల్ ఆఫ్ కేసియా $\frac{1}{10}$ భాగము, టించర్ కేప్సికమ్ (Tr. Capsicum) $\frac{18}{100}$ భాగములు, కాస్టిక్ సోడా (Caustic Soda) $\frac{1}{100}$ భాగములు. మిగిలినది నీరు. మొత్తము 100 భాగము లుండునట్లు చూడుము. యెరుపురంగు కొరకు కోచనిల్ (Tr Cochineal) వేసి – వీటి నన్నింటిని చక్కగా కలుపుము.

2 నెంబరు

గ్లిసరన్ 10 భాగములు, బాదము ఆయిలు $\frac{1}{10}$ భాగము, రంగుకొరకు వేయించిన పంచదార, మిగిలినదినీరు. కలిపి మొత్తము 100 భాగము లుండునట్లు చూడుము.

భోజనానంతరము రెండు సీసాల లోని మందులకు 30, 20, చుక్కల చొప్పున పాలు, లేక వేడి నీటితో కలుపుకొని వెంటనే త్రాగవలయును దీనిచే క్షయ తగ్గిపోవును.

## 24 జవాహర్ మోహ్రా

యిది స్వర్గీయ డాక్టర్ అజమల్ ఖా సాహెబ్ గారి కుటుంబపు పేటెంటు మందు. యిది మెదడునకు, మనస్సునకు, శక్తి నిచ్చి జీవ శక్తిని వృద్ధిపరచి బలహీనతను పోగొట్టగల ఉత్తమౌషధము.

పావుదాచు $1\frac{1}{2}$ భాగములు, దెబ్బతినని ముత్యము $\frac{7}{12}$ భాగము, * కహరుబా $\frac{7}{12}$ భాగము, పగడము $\frac{7}{12}$ భాగము, రాజావర్తము $\frac{7}{12}$ భాగము. మాణిక్యము (యెర్రనిది) $\frac{7}{12}$ భాగము, మాణిక్యము (ఆకుపచ్చగ) $\frac{7}{12}$ భాగము, మాణిక్యము (పచ్చది) $\frac{7}{12}$ భాగములు, * యశబ్ (పచ్చనిది) $\frac{7}{12}$ భాగము, * జమురూద్ (రత్న జాతిలోనిది. ఆకుపచ్చగా నుండును,) * అకీక్. (యవనదేశము రాళ్ళు) వెండి రేకులు, రుమీమస్తకీ, యివి ప్రత్యేకముగా $\frac{7}{12}$ భాగములు, బంగారు రేకులు $\frac{1}{4}$ భాగము. కస్తూరి $\frac{1}{4}$ భాగము, సముద్రపు కొబ్బరి $\frac{1}{4}$ భాగము. కాసర $\frac{1}{4}$ భాగము, మొమ్మాయి $\frac{1}{4}$ భాగము. వీటి నన్నింటిని గులాబీ అర్కముతో 2 వారముల పర్యంతము మర్దించి సురక్షితముగా నుంచుము. డోసు - 2 వడ్లగింజల యెత్తువరకు.

* యునానీ ఫార్మసీలలో యివి దొరకును.

## 25 జౌహరీ

యిది ఉపదంశముపై (Syphilis) పైపనిచేయగల హిందూదేశపు మందు యూనానీ చికిత్సకులుగూడ అత్యధికముగా దీనిని ఉపయోగించు చున్నారు. చాల చక్కగా పనిచేయగలదు.

శంఖ పాషాణము, సౌవీరము, రసకర్పూరము, వీటిని సమ భాగములుగా తీసుకొని ఆరు రెట్లు అధికముగానున్న స్పిరిట్స్ ఆఫ ఫ్రెంచ్ వైన్‌తో కలిపి సూరి సత్వము తీయుము. డోసు – వడ్లగింజ ప్రమాణము. కాప్సుల్ లోనుంచి మ్రింగవలయును. పులుపు వస్తువులను తినగూడదు. వాతరోగము లన్నియును నశించి పోగలవు.

## 26 చిక్ నీ

లాహోరులో ప్రసిద్ధిజెందిన మందు. కంటిలోని పొరలకు పూలకు నీరు కారుటకు యిది ఉపయోగకరమైనది.

సబ్బు 12 భాగములు, మైలతుత్తము 3½ భాగములు, గుగ్గిలము 3½ భాగములు. మొదట సబ్బును చాకుతో చిన్న చిన్న ముక్కలుగా కోసి లోహపాత్రలో నుంచి నిప్పుపై నుంచుము. సబ్బు కరిగిన పిమ్మట మైలతుత్తమును వేసి యినుప కడ్డీతో కదలించు చుండుము. ఇది నీటివలె కరిగిన పిమ్మట గుగ్గిలమును కలిపి క్రింద మంటను యెక్కువ చేయుము. నీరు యిగిరి అది నల్లగా అయిన పిమ్మట దించుము. దీనిని సజ్జగింజ ప్రమాణము నీటితో కలిపి కడ్డీలాంటి సాధనముతో కంటిలో వేయుము.

## 27 హాచ్ప్ స్యాహ చశ్మ

యిది హిందూస్థాన్ లేబరేటరీ, ఢిల్లీలో పేటెంటు చేయబడి అత్యధికముగా విక్రయింపబడు చున్నది. యిది కన్నుల మెరుపులకు, నొప్పులకు, పోట్లకు, ఉపయోగించును.

రసాంజనము 4 తులములు, పొంగించిన పటికి 2 తులములు, నల్లమందు 14 మాషములు, వేపాకులు 6 మాత్రము, కుంకుమపువ్వు 5 గురిగింజలయెత్తు, వీటి నన్నిటిని గులాబీ అర్కముతో నూరి మాత్రలను చేయుము. అవసరమగునప్పుడు ఒక్క మాత్రను నల్ల మందు నీటితో నూరి కన్నుల పైభాగమున పట్టు వేయుము.

## 28 డాక్టర్ బేగమ్స్ బామ్

యూరపులో తయారు చేయబడి ప్రపంచమందంతటను యిది విక్రయింపబడు చున్నది. మందు ఉపయోగకరమైనది.

మెంథల్ (Menthol) 18 భాగములు. (Methyl Salieylas) 20 భాగములు, లెనోలిన్ (L.no.in) 54 భాగములు, లార్డ్ (Lard) 8 భాగములు. వీటి నన్నిటినీ చక్కగా కలిపి సీసాలో నుంచుము. అవసరమగునప్పుడు దీనిని వ్రాసి పైన దూదికట్టుము. రెండు మూడు సార్లు యిట్లు వ్రాసి వేడినీరు, సబ్బుతో మందును కడిగివేసి మరల మందును వ్రాయుము. యిట్లు చేసినచో నూతన, పురాతనములగు వాతనొప్పులు, నడుమునొప్పులు, ప్రక్క యెముకలలోని నొప్పులు, మూత్రపిండపు వికారములు మొదలగునవి తగ్గిపోగలవు.

## 29 డాక్టర్ లెంస్ కటార్ క్యూర్

యీతరళౌషధము లండనులో తయారు చేయబడు చున్నది. సీసాలో $2\frac{1}{2}$ ఔన్సుల ప్రమాణము గల మందు గలదు. యిది రొంప, పడిశములకు గ్యారంటీ మందని తలంచ బడుచున్నది.

యాసిడ్ కార్బాలిక్ 4 భాగములు, మామూలు ఉప్పు 33 భాగము, నీరు 1000 భాగములు, వీటిని కలిపి చక్కగా నూరుము. మందు తయారు కాగలదు. దీనిని కొద్దిగా సాయంత్రము ఉదయము నాశికద్వారముల ద్వారా కంఠనాళములోనికి వచ్చునట్లుగా పీల్చ వలయును.

## 30 రెడ్ యూవయ్ మేట్స్

లండనులో తయారు చేయబడి ప్రపంచ మందంతటను విక్రయింప బడుచున్నది. దీనిచే మామూలు బలహీనత, కండరముల బలహీనత, మస్తిష్కపు బలహీనత, రక్తవికారము, ఇవి తప్పక తగ్గిపోవునని ప్రకటింపబడ యున్నది.

సల్ఫేట్ అయిరన్ (Sulphate Iron) 70 భాగములు, క్వైనైన్ సల్ఫ 12 భాగములు, ఫాస్ఫరస్ (Phosphorus) $\frac{1}{100}$ భాగములు, వీటినన్నిటినీ నూరి బంక నీటితో నాల్గు గ్రయినుల ప్రమాణముగల మాత్రలను చేయుము. ఒక్కొక్క మాత్ర చొప్పున దినమునకు రెండుపర్యాయములు భోజనానంతరము పుచ్చుకొనవలయును.

## 31 డాక్టర్ మెకంజీ టాబిలెట్స్

ఇది న్యూయార్కులో తయారు చేయబడుచున్నది బిళ్ళలపై రంగు కాగితములతికింపబడి యుండును. జలుబు, రొంప, మొదలగు శైత్యబాధలపై చక్కగా పనిచేయును. మొదటి మోతాదులోనే సుగుణము కనుపింప గలదు.

సింకోనా సల్ఫేట్ (Cinchona Sulph) 83 గ్రయినులు, యాంటీ ఫేబరిన్ (Anti Febrin) 75 గ్రయినులు, కర్పూరము 10 గ్రయినులు, అభ్రకము 21 గ్రయినులు. మొత్తమును నీటితో నూరి 100 టాబిలెట్సు చేయుము. డోసు – రెండు గంటల కొకతూరి ఒక్కొక్క బిళ్ళ చొప్పున పుచ్చుకొన వలయును. బాధ తగ్గిన కొలదీ నాల్గు గంటల కొకతూరి ఉపయోగింప వచ్చును. దీనిచే తలనొప్పి, శైత్యబాధ తగ్గిపోగలదు.

## 32 ముఘాన్

ఇది ఢిల్లీలో రిజష్టరు చేయబడిన పేటెంటు మందు. వర్ణింపబడిన గుణములు మందునందు సంపూర్ణముగా కలవు. 5 చుక్కలు

ప్రమాణము గల మందును పావుశేరు ఆవుపాలతో కలిపి పుచ్చుకొన వలయును. యిది చాల చక్కని శక్తిప్రదమైన వాజీకరణౌషధము. పాలు, పెరుగు తగినంతగా ఉపయోగింపవలెను.

ఇంగిలీకము 1 తులము, శంఖపాషాణము 1 తులము, వీటిని 5 శేర్ల ఆవుపాలతో కలిపి తోడుపెట్టుము. దీనిని మధించి వెన్నదీసి అందు 3 మాషముల ప్రమాణము కుంకుమపువ్వును కలిపి నూరుము. మందు తయారగును, డోసు - 5 చుక్కలు.

## 33 హబ్బునిశాత్

ఇది ఢిల్లీలో పేటెంటు చేయబడినది. శక్తి నివ్వగల వాజీకరణౌషధము. వీర్య స్రావమును ఆపివేయగలదు. మందు ఉపయోగకరమైనది.

రజిత భస్మము 4½ మాషములు, జాపత్రి 18 మాషములు, కుంకుమపువ్వు 18 మాషములు, రేనాడు (నలికళ్ళపామువలె యిసుకలోనుండు చేప) 18 మాషములు, జాజికాయ 9 మాషములు, హిజ్జలము (సముద్రఫలము) 9 మాషములు, పావుదారు 1 మాషము. కస్తూరి 1 మాషము. వీటి నన్నింటిని తమలపాకు రసముతోనూరి అడవిరేగు ప్రమాణము మాత్రలను చేయుము. ఒక్క మాత్రను సాయంత్రము పాలతో పుచ్చుకొనవలయును.

## 34 హాబూబ్‌తిలాయే

ఇది లాహోరులో ప్రసిద్ధి నొందియున్నది. అవయవములకు పుష్టి నిచ్చు వాజీకరణౌషధము. రక్తమును, వీర్యమును, వృద్ధి పొందించ గలదు. ఉదయము సాయంత్రము ఒక్కొక్క మాత్రను పాలతో పుచ్చుకొనవలయును.

లోహభస్మము 2 గురిగింజల ప్రమాణము, పాస్ఫరస్ 2 గురిగింజల ప్రమాణము, గోల్డ్ క్లోరయిడ్ 4 గురిగింజల ప్రమాణము,

కస్తూరి 3 మాషములు, బంగారు రేకులు 1 మాషము, బంగారు భస్మము అర మాషము, క్వినైన్ సల్ఫ(Quinine Sulph) 3 మాషములు యక్స్ట్రాక్ట్ నక్సు వామిక 1½ మాషము యెక్స్ట్రాక్టు బెల్లోనా 6 గురిగింజలప్రమాణము. యర్రలు (యెండినవి) 1 తులము ఆయిల్ కాజపుటీ (Oil Cajuputi) 1 డ్రాము, దాల్చిన అరకు 1½ డ్రాము. వీటి నన్నింటినీ కలిపి చక్కగా నూరి కొండ పిండిరసముతో బాగుగా కలిపి 150 మాత్రలను చేయుము. 50 మాత్రలు గల సీసా ఖరీదు 12 రూపాయలు. ఆవశ్యకతానుసారము వీనిని ఉపయోగించుకొన వచ్చును.

## 35 కర్ణ తైలము

బొంబాయిలో దీనికి చక్కని ప్రచారము కలదు. చెవిలో వేసిన వెంటనే చెవిపోటు తగ్గిపోవును. అరమాష ప్రమాణము మందు సీసా ఖరీదు 8 అణాలు, మందు ఉపయోగకరమైనది.

దేశీయపు వాము తైలము 5 భాగములు దేశీయపు కర్పూరము 2 భాగములు. పిప్పరమెంటు 1 భాగము. వీటి నన్నింటినీ కలుపుము. మందు తయారగును. అవసరమగు నప్పుడు దీనిని కాచిగాని లేక అలాగే చల్లనిది గాని చెవిలో చుక్కలు చుక్కలుగా వేయుము. వెంటనే బాధ తగ్గిపోవును. వాత నొప్పులపై గూడ దీనిని రుద్దవచ్చును.

## 36 మోతియా బింద్ తైలము

ఇది అహమద్ నగరములో పేటెంటు చేయబడినది. అర ఔన్సు సీసా ఖరీదు 2 రూపాయలు.

పొగాకు 1 భాగము, ఆముదము 4 భాగములు వీటిని విడువక 12 గంటల వరకు చక్కగా నూరి మూతి వెడల్పుగల సీసాలో నుంచుము, అవసరమగు నప్పుడు ఉదయము. సాయంత్రము, పరుండ

బోవునప్పుడు, కొద్దిగా కంటిలో వేయుము. కన్నులలోని పొరలకు ఉపయోగకర మైనది.

## 37 వినీచ్ లాజ్ వాచ్

ఇది ఢిల్లీలో ప్రొఫెసర్ ఫజల్ రహమాన్ సాహేబుగారిచే పేటెంటు చేయబడినది. ప్రకటనాను సారము యిది చక్కగా పని చేయగలదు.

మాదీ ఫలము 5 భాగములు, కరక్కాయ 5 భాగములు, నల్లకరక్కాయ 5 భాగములు, ఉసిరిక కాయల బెరడు 5 భాగములు. వీటిని కాల్చి మెత్తగా పొడిచేయుము. యిందు, చోడ్డి పాషాణము 2 భాగములు, తెల్లకాచు 2 భాగములు, కాల్చిన లవంగములు 2 భాగములు. సైంధవలవణము 1 భాగము, మైలతుత్తము 1 భాగము. వీటిని నూరి కలుపుము. అవసరమగు నప్పుడు దీనిని ఉసిరిక రసముతోగాని, గోరంట్ల రసముతో గాని కలిపి వెంట్రుకలకు పులిమి గుడ్డ కట్టుము. రెండు మూడు గంటల పిమ్మట గుడ్డను తీసి వెంట్రుకలను నీటితో కడిగివేయుము. వెంట్రుకలు నల్లగాను ధృఢముగాను ఉండగలవు.

## 38 డీ సోల్

లండను సమీపమందున్న గ్రామములోని ఒక కంపెనీచే యిది పేటెంటు చేయబడినది. 2 డ్రాముల సీసా ఖరీదు 0–13–0 నొప్పిని నివారింపగల గుణము యిందు కలదు.

ఆవనూనె 20 భాగములు, జాజికాయ నూనె 20 భాగములు, ఆయిల్ వయ్ పెంటో (Oil of Pimento) 4 భాగములు, పత్తిగింజలనూనె 6 భాగములు, లిక్విడ్ ఫరోఫిన్ (Paroffinun Liq.) 171 భాగములు, ఆయిల్ కిరోసిన్ 33 భాగములు. వీటి నన్నింటిని కలిపి సీసాలో పోయుము. డోసు– 2 చుక్కలు. బాధగలచోట దుద్ద

వలయును. యందు సవరనుతగ్గించ వలుచుకున్నచో ఆలివ్ ఆయిల్ ను యిందు సమానభాగముగా కలుపవచ్చును. నడుము నొప్పులు, తలనొప్పి, పండ్లనొప్పులు, మొదలగు నొప్పులన్నియును తగ్గిపోవును.

## 39 డోమాస్ పారిస్ పిల్స్

ఇది ఫ్రాన్సులో తయారు చేయబడినది. 46 మాత్రలు గల పెట్టె ఖరీదు 3-8-0.

అయిరన్ సల్ఫేట్ 38 గ్రయినులు, పౌడర్ కెనీలా 22 గ్రయినులు, అతిమధురపు చూర్ణము 22 గ్రయినులు, జాలప్ పౌడరు 12 గ్రయినులు, శొంఠి చూర్ణము 6 గ్రయినులు, ముసాంబరము 46 గ్రయినులు, గోధుమపిండి (మెత్తనిది) 12 గ్రయినులు, ఆయిల్ పీనీ (Oil Pini) చు 2 చుక్కలు, మొత్తమును కలిపి 100 మాత్రలను చేయుము. డోసు-ఒక్కొక్క మాత్రను, ఉదయము సాయంత్రము. అప్పుడు తోడిన నీటితో పుచ్చుకొనవలయును. నియమరహితముగా నున్న ఋతుస్రావములపై యిది చక్కగా పనిచేయును.

## 40 ద వా యే ది క్

దీనికి ఢిల్లీలో ప్రచారము కలదు. క్షయను పోగొట్ట కలదని ప్రకటింపబడి యున్నది. క్షయ ప్రథమావస్థలో మటు కిది పనిచేయ గలదు.

నల్లమిరియాలు, చిన్న యేలకులు, వెదురుప్పు శుద్ధిచేయబడిన జీడిగింజలు, తిప్పసత్తు, వీటిని సమభాగములు చూర్ణము చేయుము. డోసు - 1 గురిగింజ ప్రమాణపు మందును, ఒక్క అరపావు శేరు మేకపాలతో పుచ్చుకొనుట ప్రారంభింపవలెను. పాలను ప్రతి దినము 2 తులముల చొప్పున దిన దినాభివృద్ధి చేయవలయును. ఇది జీర్ణ జ్వరములపై పనిచేయుచున్నది.

## 41 డోన్ ఆయింట్ మెంట్

ఇది అమెరికాలో పేటెంటు చేయబడినది. తామర, మొలలు, మొటిమలకు ఉపయోగకరమైనది.

కాల్ మెల్ 36 భాగములు, జింకాక్ సయిడ్ 11 భాగములు, కార్బోలిక్ యాసిడ్ 1 భాగము, మైనము రెండుభాగములు, సాఫ్ట్ ఫర్ ఫీన్ 49 భాగములు, మొత్తమును కలిపి ఆయింట్ మెంట్ చేసి డబ్బీలో నుంచుము.

## 42 డోన్ కిడ్నీ పిల్స్

ఇది కూడ పైస్థానమందే పేటెంటు చేయబడినది. పెట్టెలో 40 మాత్ర లుండును. మూత్రాశయ జాడ్యములపై యిది పనిచేయు నని ప్రకటింప బడియున్నది.

ఆయిల్ ఆఫ్ జునీపర్ 10 గ్రెయినులు, రేవల్చిన్ని 10 గ్రెయినులు, హేమలోక బీజములు (Cenni Fructus) 10 గ్రెయినులు, సూరేకారము 5 గ్రయినులు, పౌడర్ ఫినోగ్ రెక్ (Powder Foenu, grec) 18 గ్రెయినులు, గోధుమపిండి 4 గ్రెయినులు, జొన్నలపిండి 2 గ్రెయినులు, వీటి నన్నిటిని బంక నీటితో నూరి 20 మాత్రలను చేయుము. మొట్టమొదట 2 మొదలు 4 మాత్రలవరకు రాత్రిపూట పుచ్చుకొనవలయును. పిమ్మట పగలు ఒక్కొక్క మాత్ర చొప్పున భోజనానంతరము రెండుమార్లు రాత్రి భోజనానంతరము పండుకొన బోవునప్పుడు ఒక్కమాత్ర చొప్పున. పుచ్చుకొనవలయును. నడుము నొప్పులు, కీళ్ళనొప్పులు, మధుమేహము, వాపు మూత్రాశయ జాడ్యములు, మూత్రాశ్మరి వీటిపై యిది పనిచేయకలదు.

## 43 డోన్ డిన్నర్ పిల్స్

ఇదికూడ అమెరికాలో పేటెంటు చేయబడినది. మాత్రలపై సుగర్ కోటింగ్ యివ్వబడి యుండును. అన్నిచోట్లను యిది విక్రయింపబడుచున్నది.

పిప్పరమెంటు ఆయిల్ 1 చుక్క, పోడాఫిలీన్ (Poda Phyllin) 4 గ్రెయినులు, ఎలోయిన్ (Alain) 8 గ్రెయినులు. జాలప్ రోసీనా (Jalap Resina) 1 గ్రెయిను, యర్రమిరియాలచూర్ణము ½ గ్రెయిను, అతి మధురపు చూర్ణము ½ గ్రయిను, జొన్నల పిండి ½ గ్రెయిను, తుమ్మబంక 1½ గ్రెయినులు, ఖురాసాని సత్వము (Extract Hyo-seyami) 1½ గ్రెయినులు. వీటినన్నింటినీ కలిపి బంకనీటితో, ½ గ్రె)ను ప్రమాణ ముండునట్లు మాత్రలను చేసి వాటిపై సుగర్ కోటింగు నిమ్ము. డోసు – 1 నుండి 2 మాత్రలవరకు. యిది అజీర్ణమును. యకృత్, మేహ జాడ్యములను పోగొట్టకలదు.

## 44 జాంద్రపేట చూర్ణము

ఇతి గుత్తి వెంకయ్య అండ్ సన్స్, శ్రీ వేంకటేశ్వరాయు ర్వేదాలయము, జాంద్రపేట (గుంటూరు జిల్లా) వారిచే తయారు చేయబడుచున్నది. ఒక్క ప్యాకెట్టు ఖరీదు 1–0–0. యిది పాండు, నీరు, నంజు ప్రదరవ్యాధులను పోగొట్టి రక్తవృద్ధిని చేయు ననియును, సర్వవ్యాధులకును సంజీవివంటి దనియును ప్రకటింపబడియున్నది.

ఇది మండూరపు భస్మము. రసాయనికౌషధము. చాల తేలికగా తయారు చేయబడుచున్నది. అనుపాన బలముచే సుగుణ మును యీయగలదు. రక్తమును వృద్ధిపరచుచూ పాండు, ఎనీ మియా మొదలగు రక్త క్షీణతగలుగు వ్యాధులపై పనిచేయగలదు.

మండూరమును తీసుకొని నిప్పుపై కాల్చి గోమూత్రములో వేయుము. యిటుల యేడుమార్లు చేసిన పిమ్మట దానిని చూర్ణ మొనర్చి నీటితో మూడు నాలుగుమార్లు పరిశుభ్రముగా కడిగి యెండ బెట్టుము. కలబంద రసముతో యీ చూర్ణమును చక్కగా మర్దించి మాత్రలను జేసి యెండించి శరావ సంపుట మొనర్చి గజపుటము పెట్టవలయును. పిమ్మట దీనిని భస్మమొనర్చి ఉపయోగింపవచ్చును.

## 45 డేవి వల్లో

ఇది తామరకు పనికివచ్చు మందు. విదేశములలో తయారు చేయబడుచున్నది. 6 డ్రాములు ప్రమాణముగల మందు సీసా 13 అణాలు. తామరకు ఉపయోగకరమైనది.

ఫెర్రీసల్ఫ (Ferri Sulph) 32½ భాగములు, ఎసిటిక్ యాసిడ్ (Acid Acetic) 12 భాగములు, రెంటినీ చక్కగా కలిపి సీసాలో నుంచుము. రెండు దినముల కొకతూరి దీనిని బ్రష్‌తో తామరపై వ్రాయుచుండవలయును.

## 46 డెమాయేడిన్

సీసాలో 26 బిళ్ళలుండును. ఇది విదేశమునుండి దిగుమతి చేయబడుచున్నది.

అయిరన్ ఫాస్ఫేట్ 55 గ్రెయినులు, క్వైనైన్ సల్ఫ 12 గ్రెయినులు. అభ్రక చూర్ణము 16 గ్రెయినులు. యక్స్‌ట్రాక్టు డామియానా (Extract Damiana) 200 గ్రెయినులు. తెల్ల చక్కెర 50 గ్రెయినులు. వీటినన్నిటినీ బంక నీటితో కలిపి 26 బిళ్ళలను చేయుము. డోసు – 1 బిళ్ళ. దినమునకు 3 పర్యాయములు. దీనిచే బలహీనత తగ్గి వాజీకరణ శక్తి వృద్ధినొందగలదు.

## 47 రూహ్ జీవన్ బూటీ

ఇది కాశ్మీర్‌లో డాక్టర్ మహమ్మద్ ఆలీ సాహెబుచే పేటెంటు చేయబడినది. హిందూదేశమందే గాక, విదేశములలో గూడ యిది విక్రయింపబడుచున్నది.

శంఖ పాషాణము 1 భాగము, యింగిలీకము 1 భాగము రత్నజ్యోతి చూర్ణము 1 భాగము, ఉష్ట్రకంటకములు వేరు 2 భాగ

ములు వీటిని 5 శేర్ల పాలలో కలిపి పాలను తోడుపెట్టి వెన్నతీసి నేతిని తయారుచేయుము. దీనిని సీసాలలో నుంచుము. మోసు - 5 చుక్కలు. అరశేరు పాలలోగాని లేక రెండుతులముల వెన్నలోగాని అరపావుశేరు పాల్వాలోగాని కలిపి పుచ్చుకొనవలయును. పాలను కావలసినన్నింటిని త్రాగవచ్చును. ఇదిచక్కని వాజీకర ణౌషధము. జీర్ణశక్తిని వృద్ధిపరచి శరీరమునకు శక్తినిచ్చును. దీనిచే పాలు, నేయి మొదలగుపదార్థములు చక్కగా జర్ణమై శరీరకాంతి వృద్ధిగొందగలదు.

## 48 బ్రైన్ అంబర్

ఇది డాక్టర్ అహమదు ఆలీఖాచే పేటెంటు చేయబడినది. వర్ణనానుసారము యిందు గుణము కలదు.

బ్రాహ్మీ 1 శేరు, పర్పాటి 1 శేరు. చందనపొడి 1 పావుశేరు, పొగడ 2½ పావుశేర్లు, పెద్దకర్పూరము 3 పావుశేర్లు జటామాంసి 10 తులములు, బోడతరము ½ శేరు, ధనియాలు 1 పావుశేరు కర్పూరములు 10 తులములు, వస 10 తులములు, కర్పూరము 10 తులములు వీటి నన్నింటిని కలిపి. వీటకు 16 రెట్లు అధికమగు నీటితో కలిపి ఉంచుము. మరుసటి ఉదయమున దీనిని ¼ వంతు మిగులునట్లు కాచి, దించి, చక్కగాకలిపి వడగట్టుము. యిందు 10 శేర్ల నువ్వుల నూనెను కలిపి నిప్పుపైనుంచి నీరు యిగురువరకు కాచి దించి వడ పోయుము యిందు తులము అంబరు, 6 మాషములు కమలా ఫలపు తైలము కలిపి సీసాలో పోయుము ఆవశ్యకతానుసారము దీనిని ఉపయోగింప వచ్చును. దృష్టిశక్తి, మస్తిష్కశక్తి వృద్ధినొంద గలవు. వెంట్రుకలు నల్లగాను మృదువుగాను ఉండగలవు. తలనొప్పి తగ్గిపోగలదు.

## 49 జయమ్ ఆయింట్ మెంటు

ఇది లండనులో తయారు చేయబడుచున్నది. సీసాలోజొన్న ప్రమాణముగల మందు గలదు. ఒక చిన్న సబ్బుముక్క గూడ

ప్యాకెట్టులో నుండును. ముందుగా సోపుతో కడిగి పిమ్మట అచ్చట మందును వ్రాయవలయును గజ్జి, తామర, తీట, పుండ్లు, మొదలగు వాటికి ఉపయోగకరమైనది.

క్యాల్‌మెల్ 2 1/6 భాగములు, లెడ్ యెసీటేడ్ (Lead Acitade) 1 భాగము, లెడ్ ఓలిపట్ 2½ భాగములు, ఆలివ్ ఆయిల్ 2 భాగములు, గ్లిజరిన 5 భాగములు, క్రియజోట్ 1 చుక్క, ఫర్ఫీన్ 87 భాగములు, సువాసనకొరకు ఆయిల్ ఆఫ్ లెమన్ గ్రాస్. వీటి నన్నింటినీ కలిపి ఆయింటుమెంటు తయారు చేయుము.

## 50 జద్ జామ్ అశ్క్ బుజుర్గ

ఇది డాక్టర్ నూరుద్దీన్ చే పేటెంటు చేయబడినది. కాశ్మీరములో దీనికి చక్కని ప్రసిద్ధి కలదు. ఇది వాజీకర ఔషధము.

శొంఠి 6 భాగములు, కస్తూరి 6 భాగములు, కుంకుమపువ్వు 1 భాగము, దాల్చినచెక్క 1 భాగము, జాజికాయ 1 భాగము, పిప్పలి 1 భాగము, జాపత్రి 1 భాగము, నల్లమందు 1 భాగము, ముత్యములు 1 భాగము, అక్కలకర్ర 1 భాగము, అంబరు 1 భాగము, యింగిలీకము 1 భాగము అశ్వగంధ (నవనగరపుది) 4 భాగములు. చల్లగడ్డలు 6 భాగములు, కుసుంభా బీజములు 3 భాగములు, శుద్ధిచేయబడిన విషముష్టి 1½ భాగములు, మొదట కుంకుమ పువ్వు, కస్తూరి, ముత్యములు, నల్లమందు, వీటిని * లతాకస్తూరీ అర్కముతో కలిపి నూరి పిమ్మట మిగిలిన వస్తువులను మెత్తగా చేసి అందు కలుపుము. మందు తయారు కాగలదు. డోసు – 1, 2, గురిగింజల ప్రమాణము. చేపనూనెతో పుచ్చుకొనవలయును.

## 51 జాంబర్

విదేశపు ఆయింట్‌మెంటు. దీని ప్రకటనను వార్తా పత్రికలలో కూడ చూడవచ్చును.

---

* యూనానీ ఫార్మశీలలో దొరకును.

ఆయిల్ యూకలిప్టస్ 14 భాగములు, క్లోరోఫినీ 20 భాగములు, సాఫ్ట్ పర్ఫిన్ 55 భాగములు, హార్డ్ పర్ఫీన్ 11 భాగములు, కొంచెము ఆకుపచ్చ రంగు. వీటి నన్నింటినీ కలిపి డబ్బీలో నుంచుము. అవసరమగునప్పుడు దీనిని పుండ్లు, గాయములు, మొదలగు వాటిపై వ్రాయవచ్చును.

## 52 స్ట్రైంట్ హెడెక్ క్యూర్

అమెరికాలో పేటెంటు చేయబడినది. పెట్టెలో 12 బిళ్ళ లుండును. వివిధములగు బాధలకు యిది ఉపయోగకరమైనది.

యాంటీ ఫేబరీన్ 6 డ్రాముల 32 గ్రెయినులు, కెఫీన్ సిట్రస్ 1 డ్రాము 32 గ్రెయినులు సుగర్ ఆఫ్ మిల్కు (Sugar of Milk) 1 ఔన్సు 1 గ్రయినులు. మొత్తమును కలిపి 100 బిళ్ళలను చేయుము. డోసు – ఒక్క బిళ్ళను నీటిలోవేయుము. అది మీగడ వలె మెత్తబడిన వెంటనే, ఒక్క గ్రుక్కలో – బిళ్ళ విరిగి పోకుండు నట్లుగా, దానిని మ్రింగివేయుము. బాధ తగ్గనిచో రెండు గంటలుండి తిరిగి యిదే విధముగా పుచ్చుకొనవలయును. వివిధములగు నొప్పులను యిది తగ్గించి వేయగలదు.

## 53 టీథింగ్ పౌడరు (Teething Powder)

ఇది విడి విడి పొట్లములుగా నుండును. పిల్లలకు పండ్లు వచ్చునప్పుడిది ఉపయోగింప బడతగినది.

క్యాల్ మెల్ 29 భాగములు, సుగర్ ఆఫ్ మిల్కు 71 భాగములు, రెంటినీ కలిపి 2½ గ్రెయినుల ప్రమాణ ముండునట్లు పొట్లములు కట్టుము.

డోసు – 6 మాసముల పిల్లలకు ఒక్క పొట్లము, అంతకు తక్కువ వయస్సు గలవారికి ½, ¼ పొట్లమును యివ్వవలెను. పిల్లలకు దంతములను సులభముగా వచ్చునట్లు చేయగలదు.

## 54 సఫూప్ ముగల్లిజ్ జదీద్

హిందూస్థానీ దవాఖానా. ఢిల్లీలో యిది పేటెంటు చేయబడి వది. ధాతుస్రావమునకు ఉత్తమమైన మందని యెంచబడుచున్నది.

దాల్చిన చెక్క, లవంగములు, ఖురాసాని వాము, 6, 6 గురిగింజల యెత్తు. పెద్దయాలకులు, జాపత్రి. జాజికాయ, 2, 2, మాషములు, బూరుగుబంక 4 మాషములు సాలామిశ్రి 6 మాష ములు, గోధుమ సత్వము 9 మాషములు. వీటనన్నింటిని నూరి దీనికి సమభాగముండునట్లు కలకండ కలుపుము డోసు - 7 మాష ముల ప్రమాణము. ఉదయము, సాయంత్రము పాలు, లేక నీటితో దీనిని పుచ్చుకొనవలయును.

## 55 నమక్ సులేమానీ

ఇది యీ పేరుతో చాలా కంపెనీలలో తయారు చేయబడు చున్నది. కాని యిచ్చట హిందూస్థానీ దవాఖానా, ఢిల్లీలో తయారు చేయబడిన దాని విషయమై వ్రాయుచున్నాము.

సైంధవ లవణము, సాంభారు లవణము, సౌవర్చ లవణము, నవా సాగరము, యివి 7, 7, తులములు, అజామోదము, వాము, మిరియాలు, శొంఠి, లవంగములు, నల్ల జీలకర్ర, జాజికాయ, జాపత్రి, యివి 1, 1, తులము. వీటినన్నింటినీ చక్కగా చూర్ణించి స్వచ్ఛమగు సిరకాతో ఫుడికించి యెండబెట్టుము. యెండిన పిదప తిరిగి దీనిని చూర్ణము చేయుము. డోసు - 2 నుండి 3 మాష ముల ప్రమాణము వరకు, ఆమాశయ శక్తిని వృద్ధినొందించగలదు.

## 56 సల్ ఫోలీన్ లోషన్

యిది లండనులోని ఒక లిమిటెడ్ కంపెనీచే తయారు చేయ బడుచున్నది. సీసాలో రెండు ఔన్సుల మందుండును. యిది గజ్జి,

తేటు, తామర, మొటిమలు మొదలగు వివిధ చర్మరోగములకు ఉపయోగకరమైనది.

సల్ఫర్ ప్రసిపేటెడ్ 20 భాగములు, గ్లిజరిన్ 90 భాగములు, జింకాక్సయిడ్ 21 భాగములు, కాల్షియం సల్ఫేట్ 60 భాగములు, మిగిలినది స్ప్రింగ్ రోజువాటరు. మొత్తము 1000 భాగములుండు నట్లు చేయుము. రాత్రి పరుండ బోవునప్పుడు సన్నని గుడ్డను యీ మందులో తడిపి పైన వేయ వలయును.

### 57 తిలాముశ్క

ఢిల్లీలో ప్రసిద్ధి నొంది నట్టిది.

యింగిలీకము, హరతాళకము, పాదరసము, కంపిల్లకము, ఉల్లి, నులితడప, అక్కలకర్ర, దాల్చిన చెక్క: వీటి నన్నింటినీ నూరి వస్త్రకాగితము బట్టి అందు కొద్దిగా కస్తూరిని కలిపి ఆవు పిత్తముతో ! నూరి ఉంచుము. డోసు - 2 గురిగింజల యెత్తునుండి 4 గురిగింజల యెత్తువరకు. దీనిని అంగముపై బాగుగా రుద్ది తమలపాకులను వేసి కట్టుచుండవలెను. యిది అంగమును శక్తివంతముగాను, దృఢము గాను ఉండునట్లు చేయగలదు.

### 58 తిలా హీరా

ఇది డాక్టర్ అజమల్ ఖాచే హిందూస్థానీ దవాఖానా ఢిల్లీలో తయారు చేయబడు చున్నది. అంగదోషము లన్నింటినీ పూర్తిగా పోగొట్టి వాజీకరణ శక్తి నిచ్చును.

పచ్చ పాషాణపు మైనము 3 తులములు, బంగారు భస్మము, మాషము, వజ్రపు చూర్ణము 3 గురిగింజల యెత్తు, శుద్ధి చేయబడిన పాదరసము 1 తులము. వీటిని నిమ్మరసముతో మూడుదినములు చక్కగా నూరి గురిగింజ ప్రమాణముండునట్లు మాత్రలు చేయుము. అవసరమగు నప్పుడు ఒక్క మాత్రను చలినీటితో గాని, మంచు

నీళ్ళతోగాని అరిగి నీసి వ్రాసి పైన ఆముదపాకులను కట్టవలయును. యిటుల 20 దినముల పర్యంతము చేయుచుండ వలయును. దద్దురులు లేచినచో మందును ఆపి నేయవలయును

## 59 పాస్ఫోరిన్

ఇది లండనులో తయారుచేయబడుచున్నది. మందు ఔన్సు ప్రమాణముగల సీసాలతోను, రెండు డ్రాముల ప్రమాణముగల సీసాలతోను విక్రయింప బడుచున్నది. మందు గుణయుక్తమైనది.

క్వినైన్ సల్ఫేట్ 68 భాగములు, డయిల్యూట్ సల్ఫ్యూరిక్ యాసిడ్ 250 భాగములు, డయిల్యూట్ ఫాస్ఫారిక్ యాసిడ్ 5460 భాగములు, ఆల్కాహాలు 810 భాగములు, మిగిలినది నీరు. మొత్తము 10000 భాగము లుండునట్లు చూడుము.

డోసు - 5 నుండి 10 చుక్కల వరకు. దినమునకు 3 - 4 మార్లు పుచ్చుకొనవలెను. దీనిచే నరముల బలహీనత. యిన్ ఫ్లూయింజా, అజీర్ణము. సోమరితనము, తలనొప్పి. నడుమునొప్పి మొదలగునవి తగ్గిపోగలవు.

## 60 అర్కసూజాక్

హిందూస్థానీ దవాఖానా, ఢిల్లీలో యిది తయారు చేయబడుచున్నది. గనేరియాను పోగొట్టకలదు.

పచ్చిఫనియాల రసము 10 తులములు, స్పిరిట్ ఆఫ్ ఫ్రెంచ్ వైన్ 3 తులములు, చందన తైలము 6 మాషములు, మొత్తమును కలుపుము. డోసు - 1 తులము. దినమునకు మూడు పర్యాయములు పుచ్చుకొనవలయును. చురుకు, మంట, నొప్పి, రక్తము వెడలుట, మూత్రనాళములోని కురుపులు మొదలగునవి తగ్గిపోగలవు.

## 61 స్వర్ణ భస్మము

ఇది హైదరాబాదులో డాక్టర్ జనాబ్ నవీనా సాహేబ్ చే తయారు చేయబడుచున్నది. దీనికి చక్కని ప్రసిద్ధిగలదు.

బంగారు రేకులు, బాదరంజ్ బోయా ఆకులు, మొదట ఆకులను నీటితో రాత్రిపూట తడిపివుంచి ఉదయముననే వాటిని ఉడికించి పరిశుభ్రము చేయుము. బంగారు రేకులను అందుకలిపి నూరి 5 శేర్ల బొగ్గులపై కాల్చుము. యీ తుల 5 నూర్లు చేసినచో గులాబీ రంగు గల భస్మము తయారగును. డోసు–$\frac{1}{8}$ గురిగింజ ప్రమాణము యిది శరీరమునకు పరిపూర్ణమగు శక్తిని యివ్వగలదు

## 62 కోకోఫాస్

ఇది లండనులోని ఒక లిమిటెడ్ కంపెనీచే తయారు చేయబడుచున్నది. సీసాలో 94 బిళ్లలుండును. ఖరీదు 3–6–0.

అయిరన్ హైపోఫాస్ఫేట్ $\frac{78}{100}$ గ్రెయినులు, క్వైనైను $\frac{1}{10}$ గ్రెయిను యక్స్ట్రాక్టు డామియానా 2 గ్రెయినులు. మొత్తమును కలిపి బిళ్లలను చేయుము. డోసు –1 బిళ్ల ఉదయము సాయంత్రము భోజనానంతరము పుచ్చుకొనవలయును. యిది బలహీనతను పోగొట్టి శక్తిని వృద్ధి నొందించగల వాజీకర ఔషధము

## 63 కోకో

ఇది కూడ లండనులోనే తయారుచేయబడు చున్నది. 12 ఔన్సుల తరళౌషధము గల సీసా ఖరీదు $3\frac{1}{2}$ రూపాయలు. ఇది వెంట్రుకలను వూడిపోకుండునట్లు చేసి వాటిని వృద్ధి నొందించగలదు. దీనిని బ్రష్‌తో వెంట్రుకలకు వ్రాయుచుండవలెను.

వెలిగారము $1\frac{1}{3}$ భాగములు, గ్లిజరిన్ $1\frac{1}{10}$ భాగములు, ఫారమల్డిహైడ్ సొల్యూషన్ (Formaldehyd Solution) 40% కలది

$\frac{1}{10}$ం భాగములు. ఆల్కాహాలు 3 భాగములు, మిగిలినది నీరు. మొత్తము 100 భాగము లుండునట్లు చేయును.

### 64 కేటింగ్ కప్ లో జెంజెజ

ఇది లండనులో తయారు చేయబడుచున్నది. సీసాలో 50 టాబిలెట్లుండును. ఇది దగ్గును, శ్వాసను, కీచగొంతును పోగొట్టి శ్వాసను చక్కగా ఆడునట్లు చేయగలదు.

మార్ఫియా $\frac{1}{10}$ గ్రయినులు. యిపికాకుయేనా 10 గ్రయినులు అతిమధురపు సత్వము $3\frac{1}{8}$ డ్రాములు, చక్కెర $2\frac{3}{4}$ ఔన్సులు. మొత్తమును కలిపి 100 బిళ్ళలను చేయుము. దీనిని నోటిలో నుంచుకొని రసమును మ్రింగుచుండ వలయును.

### 65 Gordon,s Vital Sexualim Restoratim

ఇది యార్కుషైయిర్ లోని ఒక కంపెనిలో తయారుచేయబడుచున్నది. సీసాలో 21 ఔన్సుల ప్రమాణముగల మందుండును.

అయిరన్ హైపో ఫాస్ఫేట్ 8 గ్రెయినులు కాల్షియం హైపో ఫాస్ఫేట్ 28 గ్రెయినులు, సోడియం హైపో ఫాస్ఫేట్ 32 గ్రెయినులు పొటాసియం హైపో ఫాస్ఫేట్ 8 గ్రెయినులు, క్వైనైన్ సల్ఫ 28 గ్రెయినులు. సయిట్రిక్ యాసిడ్ 4$\frac{1}{2}$ గ్రెయినులు. కలకండ 51 గ్రయినులు, గ్లిజరిన్ 26 భాగములు, మిగిలినది నీరు. మొత్తము 21 ఔన్సు లుండునట్లు చేయుము. డోసు – 1 టీ చంచా ప్రమాణము దినమునకు 3 పర్యాయములు. భోజనాంతరము మందును నీటిలో కలిపి పుచ్చుకొనవలయును. దీనిచే వాత రోగము, అనిద్ర, అపస్మారము. ఉన్మాదము, బలహీనత యివి తగ్గిపోగలవు.

### 66 Lahore Sore Ointment

ఇది లాహోరులో డాక్టర్ మహమ్మద్ సాదిక్ సాహెబుచే తయారు చేయబడుచున్నది. మందు రెండు రకములుగా నున్నది.

No. 1. సాలిసయిలిక్ యాసిడ్ 15 గ్రెయినులు, సల్ఫేట్ ఆఫ్ కాపర్ 5 గ్రెయినులు, వ్యాసులైను 1 ఔన్సు. వీటిని చక్కగా కలిపి నూరి ఆయింటుమెంటు చేయుము.

No. 2 తుమ్మబంక 6 మాషములు, శంఖజీరకము 6 మాషములు, జంగాలీపచ్చ 6 మాషములు. వీటిని చూర్ణము చేయుము.

మొదట కొద్ది దినములవరకు No. 1 ఆయింటు మెంటును ఉపయోగింపుము. వ్రణము మెత్తబడిన పిమ్మట No. 2 మందును నిమ్మరసముతో కలిపి గుడ్డపై వ్రాసి అంటింపుము. గుడ్డకు మధ్య భాగమున సన్నని రంధ్రమును యేర్పరుపుము. గుడ్డ తనంతట తానుగా వూడునంత వరకు వూడదీయ వలదు.

## 66 Lenosco

యింగ్లాండులో తయారు చేయబడుచున్నది. ఔన్సు సీసా ఖరీదు 13 అణాలు. నడుము నొప్పులు, సంధి నొప్పులు, మొదలగు వివిధ వాతబాధలపై యిది పనిచేయగలదు. గాయములు, పుండ్లు మొదలగు వాటిపై యిది వాడబడుట లేదు.

ఓలియో రేజన్ ఆఫ్ కాప్సికమ్ 3 గ్రెయిలు, క్యాంఫర్ 6 గ్రెయినులు, ఆయిల్ ఆఫ్ లవండర్ 3 చుక్కలు, ఆయిల్ ఆఫ్ రోజుమరీ 4 చుక్కలు, సోపు ½ గ్రెయిను, ఆల్కాహాలు 1 ఔన్సు మొత్తమును కలియునట్లు చేయుము. మందును కొద్దిగా దూది పుల్లతో నొప్పిగలచోట వ్రాయవలయును.

## 68 మాయ్ ఉల్జ్ హబ్

ఇది హిందూస్థానీ దవాఖానా, ఢిల్లీలో తయారు చేయబడుచున్నది. అన్ని ప్రాంతములందును దీనికి చక్కని ప్రచారము కలదు.

సయిట్రిక్ యాసిడ్ 3 భాగములు. యాసిడ్ మ్యూరియాటికమ్ 4 భాగములు. యీ రెంటినీ ఒక పెద్దసీసాలో నుంచి

కలుపుము. సీసా మూతిని కొద్దిగా తెరచి వుంచుము, ఇందులో నుండి ఒక్క తులము ప్రమాణమును తీసుకొని అందు 6 మాషముల ప్రమాణము బంగారమునువేయుము. కొద్దిసేపటికి అది కరిగిపోవును. పిమ్మట అందు మూడుతులములనీటిని కలుపుము. డోసు-5చుక్కలు తగిన అనుపానముతో పుచ్చుకొనవలయును, బంగారమునకు గల గుణములన్నియు దీనికి కలవు

## 69 సూదింగ్ సిరప్

ఇది న్యూయార్కులో తయారు చేయబడి అన్ని ప్రాంతములలోను విక్రయించ బడుచున్నది. సీసాలో $1\frac{1}{2}$ ఔన్సుల ప్రమాణముగల మందుండును.

పొటాషియం బ్రొమయిడ్ 20 భాగములు. ఆల్కాహాలు 43 భాగములు. సోపుతైలము 1 భాగము, చక్కెర 565 భాగములు, చక్కెరను పర్బత్తుచేసి అందు పై మందులను కలుపుము. వయస్సును అనుసరించి 6 చుక్కలనుండి 1 డ్రాముపరకు, పిల్లల గర్భాశయ జాడ్యములకు, నొప్పులకు, దంతశాధలకు ఉపయోగకరమైనది.

## 70 హాపెక్ జనీన్ లేహ్యము

ఇది కాశ్మీర్‌లో పేటెంటు చేయబడినది. గర్భస్రావములను ఆపి యిది గర్భస్థిత శిశు రక్షణను చేయగలదు.

దెబ్బతినిన ముత్యములు. కహారుబా, శవాక్షి, ఊద్‌సలీబ్ * యివి 11, 11 మాషములు, గైరికము, ముత్యపుచిప్ప భస్మము, పట్టుపురుగులగూళ్ళు, మాజుఫలము, అంజుబహార్ * తెల్లచందనము, రక్తచందనము, వృశ్చికాలీ (తేలుమణిచెట్టు) యివి 1, 1 మాషము, వడ్లు 22 మాషములు. పెద్ద దోసవిత్తుల పప్పు $32\frac{1}{2}$ మాషములు, వెండిరేకులు 20, బంగారు రేకులు, 12, తియ్యదానిమ్మఉప్పు. పుల్ల

* యూనానీ ఫార్మసిలలో దొరుక గలవు

దానిమ్మ్మడుప్పు, 5, 5, తులములు, అంబరు 8 మాషములు, కలకండ 1 శేరు (80 తులములు), తేనె 15 తులములు, వీటి నన్నింటినీ కలిపి లేహ్యమును తయారుచేయుము.

## 71 Munyon's Pile Ointment

ఇది లండనులోనున్న ఒక హోమియోపతిక్ కంపెనీలో తయారు చేయబడుచున్నది. ఒక్క ట్యూబు ఖరీదు 12 అణాలు.

సాఫ్ట్ పర్ఫిన్‌ను కావలసినంత తీసుకొని అందు $\frac{1}{500}$ భాగము యిక్థోల్ (Icthyol) ను కలిపి ట్యూబులలో నుంచుము మొలల వ్యాధికిది ఉపయోగకరమైనది. దురద, వాపులకుగూడ పనికివచ్చును.

## 72 William's Pink Pills

అమెరికాలో యిది తయారుచేయబడుచున్నది. పెట్టెలో 30 మాత్రలు గలవు. మాత్రలపై మెరుపురంగు గలసిన పంచదారతో కోటింగు యివ్వబడి యున్నది.

అయిరన్ సల్ఫేట్ 750 గ్రెయినులు, పొటాస్ కార్బొనేట్ 66 గ్రెయినులు, మెగ్నీషియా 9 గ్రెయినులు. అతిమధురపుచూర్ణము 40 గ్రెయినులు, పంచదార 20 గ్రెయినులు. వీటి నన్నింటినీ కలిపి 100 మాత్రలను చేయుము. డోసు – 1 మాత్ర. దినమునకు 3 పర్యాయములు చొప్పున యివ్వవలయును. యిది నడుము నొప్పులు, అజీర్ణము, జలుబు, బలహీనత, మొదలగు వాటిపై పనిచేయును.

## 73 Wood ward's Gripe Water

సీసాలో 5 ఔన్సుల మందుండును. శిశువుల సమస్త వ్యాధుల కును పనికి వచ్చును. పిల్లలకు పండ్లు వచ్చునప్పుడు కలుగు వివిధ జాడ్యములపై చాల చక్కగా పనిచేయ గలదు. డోసు – $\frac{1}{2}$ టీ

చంచా ప్రమాణమునుండి 2 చంచాల ప్రమాణము వరకు, వయస్సును అనుసరించి యివ్వవలయును.

సోడియం బై కార్బోనేట్ 1$\frac{8}{10}$ భాగములు, ఆల్కాహాలు $\frac{3}{10}$ భాగములు, పంచదార 20$\frac{1}{2}$ భాగములు, సోపు తైలము $\frac{3}{10}$ భాగములు, మిగిలినది నీరు. మొత్తము 100 నూరు భాగము లుండునట్లు చేయుము.

## 74 Harvey's Blood Pills

ఇది యింగ్లాండులో తయారు చేయబడుచున్నది. సీసాలో 20 మాత్రలుండును.

క్వినైన్ సల్ఫ 18 గ్రెయినులు, పొటాసు అయోడయిడ్ 22 గ్రెయినులు, పల్వ రుబార్బ 16 గ్రెయినులు, అతిమధురపు చూర్ణము 8 గ్రెయినులు, యెక్స్ట్రాక్ట్ సారస్పరిల్లా 12 గ్రెయినులు, యెక్స్ట్రాక్ట్ బర్ బేరిస్ 12 గ్రెయినులు, యెక్స్ట్రాక్ట్ టెరాక్సనీ 12 గ్రెయినులు, మొత్తమును కలిపి 36 మాత్రలను చేయుము. డోసు - పూర్ణవయస్కులకు 1, 1, మాత్ర, దినమునకు 2 మారులు. ఉదయము సాయంత్రము. పిల్లలకు రాత్రిపూట 1 మాత్ర. దీనిచే వివిధములగు గాయములు, గజ్జి, దురద, మూల వ్యాధి, కీళ్ళనొప్పులు, (Arrisiples) తగ్గిపోగలవు.

## 75 Holdroyd's gravel pills

ఇంగ్లాండులో తయారు చేయబడుచున్నది. సీసాలో 25 మాత్రలుండును. ఇది నడుము నొప్పులును, జీర్ణాశయ వ్యాధులు, మూత్రాశ్మరి, కీళ్ళ నొప్పులు, నరములు లాగుట, మొదలగు వాటిపై పనిచేయును.

సోపు 40 భాగములు, సోడా కార్బోనేట్ 20 భాగములు, పౌడర్ రుబార్బ 20 భాగములు, సోపుతైలము 10 భాగములు.

సర్వత్తు 10 భాగములు. వీటి నన్నింటినీ కలిపి 4, 4, గ్రయినుల ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. డోసు - 2, 2 మాత్రలు. ఉదయము, మధ్యాహ్నము, సాయంత్రము. దినమునకు మూడు పర్యాయములు పుచ్చుకొనవలయును.

## 76 స్ప్లీన్‌క్యూర్

ఇది అలహాబాదులో పేటెంటు చేయబడినది. 30 మాత్రలు గల సీసా ఖరీదు 1 రూపాయి. దీనిచే స్ప్లీన్ పూర్తిగా తగ్గిపోవు చున్నది.

ఫాస్ఫేట్ ఆఫ్ అయిరన్ 2 మాషములు, క్వినైన్ 1 మాషము, శంఖపాషాణము ½ గురిగింజయెత్తు. ముసాంబరము 4 మాషములు, కొలోసింథ్ 3 మాషములు, సూరేకారము (వంటఉప్పు) 2 మాషములు, మొత్తమును కలిపినూరి 30 మాత్రలను చేయుము. డోసు - ఉదయము సాయంత్రము ఒక్కొక్క మాత్ర.

## 77 తిర్‌యాక్ అఫ్‌యూన్

భూపాలులో పేటెంటు చేయబడినది., దీని కచ్చుట చక్కని ప్రసిద్ధి కలదు. 20 మాత్రల ఖరీదు 1 రూపాయి. నల్లమందును వెడలగ్రక్కించుట కిది ఉపయోగకరమైనది. దీనిని పేటెంటు చేసిన మహాశయుడు యీపనికొరకై 2 రూపాయిలుపుచ్చుకొనుచున్నాడు.

కుంకుడుకాయ 1 మాషము. దీనిని చక్కగా నూరి మాత్రను చేయుము. యిటులనే కావలసి నన్నింటిని తయారు చేసుకొనవచ్చును. యిదే పై పేటెంటు మందు! అవసరమగు నప్పుడు ఒక్క మాత్రను ఒక్క పావుశేరు నీళ్ళలో వేసి చక్కగా పొంగులు వచ్చువరకు కాచి దించుము. దీనిని నల్లమందును తినినవారిచే త్రాగించినచో వమనములై నల్లమం దంతయు వెడలిపోవును.

## 78 ప్లేగ్ నాశక్ పిల్సు

బెల్గాములో తయారు చేయబడుచున్నది. 100 మాత్రలు గల సీసా ఖరీదు 1–8–0. ప్లేగుకు ఉపయోగకరమైనది.

ముసాంబరము 2 భాగములు, బాలింతబోళము 1 భాగము, కుంకుమపువ్వు 1 భాగము. వీటి నన్నింటిని చక్కగా నూరి తేనెకలిపి శనగగింజ ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము.

డోసు - 1 మాత్ర. దినమునకు రెండు పర్యాయములు. ఉదయము. సాయంత్రము. ప్లేగు వ్యాధిగల దినములలో దీనిని పుచ్చుకొనినచో ప్లేగు దరిజేర జాలదు.

## 79 గనేరియా క్యూర్

ఇది ఆయుర్వేద ఫార్మసీ, కలకత్తాలో పేటెంటు చేయబడినది. 2 ఔన్సుల సీసా ఖరీదు 3 రూపాయిలు. మందు ఉపయోగకరమైనది.

చలువ మిరియాలు 2½ తులములు, వెదురుప్పు 1 తులము, తెల్లజీలకర్ర 1 తులము. చిన్న యేలకులు 6 మాషములు, పొటాస్ కార్బోనేస్ 8 మాషములు, పిప్పరమెంటు ఆయిల్ 15 చుక్కలు. మొత్తమును చక్కగా నూరి చూర్ణ మొనర్చి అందు బాల్సమ్ కోపేబా కలిపి మృదువుగా నుండునట్లు చేయుము. డోసు – ½ డ్రాము. నీరు కలిపిన పాలతో దినమునకు 3 పర్యాయములు. ఇది నూతనము, పురాతనము అగునట్టి గనేరియాపై గూడ పనిచేయును.

## 80 అక్సీర్ కలరా

ఇది గూడ పై ఫార్మసీలోనే తయారు చేయబడుచున్నది. 100 మాత్రలు గల డబ్బీ ఖరీదు 1 రూపాయి. కలరా కిది ఉత్తమమైన ఔషధమని ప్రకటించబడి యున్నది. కలరా అంతిమ దశలో శరీరము కేవలము చల్లబడి నాడి అగిపోవుచున్నప్పుడు శరీరములో

చాల త్వరగా వ్యాపించి వెంటనే వేడిని పుట్టించి నాడిని చక్కగా ఆడునట్లు చేయగలదు.

క్యాల్ మెల్ ¼ గురిగింజ యెత్తును ఒక్క గురిగింజయెత్తు బెల్లములో, మధ్యనుంచి పొదుగుము. యిటులనే కావలసినన్ని మాత్రలను తయారు చేసుకొనవచ్చును. అరగంట కొక మాత్ర చొప్పున యివ్వవలయును. 4 మాత్రలు ఒక్కరోగికి సరిపోగలవు.

## 81 ఖారిశ్ క్యూర్

పై ఫార్మసీలోనే యిదికూడ పేటెంటు చేయబడినది. 3 ఔన్సుల ప్రమాణముగల సీసా ఖరీదు 1 రూపాయి. వివిధములగు చర్మవ్యాధులపై పనిచేయగలదని ప్రకటింప బడియున్నది. కాని తీట, గజ్జి, దురదలపై మాత్రము పనిచేయగలదు.

పొంగింపబడిన మైలతుత్తము 3 మాషములు, పాదరసము, గుగ్గిలము, కంపిల్లము, ముర్దారుసింగు, గంగసింధూరము, నల్లమిరియాలు, గోరంట ఆకులు, యివి 5, 6, మాషములు. వీటినన్నింటినీ చక్కగా నూరుము. 4 తులముల నేతిని 21 మార్లు నీళ్ళతో కలిపి కడిగి అందుపై చూర్ణమును కలుపుము. దీనిని ఆయింటుమెంటువలె ఉపయోగింపవచ్చును.

## 82 త్రైల్ అజీబ్

ఇది కూడ పైకంపెనీ మందే. క్షయరోగి శరీరముపై దీనిని మర్దించినచో వేడిని పారద్రోలి చల్లదనములు యీయగలదు. రొమ్ము, చేతులు, పాదములు, మొదలగు వాటిపై దీనిని మర్దించవలయును.

తిప్పసత్తు, కర్పూరము, వెదురుప్పు (పచ్చిది,) యివి 3, 3, తులములు. వీటినన్నింటినీ మెత్తగా నూరి కాచిన ఆవుపాలతో కలిపి తోడు పెట్టుము, యిందుండి వెన్నదీసి కరగించి సీసాలోనుంచుము

## 83 ప్రమేహ హరణ్

ఇది తిరుచునాపల్లిలో తయారు చేయబడుచున్నది. 20 మాత్రలు. 30 తులముల ప్రమాణముగల డబ్బీ ఖరీదు 2 రూపాయలు. మందు ఉపయోగకరమైనది.

ఇనుపగోలు గింజల పొట్టు 20 తులములు, తుమ్మచెట్టు పంచాంగములు 10 తులములు, తగరపు భస్మము 20 గురిగింజల యెత్తు. వీటినన్నిటినీ కలుపుము, డోసు - 1½ తులములు. దీనిని అర్థశేరు మేకపాలతో కలిపి కాచి కలకండ కలిపి త్రాగవలయును. వీర్య స్రావమును అతిత్వరగా ఆపివేయగలదు. యిది వాజీకరణౌషధము.

## 84 శ్వాస హరణ్

ఇది కవిరాజ యోగేంద్ర మహాశయునిచే తయారుచేయబడుచున్నది. ఔన్సు సీసా ఖరీదు 1 రూపాయి.

శొంఠి, వాము, ఖురాసానివాము, మిరియాలు, అజామోదము పిప్పలి మూలము, స్తాంభారు లవణము, సైంధవలవణము, సౌవర్చ లవణము. వీటిని సమభాగములుగా దీసుకొని వీటికి యూడు రెట్లు అధికమగు కలబంద రసముతో కలిపి, మొత్తమును ఒక మృణ్మయ పాత్రలోనుంచి శీలమన్ను యిచ్చి గజపుటము పెట్టుము. పిదప మందును తీసి జాగ్రత్త పరుపుము. డోసు- 1 మాషము. అల్లపురసముతో గాని, తేనెతో గాని పుచ్చుకొనవలయును. ఇది సర్వశ్వాస వ్యాధులకును పనిచేయునని ప్రకటింపబడి యున్నది. కాని కఫజ శ్వాసలపై మాత్రము యెక్కువగా ఉపయోగ పడగలదు.

## 85 గనేరియా క్యూర్

ఇది గూడ పైమహాశయుని మందే! ఒక్కదినములో గనేరియాను పోగొట్టగలదని ప్రకటింపబడి యున్నది. మందు రెండు రకములుగా నున్నది.

No. 1 దాల్చిన చెక్క చూర్ణము 5 తులములు, చలువ మిరియాల చూర్ణము 5 తులములు, వీటిని కలుపుము.

No. 2 ' చందన తైలము 3 మాషములు, గంధ బిరోజా తైలము 3 మాషములు, వీటిని కలుపుము.

మొదట 1 నెంబరు మందును 2 శేర్ల నీటిలో కలిపి మూడవ వంతు మిగులునట్లు కాచి దించి వడపోయుము. దీనిని సమానముగా 3గిన్నెలలోపోసి అందు 2 వ నెంబరుమందును 3 గిన్నెలలోనుసమాన ముగా కలుపుము. దీనిని పగలు 4, 4, గంటల కొకతూరి ఒక్కొక్క గిన్నెలోని మందును పుచ్చుకొనవలయును. మందు ఉపయోగకర మైనది. జీర్ణించిన గనేరియాపై గూడ పనిచేయును

## 86 మరహమ్ అజీబ్

ఇది గూడ పై మహాశయుని మందే! మందు చాల ఉప యోగకరమైనది. చాల పెద్ద పెద్ద గాయములు గూడ రెండు మూడు దినములలో మాని పోగలవు వాపు చాల త్వరగా తగ్గిపోవును.

స్పిరిట్స్ ఆఫ్ ఫ్రెంచ్ వయిన్ 1 భాగము, ఆయిల్ టెర్పెంటైన్ 1 భాగము, పసుపుపొడి. వీటిని చక్కగా కలిపి నూరి సీసాలో నుంచుము. అవసరమగు నప్పుడు దీనిని గుడ్డపై వ్రాసిగాని లేక ఆలాగే కాని వ్రణములపై వేయుము.

## 87 మరహమ్ ఉపదంశ్

ఇది ఉపదంశ క్షతములపై (Syphilecus) పనిచేయ గలదు. పై కవిరాజ మహాశయుని చేతనే యిదిగూడ తయారు చేయబడు చున్నది. ఔన్సు డబ్బీ ఖరీదు 1 రూపాయి.

మైనము 1 భాగము, నేయి, 6 భాగములు, కర్పూరము 2 భాగము, కాచు ½ భాగము, సత్తు భస్మము 1 భాగము, ముర్దారు

సింగు $\frac{1}{2}$ భాగము, శంఖ జీరకము $\frac{1}{3}$ భాగము, బోరిక్ యాసిడ్ $\frac{1}{2}$ భాగము, క్యాల్‌మెల్ $\frac{1}{3}$ భాగము, అయిడోఫారమ్ $\frac{1}{12}$ భాగము. వీటి నన్నింటినీ కలిపి ఆయింటు మెంటును తయారుచేయుము. దీనిని వ్రణములపై వ్రాయవలయును.

## 88 అర్కనేత్ర ప్రకాశ్

ఇది గూడ పై కవిరాజుగారి మందే! ఔన్సు సీసా ఖరీదు 4 అణాలు.

స్వచ్ఛమగు గోజువాటరు 1 ఔన్సు, సిల్వర్ నయిట్రేట్ 2 గ్రెయినులు. రెంటినీ కలిపి నీలి సీసాలో నుంచుము.

ప్రతి దఫా 2, 3, చుక్కలు కండ్లలో వేయుచుండుము. కండ్లు కలుగుట, నీరు కారుట మొదలగునవి తగ్గిపోగలవు.

## 89 శిశుసఖా

ఇది గూడ పై మహాశయుని మందే! పిల్లలకు చాల ఉపయోగకరమైనది. అజీర్ణము మొదలగు ఉదరరోగములపై చక్కగా పనిచేయును. 4 ఔన్సుల సీసా ఖరీదు. 8 అణాలు.

రేలగుజ్జు 1 భాగము. నీళ్ళు 2 భాగములు, చక్కెర 1 భాగము. వీటిని కలిపి షర్బత్తును తయారుచేసి అందు 1 డ్రాము ప్రమాణము స్పిరిట్ అమోనియా ఆరంమెట్‌ను కలుపుము. డోసు– 30 చుక్కల నుండి 1 డ్రాము వరకు. దినమునకు 3 మార్లు. దీనిని ప్రతిదినము ఒక్కొక్క మారు యిచ్చుచున్నచో పిల్లలు పొట్టి ఉదర వికారములు లేక పరిశుభ్రముగా నుండగలరు.

## 90 నేత్ర ప్రభ

ఇది గూడ పై కవిరాజుగారి మందే! యిది పడిశభారమును కండ్లమెరుపులను తగ్గించగలదు. మందు ఉపయోగకరమైనదే.

మైలతుత్తము, పటికి. పొటాస్ నయిట్రస్, యివి 7, 7 భాగములు, వీటినన్నిటినీ కలిపి కలికమును చేయుము. అవసరమగు నప్పుడు దీనిని కొద్దిగా కన్నులకు వ్రాయవలయును.

## 91 ప్రదరాంతక టీ

ఇది బొంబాయిలో ఒక చికిత్సకునిచే తయారు చేయబడు చున్నది. ఒక్క పావు శేరు డబ్బీ ఖరీదు 12 అణాలు. దీనిని టీ వలె ఉదయము సాయంత్రము పుచ్చుకొన వలయును. ప్రదర వ్యాధిపై పనిచేయగలదు.

పరిశుభ్రము చేయబడిన ఆరెపువ్వులు 20 తులములు, దంబుల్ ఆఫ్ వయిన్ 1 తులము, దంబుల్ ఆఫ్ వయిన్‌ను నీళ్ళతో కలిపి నూరి పువ్వులకు పట్టించి యెండబెట్టుము. డోసు – ప్రతిదఫా 6 మాషముల ప్రమాణము.

## 92 చర్మరోగ హర షర్బత్

ఇది ఆగ్రాలో తయారు చేయబడుచున్నది. రక్తశోధకమైన ఔషధము. లోపలికి పుచ్చుకొనుటకు వీలుండునట్లుగా తయారు చేయబడినది. దీనిచే పురాతనములగు చర్మవ్యాధులు, కీళ్ళవాతములు, సుఖరోగములు, మొదలగు రక్త వికారములన్నియు తగ్గిపోగలవు.

సుగంధిపాల 10 తులములు, చక్కెర 70 తులములు, నీళ్ళు 50 తులములు. మొదట సుగంధిపాలను చక్కగా నూరి చూర్ణము చేసి నీళ్ళతో కలిపి 24 గంటలు నానపెట్టి వడగట్టుము. ఇందు పంచదారను కలిపి షర్బత్తును తయారుచేసి 2 డ్రాములు యక్స్‌ట్రాక్ట్ సారస్పరిల్లా (Extract Sarsaparilla) కలుపుము. డోయ–1 తులము. తగిన అనుపానముతోగాని నీటితోగాని కలిపి పుచ్చుకొనవలయును.

## 93 పిఠాపురము మందు

దీనికి చక్కని ప్రసిద్ధికలదు. యిందన రామజోగి అండ్ సన్స్ (పిఠాపురము) వారిచే తయారు చేయబడుచున్నది. నెలరోజులకు సరిపోవు మందుకు షుమారు 10 రూపాయిలు వసూలు చేయబడు చున్నవి. ఇది పురాణ జ్వరములు, పాండు జ్వరములు, పాండు - నంజువ్యాధులు, ఉదరబల్లలు, నీరుబల్లలు, మొదలగువాటిని పోగొట్టు ననియును. జీర్ణకోశ వ్యాధులపై పనిచేయు ననియును ప్రకటింపబడి యున్నది. యిదేరకపుమందు "తాడికొండ" (గుంటూరు జిల్లా) లో గూడ వస్తువుల స్వల్ప పరిమాణ భేదముతో తయారు చేయబడు చున్నది.

కరక్కార 3 ఫలములు, తాడికాయలు 3 ఫలములు, నెల్లి కాయ 3 ఫలములు, మానుపసుపు 3 ఫలములు.

పుష్కరాపోడి 30 ఫలములు, పాతయినుపచిట్టెపు చూర్ణము 30 ఫలములు, సూదంటురాయి 15 ఫలములు.

పైనాల్గు వస్తువులను, దిగువనున్న మూడు వస్తువులను వేరు వేరుగా కలిపి చూర్ణము చేయుము.

14 శేర్ల ఆవు పంచితమును ఒకకుండలోపోసి అందు మొదటి నాల్గు వస్తువులమునుచూర్ణ ము నువేసినిప్పుపైనుంచుము. అదిబాగుగా కషాయమువలె కాగిన పిమ్మట మిగిలిన మూడు వస్తువుల చూర్ణ మును గూడ వేసి పంచితము యిగిరిపోవునంతవరకు కాలాగ్నితోను, గాఢాగ్నితోను వండి సాంగశీతకమైన పిమ్మట దించుము. యిది 10 నెలలకు సరిపోవు మందు. రోగి బలమును, పరిస్థితిని అనుసరించి డోసును, అనుపానమును నిర్ణయించుకొన వచ్చును. మందును పుచ్చు కొను కాలములో బలకరమగు పదార్థములను పుచ్చుకొనవలయును. నేతితో తయారు చేయబడిన గారెలు పుచ్చుకొనుట చాలామంచిది. యిందువలననే దీనికి పిఠాపురపు గారెల మందని గూడ ప్రసిద్ధి కలదు.

దీనిని దినమునకు రెండు పర్యాయములు పుచ్చుకొన వలయును. డోసు-పావుతులము.

## 94 సుర్మా కాపూరీ

ఇది పాపధునీ, బొంబాయిలో ప్రచారమం దున్నది. నేత్ర రోగముల కన్నింటికిని చక్కగా పనిచేయును. తులము సీసా ఖరీదు 2 రూపాయలు, దీనిని శలాకతో కంటిలో వేయవలయును.

స్రోతాంజనము 1 భాగము, సీసము 1 భాగము, సత్తుభస్మము 1 భాగము, మైలతుత్తము 1 భాగము, పిప్పలి 1 భాగము, పాదరసము 1 భాగము, రసాంజనము 1 భాగము, కర్పూరము 1 భాగము, వేపాకులు 1 భాగము, వీటి నన్నింటినీ చాల మెత్తగానూరి దీనిని రెండు రెట్లధికమగు సోపురసముతో కలిపి తిరిగి నూరి యెండింపుము యెండిన పిదప మెత్తగా నూరి సీసాలో నుంచుము.

## 95 మలేరియా హరన్

ఇది కలకత్తాలో ప్రచారమందున్నది. 40 మాత్రలుగల డబ్బీ ఖరీదు 1 రూపాయి. ఇది మలేరియా జ్వరముల నేగాక సర్వవిధ జ్వరములనుగూడ తగ్గించునని ప్రకటింపబడి యున్నది. పసిబిడ్డలు మొదలు వృద్ధులవరకు గూడ వాడవచ్చును. జ్వరముతోపాటు వమనములు విరేచనములు ఉన్నప్పుడుగూడ యిది పనిచేయుచున్నది.

పాదరసము 5 భాగములు, యింగిలీకము 5 భాగములు, మిరియాలు 5 భాగములు, పిప్పలి 5 భాగములు, కానుగవిత్తులచూర్ణము 20 భాగములు. వీటి నన్నింటినీ మెత్తగా జేసి జిల్లేడు రసముతో చక్కగా మర్దించి అరమాష ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. అవసరమగునప్పుడు ఒక్క మాత్రను జ్వరము వచ్చుటకు ముందుగా యోగ్యమగు అనుపానముతో యివ్వవలయును.

## 96 అక్సీర్ జిగర్ ఫౌలాద్

ఇది లాహోరులో తయారు చేయబడుచున్నది. ఆమాశయ యకృత్ జాడ్యములను హరించి రక్తమును వృద్ధిపరుప గలదు. జీర్ణ జ్వరములను గూడ యిది తగ్గించ గలదు.

రేవల్చిన్ని 1 భాగము, నవాసాగరము 1 భాగము, సూరే కారము 25 భాగములు, లోహభస్మము అరభాగము. వీటి నన్నిం టిని మెత్తగా నూరి పీసాలో నుంచుము. ఆవశ్యకతానుసారము 2 గురిగింజల ప్రమాణము ఉదయము, సాయంత్రము 7 మాషముల ప్రమాణము. * సాయంత్రమున జవారిన్ జాలీనూస్‌తో కలిపి నీటితో పుచ్చుకొన వలయును.

## 97 ఆబ్ హయాత్

ఇది హిందూదేశమందంతటను ప్రసిద్ధినొందిన మందు, అమృత ధార పిమ్మట అత్యధికముగా విక్రయించబడుచున్నది యిదే. అమృత ధారతో సమానముగా పనిచేయ గలదు

పిప్పరమెంటు, వాముపువ్వు, కర్పూరము 1. 1. భాగము, కార్బాలిక్ యాసిడ్ అరభాగము. వీటి నన్నింటినీ కలిపి యెండలో నుంచుము. కరిగి తైలమువలె కాగలదు, డోసు-5 చుక్కలు, అమృతధారవలె దీనిని ఉపయోగింపవచ్చును.

## 98 యెక్‌జోలిన్ ట్రీట్‌మెంట్

ఇది స్వీడన్ నుండి దిగుమతి చేయబడుచున్నది. దీనితో ఒక సబ్బుముక్క-గూడ వుండును. గజ్జి, పుండ్లు, ముఖమునందలి మొటి మలు, మచ్చలు, మొదలగువాటికి గ్యారంటీగా పనిచేయునని ప్రక టింప బడియున్నది. చర్మరోగములకు గూడ ఉపయోగకరమైనది.

---

* యూనానీ ఫార్మసిలలో యీ మందు, యీ పేరుతో తయారైనది దొరుక గలదు.

**No.** 1. గంధకపు చూర్ణము 39 భాగములు, జింకాక్సయిడ్ $\frac{3}{7}$ భాగము, గ్లిసరిన్ $1\frac{?}{5}$ భాగములు, లార్డ్ $3\frac{9}{8}$ భాగములు, నీరు 4 భాగములు, సువాసనకొరకు నిమ్మనూనె. మొత్తమును కలిపి ఆయింటుమెంటును చేయుము.

**No** 2. అన్నభేది $\frac{1}{5}^{6}$ భాగము, గంధకచూర్ణము 55 భాగములు, అభ్రకము $\frac{3}{4}$ భాగము, మైదాపిండి $\frac{7}{3}$ భాగము. వీటి నన్నింటినీ కలిపి 5 గ్రెయినుల ప్రమాణముండునట్లు బిళ్ళలను చేయుము. దినమునకు 3 పర్యాయములు. భోజనానంతరము యీ బిళ్ళలను ప్రతిదఫా ఒక్కొక్కటి చొప్పున పుచ్చుకొన వలయును. పుండ్లను సబ్బుముక్కతో కడిగి **No.** 1. ఆయింటుమెంటును పైన వ్రాయ వలయును.

## 99 అక్సీర్ హాఫిజ్ ఉల్జనీన్

ఇది చాలా ప్రసిద్ధి నొందినట్టిది. చాలా కంపెనీలలో యిది తయారు చేయబడుచున్నది.

పత్థర్ కాజీవ్ * 1 భాగము. వెదురుప్పు 8 భాగములు, రెంటినీ కలిపి చక్కగా నూరి 1 మాషము ప్రమాణముండునట్లు పొట్లములను కట్టుము. దీనిని తయారు చేయుచున్నవారు పొట్లమును 5 రూపాయిల చొప్పున విక్రయించు చున్నారు. ఇది గర్భస్రావములను ఆపివేయ గలదు. ఒక్కమాషము ప్రమాణము మందును ద్రాక్షపండులోనుంచి యివ్వవలయును. గర్భస్రావము కలుగుచున్న స్త్రీలకు దీనిని మాసమునకొకతూరి చొప్పున యివ్వవలయును. మందు చాల ఉపయోగకరమైనది.

---

* యూనానీవస్తువు, యూనానీ భాషలో దీనిని "కల్ బుర్హాహాజర్" అని యందురు.

## 100 అక్సీర్ త్రైల్

ఇది చశ్మాజిందగీ, లాహోరులో పేటెంబు చేయబడినది. చాల ఉపయోగకరమైనది. లింగమును దృఢపరిచి వాజీకరణ శక్తి వృద్ధి నొందించ గలదు.

అరుద్రపురుగులు, వానపాములు, జలగలు, రేనాడు, ఉడుము క్రొవ్వు, సింహపుక్రొవ్వు, పెద్దకప్పక్రొవ్వు, యెలుగుబంటిక్రొవ్వు, పంది. క్రొవ్వు, ప్రత్యేకముగా యివి 2, 2, భాగములు. కోడిగ్రుడ్డు.స్పిరిట్స ఆఫ్ ఫ్రెంచ్ వైన్, కుక్కుటాండతైలము (Oil of Ovivitellus) యివి 10, 10, భాగములు. స్ట్రిచినయిన్ $\frac{1}{11}$ భాగము, కుంకుమ $\frac{1}{24}$ భాగము, నల్లమందు $\frac{1}{12}$ భాగము, కస్తూరి $\frac{1}{12}$ భాగము. వీటినన్నింటిని చక్కగా కలియునట్లు నూరుము. డోసు అరమాష ప్రమాణము. ఉదయము సాయంత్రము అంగముపై మందు యినికి పోవునట్లుగా రుద్దవలయును.

## 101 ఓస్ బూరన్ మిక్చర్

ఇది ఇంగ్లాండులో తయారుచేయబడుచున్నది. 5 ఔన్సుల సీసా ఖరీదు 2 రూపాయలు, అపస్మార రోగమున కిది అత్యుత్తమ మగు మందని ప్రకటించబడి యున్నది.

పొటాసు బ్రొమైడ్ 166 గ్రెయినులు, చక్కెర 48 గ్రయినులు. కాల్చిన పంచదార రంగు కొరకు, ఆక్వా పిప్పరమెంటు, మొత్తము 1 ఔన్సు అగునట్లు చూడుము. అటులనే 5 ఔన్సుల మందును తయారుచేసుకొనవచ్చును. డోసు- 1 డ్రాము. ఉదయము సాయంత్రము. దీనిచే అపస్మారము, గుండెల బలహీనత, తగ్గి రక్తము శుద్ధి కాగలదు.

## 102 యెడ్జ్ గవుట్ అండ్ రెడీమేటిక్ పిల్స్

ఇది లండనులో తయారు చేయబడుచున్నది. అన్ని రకముల వాతనొప్పులను ఒక్క గంటలో యిది తగ్గించునని ప్రకటింపబడి

యున్నది. మంచి మందు ఆసాధ్యస్థితిలో పడుండిన వ్యక్తిగూడ రెండు మూడు దినములలో లేచి నడువగలడు.

ముసాంబరము 10 భాగములు, యక్స్ట్రాక్ట్ కాల్చికం 18 భాగములు. పౌడర్ కాల్చికం 35 భాగములు, పంచదార పాకము 27 భాగములు, తుమ్మబంక 5 భాగములు. ద్రాక్షకలకండ 5 భాగములు. వీటి నన్నింటిని కలిపి 5, 5, గ్రెయినుల ప్రమాణముండునట్లుగా మాత్రలను చేయుము. వీటిని మెగ్నీషియా కార్బోనెట్ చూర్ణములో వేసి మాత్రలపై చూర్ణము పట్టునట్లుగా కదిలించుము డోసు – 1, 1. మాత్ర, పగలు 3 పర్యాయములు. రాత్రి పరుండ బోవునప్పుడు 2 మాత్రలు. నీటితో పుచ్చుకొనవలయును.

## 103. యీస్టన్ పిల్స్

ఈస్టన్ సిరప్‌వలె ప్రసిద్ధి జెందిన పేటెంటు మందు. అన్ని విదేశీయ ఔషధశాలలలోను యిది విక్రయింప బడుచున్నది.

ఫెర్రీ ఫాస్ఫేట్ 1 గ్రెయిను, క్వినైనుసల్ఫ 1 గ్రెయిను, స్ట్రిచినయిన్ $_{3}\frac{1}{2}$ గ్రెయిను, సుగర్ మిల్కు $1\frac{1}{4}$ గ్రెయిను, కన్‌స్ట్రైడ్ ఫాస్ఫోరిక్ $1\frac{1}{8}$ చుక్క, ఆర్సనిక్ ఏసిడ్ $\frac{1}{60}$ గ్రెయిను. మొత్తమును కలిపి ఒక మాత్రను చేయుము.

ఆంశ్యకతాను సారము ఒక్క మాత్రను భోజనానంతరము పుచ్చుకొనవలెను. ఇది పుష్టికరమైనది. రక్తమును వృద్ధిపరచి వాజీకరణ శక్తిని జనింప జేయగలదు.

## 104. యీస్టన్ సిరప్

ఇది గూడ మిక్కిలి ప్రసిద్ధి జెందిన పేటెంటు మందే! అత్యధికముగా విక్రయింపబడు చున్నది.

లోహపు రవ్వలు 75 గ్రెయినులు, కన్ సెంట్రేడ్ ఫాస్ఫొరిక్ యాసిడ్ 1¼ గ్రెయినులు, స్ట్రిచినన్ సల్ఫ 5 గ్రెయినులు, క్వినైన్ సల్ఫ 130 గ్రెయినులు, మామూలు షర్బతు 14 ఔన్సులు.

మొదట ఫాస్ఫొరిక్ యాసిడ్‌కు సమముగా నీటెని కలిపి అందు లోహపు రవ్వలను వేసి కొద్దిగా వేడిచేయుము. లోహపు రవ్వలు కరుగ గలవు. పిమ్మట అందు స్ట్రిచినయిన్, షర్బతు, మొదలైనవి చేర్చి మిగిలిన భాగమును నీటెని కలిపి మొత్తము ఒక పయింటు అగునట్లు చూడుము. డోసు - ½ నుండి 1 డ్రాము వరకు. గుణము యీస్టన్ పిల్సుకు వలెనే!

## 105 బ్రౌంక్ బరూన్ కేటల్ ట్రోచిస్

ఇది అమెరికాలో తయారుచేయబడుచున్నది. యిది దగ్గుకు, పడిశ భారమునకు. బొంగురు బోవుట మొదలగు కంఠ దోషములకు, త్వరగా పనిచేయునని ప్రకటింప బడియున్నది.

చలవ మిరియాల చూర్ణము 6 భాగములు, యష్టిమధుకము 18 భాగములు, బంక 6 భాగములు, చక్కెర 70 భాగములు. మొత్తమును కలిపి మిషనుపై 20 గ్రెయినుల ప్రమాణ ముండునట్లు టాబిలెట్సు చేయింపుము. ఒకటి లేక రెండు బిళ్ళలను నోటిలోనుంచుకొని రసమును మ్రింగుచుండ వలయును. దగ్గు, రొంప, తలభారము, గొంతు బొంగురు బోవుట, పిల్లల కోరింతదగ్గు, క్షయ ప్రథమావస్థ, వీటిపై పనిచేయగలదు.

## 106 బర్గస్ లయిన్ ఆయింటుమెంటు

ఇది విదేశము ఆయింటుమెంటు. రకరకములుగా సైజువారి సీసాలతో యిది విక్రయింప బడుచున్నది. చర్మరోగములపై తరుచుగా ఉపయోగపడుచున్నది. బొబ్బలు, పుండ్లు గూడ నయము కాగలవు.

యంప్లాస్టర్ ప్లంబీ 13 భాగములు, మైనము 20 భాగములు, గుగ్గిలము 11 భాగములు, ఆలివ్ ఆయిల్ 13 భాగములు, నీరు 6 భాగములు, కొవ్వు 100 భాగములు, మొత్తమును కలిపి ఆయింటు మెంటును చేసి ఉపయోగింపుము.

## 107 విల్జ్ ఫెరీ క్యూర్

ఇంగ్లాండులో తయారు చేయబడుచున్నది. 10 పొట్లములు గల పెట్టె ఖరీదు 7 అణాలు. అసలు ఒక్క పైసాకంటె అధికము చేయదు. దీనితో సమానమగు మందు లేదనియు తలనొప్పి దీనితో నిశ్శేషముగా తగ్గిపోవుననియు పేటెంటు కర్త ప్రకటించియున్నాడు.

యాంటీఫేబరిన్ $1\frac{16}{100}$ భాగములు, ఫినాస్టిన్ $1\frac{16}{100}$ భాగములు, కెఫీన్ $\frac{38}{100}$ భాగములు. వీటిని కలిపి 5 గ్రయినుల ప్రమాణముండునట్లు పొట్లములు కట్టుము. మొదట ఒక పొట్లమును పుచ్చుకొనవలయును. నొప్పి తగ్గినచో తిరిగి ఒకగంట తరువాత ఒక్కటి, మూడు గంటల పిమ్మట మరిఒకటి చొప్పున నొప్పితగ్గువరకు పుచ్చుకొనవలయును.

## 108 పయిల్స్ క్యూర్

ఒక పెట్టెలో 12 పొట్లము లుండును. ఖరీదు 0-13-6.

అమరశిల గంధకము (శుద్ధిచేయబడినది) 15 గ్రెయినులు, మెగ్నీషియా $24\frac{1}{2}$ గ్రెయినులు, రెంటినీ కలిపి నూరి ఒక్క పొట్లమును కట్టుము. ఇటులనే కావలసినన్నింటిని తయారు చేసుకొనవచ్చును. పాలు లేక నీటితో ప్రతిదినము రాత్రి పరుండబోవునప్పుడు ఒక్కపొట్లమును పుచ్చుకొనుచుండవలెను.

## 109 బేరంగ్ గోల్డ్ యాంటీ రెడ్‌మేటిక్ పిల్స్

ఇది యింగ్లీషు మందులమ్ము దుకాణములలో తరచుగా విక్రయింప బడుచుండును. రక్తవాతమునకు గ్యారంటీ మందని ప్రకటింపబడియున్నది. పెట్టెలో 40 మాత్ర లుండును.

యాస్పిరిన్ 85 భాగములు, పంచదార పాకము 15 భాగములు, రెంటినీ కలిపి 10 గ్రెయినుల ప్రమాణ ముండునట్లు మాత్రలు చేయుము, రెండు మాత్రలను దినమునకు రెండు మార్లు వేడి, లేక చలినీటితో పుచ్చుకొనినచో రక్తవాతము, నరములు లాగుట, మొదలగునవి తగ్గిపోగలవు.

## 110 టీథింగ్ అండ్ ఫీవర్ పౌడర్

పిల్లలకు పండ్లువచ్చునప్పు డిడి ఉపయోగపడ గలదు. పిల్లలు దీనితో ఆరోగ్యవంతులై వుండగలరు. వయస్సునుబట్టి ఉపయోగించుటకు వీలుండునట్లుగా మందు చిన్నవి. పెద్దవిగా పొట్లములు కట్టబడి యున్నవి. పెద్ద పొట్లములో 2 గ్రయినుల మందు కలదు.

యాంటీమనీ అక్సయిడ్ $\frac{8}{10}$ భాగములు, క్యాలోమెల్ నూటికి 47 భాగములు, కాల్షియం ఫాస్ఫేట్ $1\frac{4}{10}$ భాగములు, సుగర్ ఆఫ్ మిల్కు $5\frac{8}{10}$ భాగములు, మొత్తమును కలుపుము. పిల్లలకు పండ్లు వచ్చునప్పు డిది ఉపయోగపడ కలదు. వేడి, కొద్ది జ్వరము, అనారోగ్యము, మొదలగునవి తగ్గిపోగలవు.

## 111 యాంటీ కాటరాక్టు సెల్యూషన్

ఇది లండనులో తయారు చేయబడుచున్నది. 162 గ్రయినుల మందు సీసా ఖరీదు 2 రూపాయలు. కంటిలోని అంతర కుసుమములకు (Cataract), యిది పనిచేయునని ప్రకటింపబడి యున్నది.

పొటాషియం అయోడయిడ్ 5 కై భాగములు, గ్లిజరిన్ $55\frac{1}{2}$ భాగములు, నీరు $31\frac{1}{2}$ భాగములు, మొత్తమును కలుపుము. దీనిని బ్రష్‌తో దినమునకు రెండుమారులు కంటిలో వ్రాయుచుండవలెను.

## 112 టూత్ పౌడర్

రెండు ఔన్సుల ప్రమాణముగల ప్యాకెట్టు ఖరీదు రెండు అణాలు. ఇది అన్నిచోట్లను విక్రయింప బడుచున్నది.

సుద్దమట్టి 100 భాగములు, క్రీమ్ అఫ్ టార్టార్ 40 భాగములు, అయిల్ ఆఫ్ రోజు 2 భాగములు, కార్బోలిక్ యాసిడ్ 2 భాగములు. కార్ మయిన్ రంగు 2 భాగములు. మొత్తమును కలిపి మెత్తగా నూరి వస్త్ర కాగిత మొనర్పుము. దీనిని ప్రతిదినము పండ్లు తోముకొనుటకు ఉపయోగింప వచ్చును.

## 113 ముఖ క్రాంతి కరణ్

ఇది యిటావాలో పేటెంటు చేయబడినది. 2 ఔన్సుల చక్కని సీసా ఖరీదు 0-12-0. దీనిని ముఖముపై రుద్దికొనినచో మొటిమలు, మచ్చలు, నశించి పోగలవు.

వ్యాసులైను 4 భాగములు, అవిశసూనె 15 భాగములు, సబ్బు 4 భాగములు, సుగంధము కావలసినంత. వీటి నన్నింటిని కలిపి సీసాలో నుంచుము.

## 114 కర్పూరపు వుండలు

ఇవి ప్రతి చోటను విక్రయింప బడుచున్నవి.

సఫ్థాలిన్ 150 భాగములు, కర్పూరము 75 భాగములు కార్మిన్ (Carmine) 2 భాగములు, మిర్ బేని తైలము (Oil of Mirbani) 6 భాగములు. మొదట ఒకటి, రెండు, వస్తువులను కలిపి వేడిచేసి అందు మిగిలిన వాటిని కలిపి గట్టిపడిన పిమ్మట ఉండలను చేయుము. ఇది చాల ఉపయోగ కరమైనది. గుడ్డలలో నుంచ వచ్చును.

## 115 నకలు యేనుగు దంతము

ఇది గూడ విదేశపు కంపెనీల చేతనే తయారు చేయబడు చున్నది. దీనిచే రకరకములగు వస్తువులు తయారు చేయబడు చున్నవి. పృథక్కరణము కొరకై యిది నావద్ద కంపబడినది. పాఠకుల ఉపయోగార్థమై వ్రాయబడుచున్నది. చేసి ఉపయోగమునొంద వచ్చును.

తెల్ల లక్క 20 భాగములు, యేనుగు దంతపు చూర్ణము 16 భాగములు, సీసము 9 భాగములు, కర్పూరము 10 భాగములు. వీటినన్నింటినీ కలిపి నిప్పుపైనుంచి కరగించి యిచ్చవచ్చినట్లు పోత పోసుకొనవచ్చును.

## 116 నకలు బంగారము

దీని పృథక్కరణము గూడ వ్రాయబడుచున్నది.

బంగారము 175 భాగములు, రాగి 400 భాగములు, ప్లాటినము 15 భాగములు టుంగ్ సాటిక్ యాసిడ్ 1! భాగములు, వెలిగారము కావలసినంత బంగారమును విడిచి మిగిలిన వాటిని మూసలోనుంచి కరగించి ఉప్పునీటిలో వేయుము. పిమ్మట దీనిని తీసి బంగారముతో కలిపి కరగించినచో చక్కని నకలు బంగారము తయారు కాగలదు. వెలిగారము ధాతువులను కరగించుటకుమాత్రమే యిందు ఉపయోగపడగలదు. అందుచే దాని ప్రమాణము వ్రాయబడలేదు. పరిస్థితినిబట్టి ప్రమాణమును నిర్ణయించుకొనిఉపయోగించుకొనవలెను.

## 117 బ్రవున్ బూట్ పాలిష్

ఇది గూడ చాలచోట్ల విక్రయింప బడుచున్నది.

మెలోసోఫ్ 2 భాగములు పచ్చని మైనము 2 భాగములు చార్లస్ 2 భాగములు, టర్పెంటాయిల్ 4 భాగములు, ఆల్కా-

హాల్ 2 భాగములు, పోస్ఫిక్ $\frac{1}{10}$ భాగము, మొదట సబ్బును చిన్న చిన్న ముక్కలుగా కోసి అందు రెండవ, మూడవ వస్తువులను కలిపి 15 ఔన్సుల నీటితో వుడికింపుము. ఆల్కాహాలుతో ఫోస్ఫిన్ కరిగించి పై దానిలో చేర్చి పిమ్మట టర్పంటాయిల్ గూడ కలిపి దించుము దీనిని డబ్బీలలో నుంచి ఉపయోగించుకొనవచ్చును.

## 118 బట్టల సబ్బు

ఇప్పనూనె 50 భాగములు, నీరు 25 భాగములు, మైదా 50 భాగములు, కాస్టిక్ సోడా 16 భాగములు, నూరిన ఉప్పు 15 భాగములు, వీటిని కలిపి సబ్బును తయారు చేయుము. చాల చక్కని సబ్బు తయారు కాగలదు.

## 119 టైప్ రైటర్ యింక్

ప్రస్తుతము దీనికి చక్కని ప్రచారము కలదు. కాని నేడిది విదేశముల నుండి మాత్రమే దిగుమతి చేయబడు చున్నది. యిచ్చటనే తయారు చేయబడుచున్నచో చాల బాగుండును.

గ్లిజరిన్ 2 భాగములు, ఆల్కాహాలు 1 భాగము, అనీలయిన్ రంగు $\frac{1}{30}$ భాగము, నీరు 1 ఔన్సు. మొత్తమును కలిపి యిందు రిబ్బనును తడిపి తీసి ఆరునట్లు చేయుము.

## 120 మార్కింగ్ యింక్

ఇది గుడ్డలకు గుర్తు వేయుటకు పనికి వచ్చును. చాల ఉపయోగకరమైనది.

బంక 4 భాగములు, టార్టారిక్ యాసిడ్ 5 భాగములు, సిల్వర్ నయిట్రేట్ 4 భాగములు, కాల్మయిన్ $\frac{1}{4}$ భాగము, ఏమోనియా 1 భాగము. నీరు 1 భాగము, ఒకటవ, రెండవ

మూడవ, అయిదవ వస్తువులను ముందుగా కలిపి అందు మిగిలిన వాటిని కలుపుము. సిరా తయారు కాగలదు. దీనితో వేసిన గుర్తు చెరిగి పోదు.

## 121 గ్యారంటీ దస్తావేజు సిరా

ఈ సిరాతో వ్రాయబడిన అక్షరములు దేనితోను చెరగక శాశ్వతముగా నుండగలవు. ఆధునిక కాలములో దస్తావేజుల కిది చాల ఉపయుక్తమైనది.

కాటుక 1 భాగము, యాసిడ్ సల్ఫ 4 భాగములు, నీరు 20 భాగములు, తేనె 2 భాగములు, బంక 1 భాగము. మొదట కాటుకను యాసిడ్ సల్ఫలో కలుపుము. పిమ్మట అందు మిగిలిన వాటిని చేర్చి చక్కగా కలియునట్లు చేయుము. సిరా తయారు కాగలదు.

## 122 సౌందర్య కారక్

ఇది ఫైజాబాదులో పేటెంటు చేయబడినది. ముఖముపై వ్రాసుకొనుట కుపయోగించును. 2 ఔన్సుల సీసాఖరీదు 10 అణాలు.

కొబ్బరినూనె 10 భాగములు, మైనము $2\frac{1}{2}$ భాగములు, నిమ్మనూనె 1 భాగము, గోరంట అత్తరు $\frac{1}{4}$ భాగము. మొదట కొబ్బరి నూనెలో మైనమును కలిపి కరగించి అందు మిగిలిన వస్తువులను కలుపుము. దీనిని కొద్దిగా ముఖముపై వ్రాసుకొన వలయును.

## 123 తిర్‌పాక్ అక్‌బర్

ఇది విద్యుచ్ఛక్తివలె శరీరమం దంతటను అధిక వేగముగా ప్రవహించి చక్కని పుష్టినిచ్చి వాజీకరణ శక్తిని బాగుగా వృద్ధి నొందించగలదు. డోసు—4 గురిగింజల ప్రమాణము.

వెండిభస్మము, మాణిక్యభస్మము, ఆకుపచ్చరత్నపుభస్మము, యివి 6, 6, భాగములు, బంగారు భస్మము, ముత్యపు భస్మము, యివి 3, 3, భాగములు, కస్తూరి, అంబరు, 4, 4, భాగములు, వీటిని మొగలి రసముతోను, లతా కస్తూరిరసముతోను, గులాబీ రసముతోను, 60 మార్లు భావన చేయుము. ఇది విలువగల ఔషధము. కాని చాల చక్కగా పనిచేయగలదు. విలువకు తగిన గుణము యిందు కలదు. పుచ్చుకొనిన వెంటనే శక్తిని వృద్ధినొందింప గలదు.

## 124 ఫెరాపీన్

ఇది లండనులో తయారు చేయబడు చున్నది. ఫార్పీన్ నెం. 3. అను పేరుతో విక్రయించబడు చున్నది.

స్వదేశీ కర్పూరము 2½ భాగములు, గ్లిజరిన్ 24 భాగములు, యష్టిమధుకపు చూర్ణము 40 భాగములు, కాల్షియం గ్లిజరో ఫాస్ఫేట్ 1¼ భాగములు, యక్స్ట్రాక్ట్ జెన్షన్ 50 భాగములు, డామియానా యెక్స్ట్రాక్ట్ 8 భాగములు నీరు 100 భాగములు. వీటినన్నింటినీ కలుపుము. డోసు – 1 డ్రాము. దినమునకు 2, 3, మారులు. దీనిచే పరిపూర్ణమగు శక్తికలిగి బలహీనము తొలగి పోగలదు. వాజీకరణశక్తి వృద్ధినొందగలదు.

## 125 జౌహార్ సఫా

థయిమల్ 1 భాగము. పిప్పరమెంటు 1 భాగము, కర్పూరము 2 భాగములు. వీటిని కలిపి నూరి సీసాలో నుంచుము. యిది కరిగిన పిమ్మట అందు యాసిడ్ బెంజాయిక్ ½ భాగముకలుపుము. డోసు – 5 చుక్కలు. అమృతధారవలె పనిచేయును.

## 126 హ బూ బ్ ఆ త శ క్

ఇది అహమ్మదాబాదులో పేటెంటు చేయబడినది. గుజరాత్ ప్రాంతములో దీనికి చక్కని ప్రసిద్ధి కలదు. ఉపదంశ వ్యాధులపై పనిచేయును.

శంఖ పాషాణము 2 భాగములు, లవంగములు 4 భాగములు. పిల్టరు చేయబడిన నిమ్మరసము 50 భాగములు, మొత్తమును కలిపి మెత్తగా నూరి జొన్నగింజ ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. ఉపదంశ వ్యాధిగ్రస్థులు దీనిని నిమ్మకాయ ఊరగాయతో పుచ్చుకొనవలయును.

## 127 ద వా యే అ వీ జ్

ఇది హైదరాబాదులో ప్రసిద్ధిజెంది యున్నది. మూత్రాశ్మరిపై యిది చాలా చక్కగా పనిచేయును. ఒక్కవ్యక్తి ఆరోగ్యమునకు సరిపోవు మందును పేటెంటుకర్త 200 రూపాయలు పుచ్చుకొను చున్నాడు.

కళింగపక్షి గుడ్డుకు సన్నని బెజ్జముపెట్టి అందు ఒక్కతులము పాదరసమును పోసి మినప పిండితో బెజ్జమును మూసి నిప్పులో నుంచుము. భస్మమైన పిమ్మట తీసి పగులగొట్టి అందలి తెల్లని, పచ్చని పదార్థములను ఉపయోగింపుము. దీనిని ఒక్క వారము పుచ్చుకొనవలయును. ఈ మహాశయుడు కళింగపక్షులను విపరీతముగా పెంచుచున్నాడు.

## 128 ద వా యే త లి క్

చాలచోట్ల యిది పేటెంటు చేయబడి విక్రయింపబడుచున్నది. జీర్ణజ్వరములు, క్షయ, జలోదరము, రొంప, వీట్లపై యిది ఉపయోగింప బడుచున్నది.

యథార్థములో యది అభ్రకపు భస్మము మాత్రమే! కృష్ణాభ్రకము, శుద్ధిచేయబడినది తీసుకొని కుక్క పుగాకు రసముతో పది గంటలు నూరి కుక్క పుగాకును ముద్దగా నూరి దీనిని మధ్యనుంచి శీలమన్నుయిచ్చి అయిదుశేర్ల యెరుకు పిడకలతో పురముపెట్టుము. గులాబిరంగుగల భస్మము కాగలదు. డోసు – 2 వడ్లగింజలయెత్తు. తగిన అనుపానముతో పుచ్చుకొనవలెను.

## 129 దవాతాఉన్

ప్లేగుకు పనికివచ్చు మందు, పాట్నాలో పేటెంటు చేయబడినది. మందు చాల ఉపయోగకరమైనది. చాలతక్కువకే గిట్టుబాటగును.

అత్తపత్తాకు 5 తులములు, గావుజుబాన్ అర్కము 30 తులములు, * లతాకస్తూరి అర్కము 12 తులములు, కలిపి నూరి వడకట్టి 2 ఔన్సుల సీసాలో పోసి లేబిల్సు అతికించుము. డోసు – 1 డ్రాము. దినమునకు అనేకపర్యాయములు.

## 130 దవానాసూర్

హిందూస్థానీ లేబరేటరీలో తయారు చేయబడుచున్నది. వ్రణరంధ్రముల కిది యుపయుక్తమైనది.

టమాకాయల మందు 2 తులములు, నువ్వుల నూనె 5 తులములు. రెంటినీ కలిపి మెత్తగానూరి సీసాలోనుంచుము. వ్రణములను వేపాకుల రసముతో కడిగి యీ మందును ఉపయోగించినచో వ్రణరంధ్రములు చాల త్వరగా నయము కాగలవు.

---

* యూనానీ ఫార్మసీలలో దొరుకగలవు.

## 131 డాడ్జ్ కిడ్నీ పిల్స్

అమెరికాలో పేటెంటు చేయబడినది. డబ్బీలో అండాకారముతో యెరుపురంగు పూతగల 35 మాత్రలు గలవు. ఇది ప్రపంచమందంతటను విక్రయింపబడు చున్నది.

యెక్స్‌ట్రాక్ట్ కరేలా $\frac{15}{100}$ గ్రెయినులు జెలయ్ $\frac{3}{10}$ గ్రెయినులు హార్డ్ సోప్ 1 గ్రెయిను, పొటాసు నయిట్రేట్ 1 గ్రెయిను, సోడా బైకార్బ $\frac{85}{100}$ గ్రెయినులు, హార్డ్ ఫర్ఫీన్ $\frac{5}{100}$ గ్రెయినులు పసుపు $\frac{3}{10}$ గ్రెయినులు, గోధుమపిండి $\frac{8}{10}$ గ్రెయినులు, మొత్తమును కలిపి నూరి ఒక్కమాత్రను చేయుము యిటులనే కావలసినన్నింటిని తయారు చేసుకొనవచ్చును. డోసు - 1 మాత్ర. దినమునకు 3 పర్యాయములు, భోజనమునకు ముందు, పిమ్మట పుచ్చుకొనవలయును. దీనిచే వృక. రక్తవాతములు తగ్గి రక్తము పరిశుభ్రము కాగలదు.

## 132 డాక్టర్ మూండజ్ మీకరాలెట్స్

లండనులో నున్న ఒక కంపెనీచే యిది రకరకముల సీసాలతో విక్రయింప బడుచున్నది. మందు మాత్రల రూపముతో నుండును.

క్వినైన్ వెలేరియనైట్ $\frac{4}{10}$ గ్రెయినులు, జింక్ వెలేరియనైట్ $\frac{1}{10}$ గ్రెయినులు, ఫెర్రీ అక్సయిడ్ $\frac{1}{10}$ గ్రెయినులు, మెంథాల్ $\frac{3}{100}$ గ్రెయినులు, శంఖ జీరకము $\frac{23}{100}$ గ్రెయినులు. మొత్తమును కలిపి ఒక్క మాత్రను చేయుము. యిష్టప్రకారము కావలసిన తూకముతో, మాత్రలను తయారు చేసుకొనవచ్చును. ఉదయము, సాయంత్రము ఒక్కొక్క మాత్రను పుచ్చుకొనవలెను. నరములకు శక్తినిచ్చి శరీరమందలి వివిధములగు బలహీనతలను, అజీర్ణమును పోగొట్టుటకు సాటిలేని మందు.

## 133 అమెరికన్ కిడ్నీ పిల్స్

ఇది ఉత్తర ఇంగ్లాండులోని ఒక కంపెనీచే తయారుచేయ బడుచున్నది. డబ్బీలో 14, లేక 15 మాత్రలుండును. ఒక్కొక్క మాత్రచొప్పున దినమునకు మూడుపర్యాయములు భోజనాంతరము పుచ్చుకొనవలయును. యకృత్, వృక, పక్వాశయ, జాడ్యముల కిది ఉపయుక్తమైనది.

పిప్పరమెంటు ఆయిల్ 1 చుక్క, ఆయిల్ జునీపర్ 8 చుక్కలు, పొటాసు నయిట్రేట్ 8 గ్రెయినులు, పౌడర్డ్ సెకోయల్ 3 గ్రెయినులు, గోధుమపిండి 6 గ్రెయినులు, యెక్స్ట్రాక్ట్ బెన్ బెన్ 7 గ్రెయినులు, యెక్స్ట్రాక్ట్ హైరిక్సకమ్ 21 గ్రెయినులు, మొత్తమును కలిపి 10 మాత్రలను చేయుము. యిటులనే కావలసి నన్నింటిని తయారు చేసుకొనవచ్చును.

## 134 డాక్టర్ వాప్టజ్ కామ్ఫియో

ఇది యార్క్షయిర్లో తయారు చేయబడున్నది. మందును తయారు చేయుచున్నవారు యిది రొంప, పడిశెము, లకుత్తమమైన మందని ప్రకటించి యున్నారు.

బంక 1½ భాగము, కాష్టిక్ సోడా ౹౬౦ భాగములు, ఆయిల్ చినామిన్ ¼ భాగము, లవంగముల తైలము ¼ భాగము, టించర్ కాప్సికమ్ 7½ భాగములు, సాలసైలిక్ యాసిడ్ ౹౬౦ భాగము, రెక్టిఫయిడ్ స్పిరిట్ 2½ భాగము, ఆక్వాచినామిన్ 100 భాగములు, రంగుకొరకు వేయించిన చక్కెర, మొత్తమునుకలిపి పెద్దసీసాలో పోయుము. డోసు-టీ చంచా ప్రమాణము. చక్కెరను వర్బత్తుగా కాచి అందు దీనిని కలిపి యెన్నిమార్లుఅయినను పుచ్చుకొనవచ్చును. జలుబు యిన్ఫ్లూయంజా, అతిసారము, పక్వాశయ జాడ్యములు, బాధలు, తలనొప్పి, కాళ్ళు చల్లబడుట, రక్తపు ప్రసరణలోని అడ్డంకులు, కంఠనాళపు వికారములు, తగ్గిపోవును.

## 135 డాక్టర్ విలియమ్ పిల్స్

అమెరికాలో తయారు చేయబడుచున్నవి. ఒక్క పెట్టెలో 30 మాత్రలు కలవు. ప్రపంచమందు దీని యెడ్వరుటైజుమెంటుండని పత్రికయే లేదని చెప్పవచ్చును. మందు ఒకటే! ప్రకటనలు మాత్రమే రక రకములుగా నుండును.

అన్నభేది చూర్ణము $\frac{75}{100}$ గ్రెయినులు పొటాస్ కార్బోనేట్ $\frac{60}{100}$ గ్రెయినులు, మెగ్నీషియా $\frac{20}{100}$ గ్రెయినులు, యష్టిమధుకపు చూర్ణము $1\frac{1}{10}$ గ్రెయినులు, పంచదార $\frac{2}{10}$ గ్రెయినులు, మొత్తమును కలిపి ఒక్క మాత్రను చేయుము. యిటులనే కావలసినన్నింటిని తయారు చేసుకొనవచ్చును. డోసు-1మాత్ర. దినమునకు రెండు పర్యాయములు. దీనిచే రక్తవాతము, అజీర్ణము, పడిశము, బల హీనత, మొదలగునవి తగ్గిపోగలవు.

## 136 డాక్టర్ హాఫ్‌మెంజ్ రెడ్ మేటిక్ పౌడర్

ఇది లండనులో తయారు చేయబడుచున్నది. దీనిని గొప్ప గొప్ప డాక్టరులుగూడ మెచ్చుకొను చుందురు. మందు మొదటి మోతాదుతోనే సుగుణమును చూపగలదు.

యాస్పిరిన్ $66\frac{1}{2}$ భాగములు, ఫినాస్టిన్ $11\frac{2}{5}$ భాగములు, కెఫీన్ $1\frac{3}{10}$ భాగములు, తెల్లచక్కెర $30\frac{1}{10}$ భాగములు, మొత్తమును కలిపి 15 గ్రెయినుల ప్రమాణముండునట్లు పొట్లములు కట్టుము. డోసు-1పొట్లము. మూడు లేక నాల్గుగంటల వ్యవధితో నీటితో పుచ్చుకొన్నచో రక్తవాతము, నరముల బాధలు, నొప్పులు, వాత జాడ్యములు యూరిక్ యాసిడ్ (మూత్రమ్లము) అధిక్యతను తగ్గించును.

## 137 డప్ సూ క్యూర్

ఇది బర్మింగ్‌హామ్‌లోని ఒక కెమికల్ కంపెనీచే తయారు చేయబడుచున్నది. మందు నమూనా ఉచితముగా గూడ యీయ బడుచున్నది. మందు చాల గుణయుక్తమైనది.

యాంటీ ఫేబరిన్ 6 భాగములు, పొటాస్ బ్రొమయిడ్ 35 భాగములు, సుగర్ ఆఫ్ మిల్కు 59 భాగములు. వీటివి కలిపి పొట్లము కట్టుము. పొట్లములు రక రకములుగా నున్నవి. కొన్ని 2 గ్రెయినుల ప్రమాణము, కొన్ని 6 గ్రెయినుల ప్రమాణము కలిగి నవి కలవు.

డోసు — ఒక్క పొట్లము. దినమునకు మూడుపర్యాయములు. భోజనానంతరము వేడినీటితోగాని పాలతోగాని పుచ్చుకొనవలెను. యిది శరీరమందలి సారాయి దోషమును పోగొట్టి శక్తి నివ్వగలదు. బలహీన వ్యక్తికిగూడ చెడుచేయదు.

## 138 రూక్స్

లండనులో తయారుచేయబడు చున్నది. నొప్పులకు ఉపయోగ కరమైనది. పరీక్షానంతరము యిందు యాంటీఫేబరిన్ తప్ప మరే మియు లేదని తేలినది. పొట్లములు రకరకములుగా నున్నవి. నొప్పి కనుపడిన వెంటనే ఒక్క పొట్లమును పుచ్చుకొనవలెను. తిరిగి బాధ కనుపించినచో — కొద్ది దినములవరకు దినమునకు మూడు పర్యాయ ముల చొప్పున పుచ్చుకొను చుండవలెను. మందును పుచ్చుకొను కాలములో సారాయిని ఉపయోగింపరాదు. దీనిచే పండ్ల నొప్పులు, తలనొప్పి, కీళ్ళనొప్పులు, వాతనొప్పులు నిశ్శేషముగా తగ్గిపోగలవు.

## 139 సఫూప్ సమీ

ఇది శాహ్‌దరాలోని ఒక వైద్యునిచే పేటెంటు చేయబడినది.

శంఖపాషాణము 1 భాగము, గులాబిపూలు 2 భాగములు, తెల్లకాచు 2 భాగములు, వీటిని గులాబీ పూలు 10 భాగములు, తెల్లకాచు 10 భాగములతో కలిపి నూరుము. యిది 1 నెంబరు చూర్ణము. యిందుండి - ఒక భాగము మందును తీసికొని గులాబి పూలు 2 భాగములు, కాచు 2 భాగములు కలిపి నూరుము. యిది 2 నెంబరు మందు. యిటులనే 2 నెంబరు మందు తీసుకొని వెనుకటి వలె నూరినచో 3 నెంబరు మందు తయారు కాగలదు. యిందు కాచు $3\frac{1}{2}$ భాగములు, గులాబిపూలు $3\frac{1}{2}$ భాగములు కలవు.

నెంబరు 1, 2, మందులను - ఒక్క గురిగింజ ప్రమాణము భోజనానంతరము పుచ్చుకొనవలెను. నెంబరు 3 మందును ఉదయము, సాయంత్రము పుచ్చుకొనుచుండవలెను. దీనిచే ఆ మాశయ జాడ్యములు, చర్మరోగములు, హృదయ దౌర్బల్యము, బహుమూత్రము, శోష, కంఠమాల, పురాణ జ్వరములు, వాతరోగములు, తగ్గిపోగలవు. వాజీకరణశక్తి వృద్ధినొందగలదు.

## 140 సింగల్టన్ ఆయింట్ మెంటు

ఇది లండనులో తయారు చేయబడుచున్నది. "సర్వనేత్ర రోగములపై పనిచేయగలదు." అని లేబిలుపై గలదు.

రెడ్ మర్క్యూరీ ఆక్సయిడ్ $7\frac{4}{10}$ భాగములు, మైనము 4 భాగములు, జపానుమైనము, పంది క్రొవ్వు, స్వచ్ఛమగు కొబ్బరినూనె, $38\frac{6}{10}$ భాగములు, మొత్తమును చక్కగా నూరి ఆయింట్ మెంటు వలె చేయుము, దీనిని కనుకలకు దూది, శలాక మొదలైని సాధనములతో వ్రాయవలయును. దృష్టితగ్గుట, పూపు, రెప్పల భాధలు. తగ్గిపోగలవు. మొలలకు, కంఠనాళ జాడ్యములకు, గూడ ఉపయోగకరమైనది.

ఇందు మూడు వస్తువుల కలయిక కలదు. ఇష్టమున్నచో వీటిని వేయవచ్చును. లేనిచో వీటికి బదులు వ్యాసులైనును కలుపవచ్చును. గుణము సమానముగానే యుండును.

## 141 తిలాయే లుత్ఫ్

గోండా నివాసి దీనిని ప్రచారము చేయుచూ తిరిగితిరిగిఅమ్ము చున్నాడు.

తెల్లని రంగుగల కోడిపిత్తములో పొగడ పూలను మూడు దినములు నూరి బాగుచేసి దానిరసము 6 మాషములుతీసుకొనిఅందు గులాబీ అత్తరు, మొగలి అత్తరు, గోరంట్ల అత్తరు కుంకుమపువ్వు పొగడ అత్తరు, ఆరుద్రపురుగులు, యివి 2, 2 మాషములు, అగరు 2మాషములు. యెర్రలు 3 మాషములు, కస్తూరి 6 మాషములు, నల్లమందు 6 మాషములు, మైనము 2 మాషములు, తేనె 2మాష ములు. మొత్తమును కలిపి నూరి డబ్బీలో నుంచుము. అవసరమగు నప్పుడు దీనిని లింగముపై లేపన మొనర్ప వలయును. యిది చాల త్వరగా పనిచేయగల ద్రావణ వాజీకరణౌషధము.

## 142 కపూర్ సైయాల్

హిందూస్థానీ లేబరేటరీలో తయారుచేయబడుచున్నది. ఢిల్లీలో దీనికి చక్కని ప్రసిద్ధి కలదు. కలరా, ఉదర రోగములు, మొలలు, వీటిపై పనిచేయును.

స్వచ్ఛమగు కర్పూరము 1 భాగము, రెక్టి ఫయిడ్ స్పిరిట్ 4 భాగములు. వీటిని కలిపి సీసాలో వేయుము కరిగి ద్రావకమువలె కాగలదు. డోసు – 1 నుండి 3 చుక్కల వరకు నీటితో పుచ్చు కొనవలెను.

## 143 కిబ్ దీ

ఇది హిందూస్థానీ దవా ఖానా ఢిల్లీలో తయారు చేయబడు చున్నది. యకృత్ జాడ్యముల కిది ఉపయోగకరమైనది.

నవాసాగరము, సైంధవ లవణము, సాంభారు లవణము, సౌవర్చ లవణము, వెలిగారము, గంటు కచ్చూరము, శొంఠి నల్ల

కరక్కాయ, పచ్చ కరక్కాయ, వాయు విడంగములు, నల్లమిరి యాలు. వీటి సమాన భాగములను చూర్ణించి వస్త్రఘాళిత మొనర్చి గులాబీ రసముతో నూరి రెండు గురిగింజల ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. డోసు – 2 మాత్రలు ఉదయము సాయం త్రము సోపురసము తో గాని నీటితో గాని పుచ్చుకొనవలెను. హృదయ, ఉదర రోగములపై పనిచేయ గలదు.

## 144 క్యూటి క్యూరా మిక్చర్

ప్రసిద్ధి జెందిన అమెరికా మందు. దీనితో ఆయింట్ మెంట్ సబ్బుముక్క గూడ కలవు.

పొటాస్ అయొడయిడ్ 17 గ్రెయినులు, పంచదార 486 గ్రెయినులు, రేవల్చిన్ని 8 గ్రెయినులు ఆల్కాహాలు 10 డ్రాములు, నీరు 6½ ఔన్సులు. మొత్తమును చక్కగా కలుపుము. డోసు– 15 చుక్కల నుండి 8 మాషముల వరకు. దినమునకు 2, 3 పర్యా యములు, దీనిచే వివిధములగు రక్తవికారములు మలబద్ధకము తగ్గి చక్కని జీర్ణశక్తి కలుగును.

## 145 క్లార్కస్ రక్త శోధక్

లండనులో తయారు చేయబడి ప్రపంచ మం దంతటను ప్రయత్న పూర్వకముగా విక్రయించ బడుచున్నది. రక్తశుద్ధి కిది ఉత్తమమైన ఔషధమని యెంచబడుచున్నది.

పొటాస్ అయొడయిడ్ 52$\frac{1}{10}$ గ్రయినులు, స్పిరిట్ క్లోరో ఫారమ్ 68 చుక్కలు. స్పిరిట్ అమోనియా అరోమెటిక్ 10 చుక్కలు సింపల్ సిరప్ 50 చుక్కలు. రంగు కొరకు వేయించ బడ్డ చక్కెర. మిగిలినది నీరు. మొత్తము 8 ఔన్సులు అగునట్లు చూడుము. డోసు – 1. చంచా ప్రమాణము. శక్తిని అనుసరించి దినమునకు నాల్గు పర్యాయములు పుచ్చుకొనవలెను. సర్వర క్త

విశారములు, కంఠమాల, వివిధములగు వ్రణములు, ఉపదంశము, మొలలు, రక్తవాతము, నరములు లాగుట, మొటిమలు, కండ్లు కలుగుట, దురద, వివిధములగు చర్మరోగములు. వీటికిది ఉపయోగకరమైనది.

## 146 క్యాప్ సొలాయిడ్

పెట్టెలో 36 మాత్రలు కలవు. దీనిచే వెంట్రుకల కుదుళ్ళు గట్టిపడు ననియును. తెల్లపడిన వెంట్రుకలు తిరిగి నల్లబడుననియును. మలబద్ధకము తొలగు ననియును, పేటెంటు కర్త ప్రకటించి యున్నాడు.

హెమో గ్లోబిన్ $1\frac{98}{100}$ గ్రెయినులు. ఆలివ్ ఆయిల్ $\frac{55}{100}$ భాగములు, బాల్‌సమ్ పెరూ $\frac{17}{100}$ భాగములు. స్టూరెక్స్ $\frac{17}{100}$ భాగములు. మొత్తమును కలిపి క్యాఫ్సుల్సులో నుంచుము. భోజనమునకు ముందుగాని లేక మధ్యగాని రెండు క్యాప్సుల్సను పుచ్చుకొనవలెను. దినమునకు రెండు మారులు.

## 147 కెఫో టిన్

ఇంగ్లాండులో తయారు చేయబడుచున్నది. పెట్టెలో 12 పొట్లములుండును. యిది నొప్పులకు సంపూర్తిగా తగ్గించును. డాక్టరులు దీనిని యెక్కువగా ప్రశంశింపు చుందురు.

యాంటీ ఫేబరిన్ $6\frac{21}{100}$ గ్రెయినులు, ఫెరిక్ అక్సైయిడ్ (Oxyde of Ferri) $\frac{5}{100}$ గ్రెయినులు, చక్కెర $\frac{20}{100}$ భాగములు మొత్తమును కలిపి ఒక్క పొట్లమును కట్టుము. యిటులనే కావలసినన్నింటిని కట్టుకొనవచ్చును. డోసు-ఒకపొట్లమునుండి పొట్లము వరకు. రోగానుకూలముగా 2, 3, పొట్లముల వరకు రెండు మూడు గంటల కొకతూరి యివ్వవచ్చును. అన్నిరకములగు నొప్పులకు యిది చాల ఉపయోగకరమైనది.

## 148 గలోరియా పిల్స్

ఈ పేటెంటు మందు అన్ని విదేశీయ ఔషధశాలల లోను విక్రయింపబడు చున్నది. పెట్టెలో 40 మాత్రలుండును.

యక్స్ట్రాక్ట్ కాస్కేరా సాగ్రేడా 3 గ్రెయినులు, యక్స్ట్రాక్ట్ ఒలోజ్ 5 గ్రెయినులు, యక్స్ట్రాక్ట్ జాలప్ 7 గ్రెయినులు మిగిలినది మైదాపిండి – అవుసరమును బట్టి కావలసినంత కలిపి 3 గ్రెయినుల ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. డోసు – ఒక్కొక్క మాత్ర. దినమునకు మూడు పర్యాయములు. యకృత్ వికారములు, బలబద్ధకము, మొలలు, తలనొప్పి, పుల్లత్రేన్పులు వచ్చుట, హృదయ దౌర్బల్యము, దీనిచే తగ్గిపోగలవు.

## 149 ట్రీట్మెంట్ రెడ్ మేటిజమ్

రక్తవాతమును, రక్తవికారములను పోగొట్టుటకు21మాత్రలే చాలు ననియును, శాశ్వతమగు ఆరోగ్యము కలుగ గలదనియును. దీని విషయమై తరుచుగా ప్రకటింపబడు చుండును. డబ్బీలో 50 మాత్రలుండును.

పొటాస్అయోడయిడ్ 18 గ్రెయినులు. గ్వాయికంఅయిరణ 8 గ్రయినులు, యష్టిమధుకపు సత్వము 15 గ్రయినులు, ఫయిటోలెపణ 9 గ్రెయినులు, యష్టిమధుకపు చూర్ణము 18 గ్రెయినులు, బియ్యపుపిండి 21 గ్రెయినులు, మొత్తమును కలిపి ఒక్క మాత్రను చేయుము. యిటులనే కావలసిన వాటికి తయారు చేసుకొనవచ్చును. డోసు–ఒక్కొక్క మాత్ర. దినమునకు 3 పర్యాయములు. దీనిచే రక్తవాతము, నరములు లాగుట, కంఠమాల, యూరిక్ యాసిడ్చే కలుగు యితర జాడ్యములు, రక్తవికారములు తగ్గిపోగలవు.

## 150 గోనాడ్ కాంపౌండ్ No. 70

ఇది శరీరమునకు పుష్టినివ్వగల వాజీకరణౌషధము. హిందూ దేశములోని విదేశీయ ఔషధశాల లన్నింటిలోను యిది అత్యధిక ముగా విక్రయింపబడు చున్నది.

యక్స్ట్రాక్ట్ డామియానా లిక్విడ్ 2 భాగములు, యెక్స ట్రాక్ట్ కోకా లిక్విడ్ 2 భాగములు, సిరప్ ఫెర్రీయెట్ క్వినైన్ 4 భాగములు, డిస్టిల్డ్ వాటరు 16 భాగములు. మొత్తమును కలుపుము. డోసు – 2 డ్రాముల ప్రమాణము. దినమునకు 3 పర్యాయములు పుచ్చుకొనవలెను. మందు పుష్టికరమైనది.

## 151 రెడ్ షర్బత్

అందరికిని యిది పరిచయమైనదే!

కాల్షియం హైపో ఫాస్ఫేట్ 80 గ్రెయినులు, టించర్ కోచనీల్ 20 చుక్కలు, మామూలు షర్బత్ 4 ఔన్సులు. మొత్తమును కలిపి మందు చక్కగా కలియునట్లు సీసాను కదిలింపుము డోసు – 1 టీ చంచా ప్రమాణము భోజనానంతరము పుచ్చుకొన వలెను. నడుమునకు బలము నివ్వగలదు. బలహీనులగు బాలురకు గర్భిణీ స్త్రీలకు యిది చాల ఉపయోగకరమైనది.

## 152 రజిత ద్రావకము

ఢిల్లీలో దీనికి చక్కని ప్రచారము కలదు. పుష్టినివ్వగలవాజీకరణౌషధము. డోసు – 5 నుండి 10 చుక్కల వరకు – ఒక్క తులము నీటితో కలిపి పుచ్చుకొనవలెను.

వెండి 1 గురిగింజ ప్రమాణమును 3 మాషముల ప్రమాణము గల నైట్రిక్ యాసిడ్‌లో వేసి సీసాలో నుంచుము. కరిగి ద్రావకము కాగలదు. త్వరగా కరుగుటకై కొద్దిగా వేడిచేయుము.

కరిగిన పిమ్మట యిందు $2\frac{1}{2}$ తులముల ప్రమాణము గులాబీ అర్కమును కలుపుము.

## 153 మదర్ సీగర్ కురేటివ్ సిరప్ .

సీసాలో 3 ఔన్సుల ప్రమాణము గల మందు గలదు. అజీర్ణమున కిది ముఖ్యౌషధమని ప్రకటింపబడియున్నది. ఇదిగాక యకృత్ రక్త వికారములపై గూడ పనిచేయును. ఇది కేవలము మూలికల చేతనే తయారు చేయబడిన దనియును, పక్వాశయ, హృదయ, వృక్క వ్యాధులపై గూడ చాల ముఖ్యముగ పనిచేయు ననియును ప్రకటింప బడియున్నది.

డయిల్యూట్ హైడ్రోక్లోరిక్ యాసిడ్ 1 భాగము, టించర్ కాప్సికం $1\frac{7}{10}$ భాగములు, ఒలోజ్ 2 భాగములు, ట్రేకల్ 60 భాగములు, మిగిలినది నీరు, మొత్తము 100 భాగము లుండునట్లు చేసి కలుపుము. డోసు ఒక్క టీ చంచా ప్రమాణము భోజనానంతరము పుచ్చుకొనవలెను. అజీర్ణమున కిది ఉత్తమమైనది. రక్తమును శుభ్రపరిచి అందలి మాలిన్యమును పోగొట్టును. పక్వాశయ, హృదయ, వృక్క (Kidnees) వ్యాధులపై గూడ పనిచేయగలదు.

## 154 ముక్తార్కము

ఇదిగూడ చాల ఫార్మసీలలో తయారు చేయబడుచున్నది.

ముత్యము 1 మాష ప్రమాణము తీసుకొని నిమ్మరసమును కొద్దిగా వేయుచూ దానిని చాల చక్కగా కలిసిపోవునట్లు మద్దించి బ్లాటింగు పేపరుతోను, ముతక గుడ్డతోను, రెండుమూడు మార్లు వడకట్టుము. డోసు – 5 చుక్కలు. ఒక తులము గులాబీ అర్కముతో పుచ్చుకొనవలెను. ఇది హృదయ దౌర్బల్యమును పోగొట్టి మస్తిష్కమునకు శక్తి నివ్వగలదు. ఇది ఆటలమ్మ (Chicken Pox) కు చాల ఉపయోగకరమైనది.

## 155 నరూ లెట్స్

ఇది విదేశముఃనుండి దిగుమతి చేయబడి విక్రయింపబడు చున్నది. పెట్టెలో 28 మాత్ర లుండును. మాత్రలపైసున్నముతో తేలికగా కోటింగ్ యివ్వబడి యున్నది.

ఫాస్ఫరస్ రెడ్ $\frac{1}{100}$ గ్రెయినులు, క్వైనైన్ సల్ఫేట్ $\frac{7}{100}$ గ్రెయినులు. రెంటినీ కలిపి ఒక్క మాత్రను చేయుము. ఇటులనే కావలసిన వాటిని తయారు చేసుకొనవచ్చును.. డోసు-ఒక్కొక్క మాత్ర. ఉదయము, సాయంత్రము, భోజనాంతరము పుచ్చుకొన వలెను. మందు పుష్టికరమైనది.

## 156 రెడ్ మేటిక్ ట్రీట్మెంట్

ఇది యింగ్లాండులో తయారు చేయబడుచున్నది. దీనిచే యూరిక్ యాసిడ్ శరీరమందుండి వెడలిపోవు ననియు. వాతజాడ్య ములు తగ్గిపోవుననియు పేటెంటు కర్త ప్రకటించియున్నాడు.

పొటాస్ అయోడయిడ్ 15 గ్రెయినులు, సోడా సాలిసైలస్ 66 గ్రెయినులు. యెకస్ట్రెక్టె యో 28 గ్రెయినులు, ఆల్కాహోలు 5 గ్రెయినులు, మిగిలినది నీరు. మొత్తము 8 ఔన్సు లుండునట్లు చేయుము. డోసు- 1 చంచా ప్రమాణము. దినమునకు మూడు పర్యాయములు పుచ్చుకొన వలయును. రక్తవాతము నరములు లాగుట, వాతనొప్పులు, వీటికిది ఉపయోగకరమైనది.

## 157 ప్లీహాంతక ద్రవము

ఇది కాన్పూరులో ప్రసిద్ధినొంది యున్నది. 16 ఔన్సులు మందుగల సీసా ఖరీదు 1 రూపాయి.

అన్నభేది $\frac{1}{2}$ డ్రాము. మెగ్నీషియా సల్ఫ 1 ఔన్సు, క్వైనైన్ సల్ఫ $\frac{1}{4}$ డ్రాము. తేనె 1 డ్రాము, కిరాతారిష్ట 1 ఔన్సు, నీళ్ళు $12\frac{1}{2}$ ఔన్సులు. మొత్తమును కలుపుము. డోసు - 1 ఔన్సు, ఉదయమ్ము

సాయంత్రము నీటితో కలిపి పుచ్చుకొనవలయును. దీనిచే ప్లీహము, జ్వరము తగ్గి చక్కని జీర్ణశక్తి కలుగును. మూడు సీసాలు పుచ్చుకొనినచో ప్లీహజాడ్యము సమూలముగా నశించునని పేటెంటు కర్త ప్రకటించియున్నాడు.

## 158 జంబీర పానకము

ఇది అన్నిచోట్లను విక్రయింప బడుచున్నది.

నిమ్మరసము 1 పౌను, అల్లపురసము అరపౌను, చక్కెర 1½ పౌను, నీరు 1 పౌను, మొత్తమునుకలిపి షర్బత్ తయారుచేయుము. యిది యకృత్ ప్లీహ వికారములను నశింపజేసి జీర్ణశక్తిని వృద్ధిజేయగలదు. దీనిని యెనిమిది ఔన్సుల సీసాలలోనింపి లేబిల్సు అతికించి రూపాయి చొప్పున విక్రయింపుము. అన్నిచోట్లను విక్రయింపబడుచున్నది. యిదే!

## 159 పాచక చూర్ణము

లాహోరులో పేటెంటు చేయబడినది. 10 తులముల డబ్బీ ఖరీదు 1 రూపాయి. దీనిచే ఆహారము జీర్ణమై చక్కగా ఆకలి కాగలదు.

వేయించబడ్డ జీలకర్ర 20 భాగములు, సౌవర్చలవణము 5 భాగములు, శొంఠి 2 భాగములు, నల్లమిరియాలు 2 భాగములు ధనియాలు 10 భాగములు, సైంధవలవణము 5 భాగములు, చక్కెర 20 భాగములు, ఆమ్రఫలచూర్ణము 40 భాగములు, మొత్తమును కలుపుము. డోసు – 3 మాషములనుండి 6 మాషములవరకు. యిది నీటిలో వేసుకొనిన వెంటనే కరగిపోవును. చాల రుచిగా నుండును.

## 160 జీవన ధార

ఇది కాల్ బా దేవిరోడ్డు, బొంబాయిలో పేటెంటుచేయబడి నది. ప్రసిద్ధిగల మందు. ఒక్కౌన్సు సీసా ఖరీదు 1 రూపాయి అమృతధారవలె పనిచేయగలదు.

కర్పూరము, వాముఅరఖు, పిప్పరమెంటు, వాముపువ్వు, సోపు తైలము. శొంఠి తైలము, లవంగముల తైలము, యివి సమాన భాగములు. కార్బాలిక్ యాసిడ్ అరభాగము, బెంజోయిక్ యాసిడ్ అరభాగము, మొత్తమును కలుపుము. కరిగి ద్రావకమువలె కాగలదు. డోసు – 5 నుండి పదిచుక్కల వరకు.

## 161 రెడ్ పౌడరు

ఇది విలాసపూర్ లోని ఒక వైద్యునిచే పేటుంటు చేయబడినది. 5 తులముల సీసా ఖరీదు 1 రూపాయి. దీనిచే మూత్రనాళపు మంట, వాపు. తగ్గిపోగలవు. నూతనముగా వచ్చిన గనేరియా స్రావము గూడ ఆగి రక్తము పరిశుభ్రము కాగలదు.

గైరికము ½ ఔన్సు, పటికి చూర్ణము ½ ఔన్సు, చక్కెర 1 ఔన్సు. వీటిని మెత్తగా మూర్ణ మొనర్చి సీసాలో నుంచుము. డోసు–3 మాషముల ప్రమాణము. తగిన అనుపానముతో పుచ్చుకొనవలయును.

## 162 Hall's Dinner Pills

ఇంగ్లాండులో తయారు కాబడినది. దీనిచే సాఫీగా విరేచనమగును. 3 గ్రయినుల ప్రమాణముగల 100 మాత్రలఖరీదు 1–8–0 మాత్రలపై సుగర్ కోటింగ్ యివ్వబడియున్నది. రాత్రి ఒకటి మొదలు మూడు మాత్రల వరకు పుచ్చుకొనవలయును.

మెలోజ్ 1 గ్రెయిను, అతిమధురపుచూర్ణము 1 గ్రెయిను, సోపు చూర్ణము ½ గ్రెయిను, క్రేకల్ ½ గ్రెయిను, మొత్తమును

కలిపి ఒక్క మాత్రను చేయుము. యిటులనే 100 మాత్రలను తయారు చేసుకొనవచ్చును.

## 163 Anti Dyspepsia

ఇంగ్లాండులో తయారు చేయబడుచున్నది. 25 మాత్రల ఖరీదు 9 అణాలు. దీనిచే అజీర్ణము తగ్గి చక్కని జీర్ణశక్తి కలుగును.

స్ట్రిచినయిన్ 16 వ భాగము, యిపికాకుయేనా $\frac{1}{2}$ భాగము పిప్పలి $1\frac{1}{2}$ గ్రెయినులు, జెన్షన్ 1 గ్రెయిను. మొత్తమునుకలిపిఒక్క మాత్రను చేయుము. డోసు-ఒక్క మాత్ర. ఆహారము పుచ్చుకొనిన పిమ్మట వేసుకొనవలెను.

## 163 Kemp Cathartic Pills

బొంబాయి కెంప్ కంపెనీలో యిది తయారు చేయబడుచున్నది. ఇది మృదువగు విరేచనౌషధము. దీనిని ఉపయోగించినచో చక్కగా సాఫీయగు విరేచనము లగును. 25 మాత్రల ఖరీదు 15 అణాలు. మందు గుణము కలది.

క్యాలమెల్ 1 గ్రెయిను, యెక్స్ట్రాక్టు ఒలోజ్ $\frac{1}{2}$ గ్రెయిను యక్స్ట్రాక్టు జాలం అరగ్రెయిను. జెన్షన్ 2 గ్రెయినులు, మొత్తమును కలిపి ఒక్క మాత్రను చేయుము. దీనిని రాత్రి పరుండబోవునప్పుడు ఉపయోగించ వలయును.

## 165 కఫ పిల్సు

ఇది ఆలీగఢ్‌లో పేటెంటు చేయబడినది. 40 మాత్రలు గల డబ్బీ ఖరీదు 6 అణాలు. వీటిని నీటితోగాని తగిన అనుపానముతో గాని పుచ్చుకొన వలయును.

లవంగములు, దానిమ్మపట్ట, యవక్షారము, వీటిని సమాన భాగములుగా తీసుకొని తేనెతో నూరి శనగ గింజ ప్రమాణము

మాత్రలను చేయుము. వీటిని చప్పరించు చున్నచో దగ్గు తగ్గిపో గలదు.

## 166 యింద్రజాలవటి

ఇది బరోడాలో "కరామతీ గోలీ" అను పేరుతో పేటెంటు చేయబడినది. 25 మాత్రలు గల డబ్బీ ఖరీదు 12 అణాలు. ఉపదంశము. చర్మరోగములు, వాత వ్రణములు. వీటికిది చాల ఉపయోగకరమైనది.

కంపిల్లము. సున్నము, పొంగింప బడిన మైలతుత్తము, కరక్కాయ, తెల్ల కాచు. వీటిని నీటితో చక్కగానూరి మాషప్రమాణముండునట్లు మాత్రలను చేయుము. ఆవశ్యకతానుసారము దీనిని నీటితోఅరుగదీసి వ్రణములపై వేయుము.

## 167 కాచు మాత్రలు

పై ప్రదేశమందే యిది గూడ తయారు చేయబడుచున్నది, ఉపదంశము మొదలగు వ్యాధులకు పైమందులతోపాటు లోపలికి పుచ్చుకొనుటకై యిది తయారు చేయబడినది.

కర్పూరము, రసకర్పూరము. తెల్లకాచు, తెల్లనేలతాడి, వీటి సమాన భాగములను తీసుకొని తమలపాకు రసముతో నూరి శనగగింజ ప్రమాణముండునట్లు మాత్రలను చేయుము. డోసు-1 మాత్ర ఉదయము సాయంత్రము ద్రాక్షరసముతో పుచ్చుకొన వలయును.

## 168 వాజీకరణ వటిక

నాసిక్‌లో తయారు చేయబడు చున్నది. 40 మాత్రల వెల 2-8-0. యిది పుష్టికరము స్థంభనకరమైనది. మందు గుణయుక్తమైనదే!

కుంకుమ పుప్వు, కురాసానివాము, గొబ్బివిత్తులు, జాజికాయ, జాపత్రి, లవంగములు, తాడికాయపప్పు, నల్లమందు. వీటి సమాన భాగములను చక్కగా నూరి అడవి రేగుపండు ప్రమాణముండు నట్లు మాత్రలను చేయుము. దీనిని పుష్టికొరకు ఉదయము, సాయంత్రము, ఒక్కొక్క మాత్ర పాలతో పుచ్చుకొనవలెను, స్థంభన కొరకు మైధున సమయమునకు 3 గంటలముందుగా ఒక్కమాత్రను పుచ్చుకొని తాంబూలము వేసుకొనవలయును.

## 169 స్థంభన గుటిక

కలకత్తాలోని ఒకడాక్టరుచే యిది తయారుచేయబడుచున్నది. 40 మాత్రల వెల 3 రూపాయిలు. మందు గుణము కలిగినదే!

శుద్ధి చేయబడిన యింగిలీకము, జాజికాయ, అక్కలకర్ర, నల్లమందు. దూలగొండివేరు. వీటిని సమ భాగములను తీసుకొని చక్కగా చూర్ణమొనర్చి తేనె కలిపి శనగగింజ ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. మైధున సమయమునకు ఒక్కగంట ముందుగా ఒక్కమాత్రను పుచ్చుకొని ఆవుపాలను త్రాగవలయును.

## 170 కుష్ఠ విధ్వంసక్

ఇది దీనాజ్ పూర్‌లో తయారు చేయబడుచున్నది, 20 తులముల ప్యాకెట్టు ఖరీదు 3 రూపాయలు. దీనిచే నలుబది దినములలో గ్యారంటీగా లాభము చేకూరగలదని ప్రకటింపబడియున్నది.

యేటి పుచ్చవేరు చూర్ణము 1 భాగము, వేపవేరు చూర్ణము 1 భాగము, బావంచాలు 1 భాగము, అమరశిల గంధకము 1 భాగము. వీటిని మెత్తగా చూర్ణమొనర్చుము. డోసు - 3 మాషముల ప్రమాణమునుండి 5 మాషముల ప్రమాణమువరకు. తేనెతో పుచ్చుకొనవలెను. శనగలతో చేసిన రొట్టెను ఆహారముగా ఉపయోగింపవలెను.

## 171 వాత చూర్ణము

గోరఖ్‌పూరులో యిది ప్రసిద్ధి నొందియున్నది. 5 తులముల సీసా ఖరీదు 8 అణాలు. దీనిచే బాలుర సమస్త జాడ్యములు నశించి పోగలవని ప్రకటింపబడియున్నది.

పచ్చ కరక్కాయ, అడవిపుదీనా, తెల్లతెగడ, వీటిని సమాన భాగములుగా తీసుకొని చూర్ణ మొనర్చి సీసాలో నుంచుము. డోసు-2 గురిగింజల ప్రమాణము నుండి 1 మాషము వరకు పాలతో యిచ్చినచో బాలుర సమస్త జాడ్యములు తగ్గిపోగలవు.

## 172 సఫేద్ సుర్మా

ఇది బొంబాయిలో ప్రచారమందున్నది. లేబిలుపై యిది వివిధ నేత్రరోగములపై పనిచేయగలదని ప్రకటింపబడి యున్నది. కాని కొన్ని జాడ్యములపై మటుకు పనిచేయగలదు. ప్రతిదినము దీనిని ఉపయోగించు చున్నచో దృష్టి మాంద్యము తగ్గిపోగలదు. 6 మాషముల ప్రమాణము మందుగల సీసా ఖరీదు 8 అణాలు.

పటికి బెల్లము, సైంధవ లవణము, వీటి సమాన భాగములను చూర్ణ మొనర్చుము. యిదే పై మందు! దీనిని కొద్దికొద్దిగా కండ్లలో వేయుచుండ వలయును.

## 173 ప్రదర కుఠారము

లక్నోలో యిది పేటెంటు చేయబడినది. 20 తులముల ప్యాకెట్టు ఖరీదు 2 రూపాయలు. మందు ఉపయోగకర మైనది.

* దంబుల్ అఖవయిన్ 1 భాగము, శంఖ జీరకము 2 భాగములు, పిల్లపీచర 4 భాగములు, తెల్ల యాలకగింజలు 1 భాగము ధనియాలు 2 భాగములు. వీటిని మొత్తమును చూర్ణ మొనర్చుము.

---

* హీరాదుఖి అను పేరుగల ప్రసిద్ధమగు యూనానీ వస్తువు.

డోసు-శిమాషములు ప్రమాణము. పంచదార కలిపిన పాలతో ఉపయోగింపవలెను. ప్రదరవ్యాధి తగ్గి పుష్టికలుగ గలదు.

## 174 అక్సీర్ దమా (శ్వాస్)

ఇది కాస శ్వాసలపై పనిచేయగల మందు. లాహోరులోని సుప్రసిద్ధ వైద్యునిచే యిది పేటెంటు చేయబడినది. ఒక్క గురిగింజ ప్రమాణము మందును తేనెతో పుచ్చుకొనవలెను.

సాంభారు లవణము 3 మాషములు, చేపపిత్తము (ఒక్క చేపది), కలబంద గుజ్జు 10 తులములు, మొదట పిత్తమును లవణమును కలిపి నూరి పిమ్మట దీనిని కలబంద గుజ్జులోనుంచి నిప్పుపై నుంచుము. కాలిన పిమ్మట తీసి చూర్ణమొనర్చుము.

## 175 మాసిక్ స్రావక వటి

ఇది లాహోరులో ప్రచారమందున్నది. ఒక్క మాత్రను యోనిలో నుంచుకొనినచో ఆగిపోయిన ఋతురక్తము తిరిగి వెలువడ గలదు. పృథక్కరణానంతరము మందు గుణయుక్తమైనదని తేలినది.

యేటిపుచ్చ వేరును చక్కగా చూర్ణ మొనర్చి నీటితో నూరి నల్లకరక్కాయ ప్రమాణముండునట్లు మాత్రలను చేయుము. దీనిని యోనిలో గర్భాశయమునకు దగ్గరగా నుంచినచో ఋతురక్తము వెడలి రాగలదు.

## 176 ప్రమేహాంతక వటి

ఇది కాన్పూరులో పేటెంటు చేయబడినది. దీని ప్రకటన ప్రతిస్టేషనులోను కానుపించు చుండును. 40 మాత్రలు గల సీసా ఖరీదు 2-8-0. మూడు సీసాలను ఒకేమాటు తీసుకొన్నచో మరొకటి ఉచితముగా యియ్యబడును. దీనిచే వీర్యవికారము లన్నియు సంపూ

ర్ణముగా తగ్గిపోవునని ప్రకటింప బడియున్నది. గుణయుక్తమైన దైనను ప్రకటనానుసారము పనిచేయలేదు.

వెదురుప్పు 1 భాగము, శిలాజిత్ 1 భాగము, రుమీమస్తగీ 1 భాగము, సాంబ్రాణి 1 భాగము, గుగ్గిలము 1 భాగము, చలువ మిరియాలు 1 భాగము, యేలకగింజలు 1 భాగము, పసుపు 1 భాగము. వీటిని మెత్తగా చూర్ణమొనర్చి చందన తైలముతో నూరి 2 గురిగింజల ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. డోసు – 2 మాత్రలు. ఉదయము సాయంత్రము నీటితో పుచ్చుకొనవలయును.

## 177 మహత్ వాజీకర్ణ వటి

ఇదిగూడ పై చోటనే తయారుచేయ బడుచున్నది. 80 మాత్రలు గల డబ్బీ ఖరీదు 3 రూపాయిలు, ప్రకటనానుసారము యిది చక్కగా పనిచేయ గలదు.

శుద్ధి చేయబడిన విషముష్టి 1 భాగము. యర్రలు 1 భాగము, రేనాడు 1 భాగము, దూలగొండి విత్తులు $\frac{1}{3}$ భాగము, అక్కలకర్ర $\frac{1}{3}$ భాగము, సునిషణ్ణక గింజలు $\frac{1}{2}$ భాగము, రుమీమస్తగీ $\frac{1}{3}$ భాగము జాజికాయ $\frac{1}{3}$ భాగము, జాపత్రి $\frac{1}{3}$ భాగము, కుంకుమపువ్వు $\frac{1}{2}$ భాగము, తుమ్మబంక $\frac{1}{2}$ భాగము, నల్లమందు $\frac{1}{4}$ భాగము. మొత్తమును తేనెతో మెత్తగా నూరి రెండు గురిగింజల ప్రమాణముండునట్లు మాత్రలను చేయుము. డోసు – 2 మాత్రలు, ఉదయము, రాత్రి పడుకొనబోవునప్పుడు, మీగడతో పుచ్చుకొనవలెను. ఇది బల హీనతను పోగొట్టి శరీరమునకు పుష్టినిచ్చి వాజీకరణ శక్తిని వృద్ధి నొందించ గలదు.

## 178 అపూర్వ ప్రదరారి

ఇదిగూడ పై చోటనే తయారు చేయబడినది. 10 తులముల మందు గల ప్యాకెట్టు ఖరీదు 2 రూపాయిలు. ఇది స్త్రీల సర్వరోగ

ములను సంపూర్తిగా పోగొట్ట కలవని ప్రకటింపబడి యున్నది. కాని శ్వేతప్రదరములను సంపూర్తిగా పోగొట్టి పుష్టినివ్వ గలదు.

పోకపువ్వులు 4 భాగములు, పిస్తాపూలు 4 భాగములు, మోదుగ జిగురు 4 భాగములు, అశ్వగంధ (నవనగరుది) 2 భాగములు, కొడిశపాలగింజలు 2 భాగములు. వంగభస్మము $\frac{1}{4}$ భాగము, ముత్యపుభస్మము $\frac{1}{4}$ భాగము, * అకీక్ (యవనదేశపు రాళ్ళు) భస్మము $\frac{1}{8}$ భాగము. మొత్తమును కలిపి చక్కగానూరి చూర్ణము చేయుము. డోసు - 2 మాషముల ప్రమాణము. ఆవుపాలతో ఉదయము సాయంత్రము పుచ్చుకొనవలెను. దీనిచే వివిధములగు శ్వేతస్రావములు ఆగిపోగలవు.

## 179 ఒకే దినములో గనేరియా పోతుంది!

పూనాలో యీ యోగము ప్రసిద్ధినొందియున్నది. ప్రకటనానుసారము మందు చక్కగా పనిచేయగలదు. కాని మందునుటుకు చాల కఠినమైనది. దుర్బలులుగూడ దీనిని పుచ్చుకొన వచ్చును. మోతాదు తక్కువైనచో మందు పనిచేయజాలదు. పేటెంటు కర్త ఒక్కడోసు మందుకు 10 రూపాయిలు పుచ్చుకొనుచున్నాడు.

గవ్వపలుకు సాంబ్రాణి 1తులము, చందనతైలము 1తులము. రెంటినీ కలిపి మెత్తగా నుండునట్లు నూరి దీనిని రోగిచే నాకింపుడు. 24 గంటల వరకు రోగికి మరేపదార్థము త్రాగుటకు తినుటకు యివ్వగూడదు. దాహము కల్గినను గూడ యీయగూడదు. వ్యాధి తగ్గిపోనారంభించును. రెండవ దినమునుండియు అన్ని వస్తువులను పుచ్చుకొనవచ్చును. కొద్ది దినముల వరకు చందనపు షర్బత్‌ను పుచ్చుకొనుచుండ వలెను.

## 180 ఒకే దినములో ఉపదంశము నశిస్తుంది

ఇదిగూడ పైచోటనే ప్రసిద్ధినొంది యున్నది. పైదానివలె యిదిగూడ కఠినమైనదే కాని గ్యారంటీగా పనిచేయ గలదు. ఖరీదు 10 రూపాయిలు.

రసకర్పూరము. 6 గురిగింజలయెత్తు, సవీరము 6 గురిగింజల యెత్తు, యింగిలీకము 6 గురిగింజలయెత్తు, గంజాయి విత్తులు 6 గురిగింజల యెత్తు. వీటిని మెత్తగా నూరి ఒక్క పొట్లము కట్టుము. యిది ఒక్కడోసుకు సరిపోవును. అవసరమగు నప్పుడు రోగి తిన గలిగినంత ఆడుమేక మాంసమును తెచ్చి అందు యెక్కువగా నెయ్యి, గరం మసాలా. 40 లేక 50 మిరియాలు వేసి వండుడు. ఉడుకుట పూర్తిగా వచ్చిన వెంటనే పై పొట్లమును అందువేసి చక్కగా వుడి కిన పిమ్మట దించి సగము వేడివుండగానే నిశ్శేషముగా పుచ్చుకొన వలయును. ఒకేడోసుసరిపోవును. దీనినిరాత్రి 8 లేక 9 గంటలప్పుడు పుచ్చుకొన వలెను. రాత్రి 5 లేక 6 విరేచనము లగును. వ్యాధి తగ్గిపోగలదు మందును పుచ్చుకొనిన పిమ్మట 8 దినములవరకు చలి నీటిని ముట్టుకొనరాదు. సర్వకార్యములకు వేడినీటినే ఉపయోగించు కొనవలెను. లేనిచో వాత నొప్పులు యేర్పడ గలవు.

N. B. పై రెండు యోగములను చాల జాగ్రత్తగా కనిపెట్టి ఉపయోగింపవలెను. లేనిచో లాభమునకు మారు నష్ట మేర్పడ గలదు. మందులు సటుకు సుప్రసిద్ధ మైనవే!

## 181 ఉపదంశామృతము

అలహాబాదులోని వైద్యునిచే యిది పేటెంటు చేయుబడినది, 40 మాత్రలు గల డబ్బీ ఖరీదు 1-12-0. మందు గుణయుక్త మైనదే!

శుద్ధి చేయబడిన పాదరసము 1 భాగము, అతిమధురపు చూర్ణము 2 భాగములు, తేనె 3 భాగములు. వీటిని కలిపి మెత్తగా

నూరి శనగగింజ ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. ఉదయమున ఒక్క మాత్రను మీగడలో పెట్టుకొని పుచ్చుకొనవలయును. మరొక మాత్రను అరుగదీసి పైన వ్రాయవలయును. ఉలవ పప్పు, రొట్టె, పుచ్చుకొనవలెను. 10 మాత్రలతోనే ఆరోగ్యము కలుగునని పేటెంటు కర్త ప్రకటించి యున్నాడు. మందు పండ్లకు తగిలినచో నోరు తెరచుటకు గూడ వీలుపడదు. రోగము తప్పక తగ్గిపోగలదు.

## 182 గ్యారంటీ తామరమందు

ట్రావెన్ కూర్ లో యిది తయారు చేయబడుచున్నది. గ్యారంటీగా పనిచేయగలదనియు, ఒకేదినములో చర్మవ్యాధులు, గజ్జి, తామర మొదలగునవి నశించిపోవుననియు ప్రకటింపబడియున్నది.

అమరశిల గంధకము 6 మాషములు, గైరికము 6 మాషములు, నల్లజీలకర్ర చూర్ణము 6 భాగములు, వీటిని మెత్తగా నూరి 3 పొట్లములను కట్టుము అవసరమగు నప్పుడు ఒక్క పొట్లమును ఉదయమున తీయని పెరుగుతో పుచ్చుకొనవలెను, తిరిగి మూడు గంట లుండి రెండవ పొట్లమును పుచ్చుకొనవలెను. ఆగోజంతయు కొద్ది కొద్దిగా పెరుగును పుచ్చుకొను చుండవలెను మూడవ పొట్లమును అయిదు తులముల ఆవనూనెలో కలిపి శరీరమం దంతటను రుద్దుకొనవలెను. సాయంకాలమున పెరుగు అన్నమును తినవలెను. ఒక్క దినములో గజ్జి, శీట మొదలైనవి తగ్గిపోగలవు.

## 183 రక్త శోధక్

నాలుఔన్సుల పరిమాణముగల సీసా ఖరీదు 1 రూపాయి. యిది అహమ్మదాబాదులో పేటెంటు చేయబడినది. మందు గుణము కలదే.

పొటాష్ అయోడయిడ్ 52½ గ్రెయినులు, స్పిరిట్ సాల్వొలాటయిల్ 10 చుక్కలు, స్పిరిట్ క్లోరోఫారమ్ 68 చుక్కలు, లయి

కర్ ఆర్సనిక్ 18 చుక్కలు, యిక్ ఫ్ల్యూజన్ చిరేటా 3 ఔన్సులు మిగిలినది నీరు. మొత్తము నాల్గు ఔన్సులుండునట్లు చూడుము. డోసు - 1 డ్రాము. ఔన్సు నీటిలో కలుపుకొని భోజనానంతరము పుచ్చుకొనవలెను. దీనిచే చర్మవ్యాధులు, రక్తవికారములు తగ్గి పోగలవు.

## 184 పయిల్స్ ఆయింట్‌మెంట్

ఇది కలకత్తాలో పేటెంటు చేయబడినది. ఒక ఔన్సు పరిమాణము గల డబ్బీ ఖరీదు 1-4-0. దీనిని వాడినవెంటనే బాధలు, మంట తగ్గి కొలది కాలములోనే మొలల పిలకలు ఊడిపోగలవు.

నల్లమందు 6 భాగములు, మాజు ఫలము 96 భాగములు, గొర్రె కొవ్వు 480 భాగములు, ఆవనూనె 480 భాగములు, మైనము 96 భాగములు, మొదట తైలము, కొవ్వు, మైనము కలిపి వడగట్టి అందు మిగిలిన వాటిని చక్కగా కలిపి సీసాలో నుంచుము, దీనిని ప్రతిదినము వ్రాయుచుండవలెను.

## 185 జ్వరాది గుటిక

భడౌచ్ లో ఇది పేటెంటు చేయబడినది. 100 మాత్రల ఖరీదు 1 రూపాయి. ఇది వివిధ జ్వరములపై పనిచేయగలదని ప్రకటింపబడి యున్నది. కాని మలేరియా జ్వరములపై మటుకు అత్యుత్తమముగా పనిచేయగలదు. చాలతక్కువకే గిట్టుబాటగును.

నల్లమిరియాలు $2\frac{1}{2}$ భాగములు, మొర్రపటికి భస్మము $2\frac{1}{2}$ భాగములు, వీటిని మెత్తగా తులసి ఆకుల రసముతో నాలుగు జాములు మర్దించి పెద్ద బటానీగింజ ప్రమాణముండునట్లు మాత్రలను చేయుము. డోసు-1 నుండి 2 మాత్రల వరకు, నీటితో ఆవశ్యకతానుసారము ఒక్కమారుగాని, అనేకమార్లు గాని, యివ్వవలెను,

## 186 Emaciation Pills

ఇది జబ్బల్‌పూరులో పేటెంటుచేయబడినది. దీనిని వాడినచో బాలురు ఆరోగ్యవంతులై దృఢగాత్రులుగా నుండగలరు మందు ఉపయోగ కరమైనది.

కుంకుమపువ్వు 32 భాగములు, కస్తూరి 1 భాగము, నల్లమందు 1 భాగము, అరుద్రపురుగులు 16 భాగములు, వీటిని గులాబీ రసముతో నూరి ఆవగింజ ప్రమాణముండునట్లు మాత్రలను చేయుము. డోసు 1 నుండి 2 మాత్రల వరకు పాలతో యివ్వవలెను.

## 187 నెపోలియన్ మిక్చర్

ఇది ఇంగ్లాండునుండి దిగుమతి చేయబడుచున్నది. నాలుగు ఔన్సుల సీసా ఖరీదు 2 రూపాయలు. దీనిచే శ్వాస సంబంధములగు వికారములన్నియు తగ్గిపోగలవని ప్రకటింపబడి యున్నది. కాని దీనిచే శ్వాస పూర్తిగా తగ్గిపోదు. ఉపశాంతము మటుకు కాగలదు. మందు ఉపయోగకరమైనదే!

టించర్ లోబీలియా 3 డ్రాములు, టించర్ స్ట్రెమోనీ 6 డ్రాములు. అమ్మోనియాక్లోరయిడ్ 4 డ్రాములు, టించర్ క్లోరో ఫారమ్ కాంపౌండ్ 4 డ్రాములు, సిరప్‌కొడీనా 2 ఔన్సులు, మొత్తమును కలుపుము. ఆవశ్యకతాను సారము ఒక డ్రాము మందును ఔన్సు నీటితో కలిపి పుచ్చుకొనవలెను.

## 188 గ్రహిణి మాత్రలు

ఇది సాగరులో ప్రచారమందున్నది. 24 మాత్రలు గల సీసా ఖరీదు 1 రూపాయి. దీనిచే విరేచనములు ఆగిపోగలవు.

పాదరసము 1 భాగము, గంధకము 1 భాగము, నల్లమందు 1 భాగము, కోడిశపాలవిత్తులు 1 భాగము, బిల్వశొంఠి 1 భాగము, తుంగ

గడ్డలు 1 భాగము, అక్కలకర్ర 1 భాగము. వీటిని చక్కగాచూర్ణ మొనర్చి అల్లపురసముతో నూరి గురిగింజ ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. అవశ్యకతానుసారము ఒక్కమాత్రనుండి రెండు మాత్రల వరకు సోపురసముతో పుచ్చుకొన వలెను.

## 189 పట్టీ నపుంసక్

ఇది లక్నోలో తయారు చేయబడి ప్రసిద్ధినొందియున్నది. ఒక్కొక్కనికి దీనిచే చక్కని లాభము చేకూరుచున్నది. ఒక్కొక్కరికి వేడితగ్గుటచే తప్ప మరెట్టి ఉపకారము జరుగుటలేదు. మందు ఉపయోగకరమైనది. మూడు దినములకు సరిపోవు మూడు పట్టీల ఖరీదు ఆరురూపాయలు.

నీరుకుక్క వృషణములు (జున్ను) 21 భాగములు, అక్కలకర్ర 21 భాగములు దాల్చినచెక్క 21 భాగములు. వీటిని కలిపి నూరుము. యెండిన పిమ్మట యిందుండి 21 మాషముల ప్రమాణము తీసికొని స్పిరిట్స్ ఆఫ్ ఫ్రెంచ్ వయిన్‌తో కలిపి నూరిగుడ్డపై పూసి పట్టీగా తయారు చేయుము. మొదట లింగమును నువ్వుల నూనెతో చక్కగా మర్దించి పిమ్మట దీనినిపైన వేసి పట్టుదారముతో కట్టుము. యిటుల మూడు దినముల వరకు చేయుచుండ వలెను. దీనిచే నపుంసకునకు పుంస్త్వము సిద్ధించ గలదు.

## 190 శూలాంతక వటి

ఇది రాజకోటలో తయారుచేయ బడుచున్నది. 60 మాత్రలు గల సీసా ఖరీదు 2 రూపాయలు. దీనిని చలినీటితో రెండు మూడు మాత్రలను యిచ్చినచో శూల యెచ్చటనున్నదైనను వెంటనే తగ్గిపోగలదు.

శొంఠి 1 భాగము, మిరియాలు 1 భాగము, పిప్పలి 1 భాగము, వృద్ధదారు పత్రముల రసము 1½ భాగము, యేటిపుచ్చ

ఆకుల రసము 1½ భాగము. మందు పైనూడు వస్తువులను చూర్ణ మొనర్చి మొదట వృద్ధదారు, పిప్పిలి, యేటిపుచ్చ ఆకులరసముతో మర్దించి శనగగింజ ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. డోసు 1 నుండి 2 మాత్రలవరకు.

## 191 యాంటీప్లేగ్

ఇది గిర గావ్, బొంబాయిలో పేటెంటు చేయబడినది. 3 ఔన్సుల ప్రమాణముగల సీసా ఖరీదు 2 రూపాయలు. ప్లేగుకు యిది అమోఘ మైనదని యెంచబడుచున్నది. మందు గుణము కలదే!

పొటాస్ నయిట్రస్ 10 భాగములు, అమోనియా బ్రొమ యిడ్ 15 భాగములు, యాసిడ్ కార్బాలిక్ 5 భాగములు గ్లిసరిన్ 60 భాగములు లయికర్ అమోనియా స్పిరిట్ 90 భాగములు, లయికర్ అమోనియా యెసీటెస్ 180 భాగములు లయికర్ స్ట్రిచి నియా 15 భాగములు, టించర్ డిజిటాలిస్ 6 భాగములు టించర్ స్ట్రొఫెంథస్ 15 భాగములు మొత్తమును కలిపి సీసాలో నుంచుము. డోసు –90 చుక్కలు. ఒక్క ఔన్సు నీటిలో కలుపుకొని పుచ్చు కొనవలెను. దినమునకు 2 పర్యాయములు. దీనిచే ప్లేగుయొక్క తీవ్రతాప దశలో గూడ వెంటనే సుగుణము కానుపింపగలదు.

## 192 యాంటీ కలరా

ఇది కలకత్తాలో పేటెంటు చేయబడినది. ఒక్క ఔన్సు సీసా ఖరీదు 12 అణాలు. యిది కలరాకు రామబాణము వంటిదని ప్రకటింప బడియున్నది. మందు గుణము కలదే.

ఆయిల్ జునీపర్ 5 భాగములు ఆయిల్ క్లోజ్ 5 భాగములు, ఆయిల్ కాజపుటీ 5 భాగములు, స్పిరిట్ యీథరస్ 30 భాగములు, యాసిడ్ సల్ఫ్యూ అరంమేటిక్ 15 భాగములు, మొత్తమును కలు పుము. డోసు–1 డ్రాము. అర ఔన్సు నీటిలో కలిపి వమనములు,

విరేచనములు అగునంత వరకు అరగంట కొకతూరి చొప్పున యిచ్చు చుండవలెను.

## 193 మలేరయా క్యూర్

బొంబాయిలో తయారు చేయబడుచున్నది "వివిధ జ్వరములపై పనిచేయగలదు." అని ప్రకటింప బడియున్నది. కాని మలేరియా జ్వరముపై మటుకు పనిచేయగలదు. 50 మాత్రల వెల 1 రూపాయి.

మెథిలేన్ బ్లూ 2 భాగములు, ఫెర్రీకార్బోనేట్ 1 భాగము, క్వైనైన్‌సల్ఫు 2 భాగములు, యాసిడ్ ఆర్సనిక్ $\frac{1}{80}$ భాగము మొత్తమును కలిపి 5 గ్రెయినుల ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము డోసు - 1 మాత్ర, జ్వరశక్తిని అనుసరించి దినమునకు రెండు మూడు పర్యాయములు యివ్వవలెను.

## 194 బహార్ కానసీ

శక్తి ఔషధాలయము, ఢక్కాలో యిది పేటంటు చేయబడినది. వివిధములగు వ్రణములకు యిది అమోఘమగు మందని యెంచబడుచున్నది. ఔన్సుసీసా ఖరీదు 8 అణాలు. మందు గుణయుక్తమైనదే.

నువ్వులనూనె 640 భాగములు, వేపాకుల రసము 22 భాగములు, గోరంట ఆకులరసము 22 భాగములు వస 2 భాగములు, గుగ్గిలము 2 భాగములు ముద్దారుశింగు 2 భాగములు. ఆడుమేక యెముకల భస్మము 2 భాగములు, రసాంజనము 2 భాగములు, మైనము 30 భాగములు, మొదట ద్రవపదార్థములన్నింటిని కలిపి తైలము మిగిలుండునంత వరకు కాచి పిమ్మట అందు మైనమును కలిపి దించుము. యిందు మిగిలిన వస్తువులను వేసి నూరి సీసాలో నుంచుము. మందు తయారు కాగలదు, దీనిని ఆవశ్యకతానుసారము ఉపయోగింప వచ్చును,

## 195 ప్రమేహ విధ్వంసన వటి

ఇది మురాదాబాదులో పేటెంటు చేయబడినది. 60 మాత్రలు గల సీసా ఖరీదు 2-8-0 దీనిచే సంపూర్ణముగా ప్రమేహము తగ్గి ఆరోగ్యము కలుగునని ప్రకటింపబడి యున్నది. మందు గుణ యుక్తమైనదే.

చలువమిరియాలు 1 తులము, యేలకగింజలు 1 తులము, గైరికము 3 తులములు. వీటినిచూర్ణ మొనర్చి చందనతైలము 2 తులములు కలిపి చక్కగా నూరి ఒక్క మాసప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. డోసు - 1 మాత్ర. పాలతో పుచ్చుకొనవలెను.

## 196 శ్వేతకుష్ఠ హరణ్

ఇది పుచ్చుకొనుటకు పనికివచ్చుమందు. గయలో ప్రచారమ దున్నది. 100 మాత్రలు గల డబ్బీ ఖరీదు 2 రూపాయిలు. దీనిని పుచ్చుకొన్నచో రకరకములగు శ్వేతకుష్ఠులు తగ్గిపోగలవని ప్రకటింపబడి యున్నది.

అమరశిల గంధకము. బావంచాలు. త్రిఫలములు, యివి సమభాగములు. వీటిని చక్కగా నీటితో నూరి శనగగింజ ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. డోసు - 1 మాత్ర. ఉదయము, సాయంత్రము తేనెతో పుచ్చుకొనవలెను. వీటినే గోమూత్రముతో అరగదీసిమచ్చలపై వ్రాయవలెను. మందు పుచ్చుకొనునప్పుడు పులుపు వస్తువులను, పాలు, పెరుగు, మజ్జిగను, యేమాత్రము ఉపయోగింపరాదు.

## 197 చాతుర్థాహ్నిక జ్వరౌషధము

"చాధియాకీ దవా" అను పేరుతో యిది బెనారసులో పేటెంటు చేయబడినది. 40 మాత్రల వెల 1 రూపాయి. మాత్ర గురిగింజ ప్రమాణము కలదు ఉపయోగకరమైనదే.

హరతాళకము (పత్రతాళకము) భాగము, చల్లార్పనిసున్నపు రాళ్ళు 1భాగము, మైలతుత్తము 1 భాగము. వీటిని కలబంద రసముతో నూరి మాత్రలను చేసి చిన్న పిడతలో వేసి గజపుటము పెట్టుము. చల్లారినపిమ్మట తీసి నీటితో నూరి ½ గురిగింజల ప్రమాణముండునట్లు మాత్రలను చేయుము. డోసు – 1 మాత్ర. జ్వరము వచ్చుటకు ముందు పాలతో పుచ్చుకొనవలెను. 2, 3, మాత్రలను పుచ్చుకొనిన తోడనే జ్వరము తగ్గిపోగలదు.

## 198 కామకళ

గుజరాతు ప్రాంత్యములో పేటెంటు చేయబడినది. 40 మాత్రలు గల సీసా ఖరీదు 1 రూపాయి. ధాతు స్రావములపై యిది పనిచేయ గలదు.

చందనము భాగము. దాల్చినచెక్క 1 భాగము, వెదురుప్పు. 1 భాగము, తెల్ల యేలకులు 1 భాగము, లవంగములు 1 భాగము, కుంకుమపువ్వు 1 భాగము, జాపత్రి 1భాగము, పిల్లపీచర 1 భాగము అశ్వగంధ 1 భాగము, మిరియాలు 1 భాగము. వీటిని చక్కగా చూర్ణ మొనర్చి గులాబీ రసముతో నూరి ఒక్క మాషప్రమాణముండునట్లు మాత్రలను జేయుము. డోసు – 1 మాత్ర, పాలతో ఉదయము. సాయంత్రము పుచ్చుకొనవలెను. దీనిచే ధాతుస్రావము ఆగి వీర్యము పుష్టి నొందగలదు

## 199 మధుమేహ హర వటి

గాజపూర్‌లో యిది పేటెంటు చేయబడినది. మందు గుణయుక్తమైనదే. సాధారణ పరిస్థితిలో పనిచేయగలదు. 25 మాత్రలు గల సీసా ఖరీదు 1–8–0

నేరేడు విత్తుల చూర్ణము 12 భాగములు, నల్లమందు 1 భాగము. రెంటినీ మెత్తగా నూరి 9 గురిగింజల ప్రమాణముండు

నట్లు మాత్రలను చేయుము. ఉదయము సాయంత్రము ఒక్కొక్క మాత్రను పాలతో పుచ్చుకొనవలెను. తీపివస్తువులను యేమాత్రము పుచ్చుకొనరాదు.

## 200 శ్వేత కుష్ఠ

చూర్ణరూపము లోనున్న యీ మందు గయలో పేటెంటు చేయబడినది. దీనిని వ్రాసినచో శ్వేతకుష్ఠం నశించి పోగలదని ప్రకటింపబడి యున్నది.

బావంచాలు 1 భాగము. సన్నావాలు 1 భాగము. కాల్చబడిన నెమలి యెముకలు 1 భాగము. వీటిని మెత్తగా చూర్ణమొనర్చి సీసాలో నుంచుము. దీనిని నీటితో కలిపి పైన వ్రాయవలెను. మందు పనిచేయగలదు.

## 201 ఆమ్ల పిత్తాంతక వటి

కాన్‌పూర్‌లో యిది పేటెంటు చేయబడినది. 40 మాత్రల వెల 8 అణాలు.

నూరేకారము 1 భాగము. నవాసాగరము 1 భాగము. రెంటినీ నీటితో నూరి నాల్గు గురిగింజల ప్రమాణముండునట్లు మాత్రలను చేయుము) డోసు - 1 మాత్ర. వేడి నీటితో పుచ్చుకొనవలెను. మిరియాలు, పులుపు, పుచ్చుకొనగూడదు. నాల్గు దినములలో సుగుణము చేకూరగలదు.

## 202 స్త్రీ జీవన వటి

బరోడాలో పేటెంటు చేయబడినది. 30 మాత్రలు గల సీసా ఖరీదు 1-8-0. యిది స్త్రీల సమస్త జాడ్యములను నిశ్శేషముగా పోగొట్ట కలదని ప్రకటింపబడి యున్నది. మందు గుణము కలదే. ప్రదర జాడ్యములపై చక్కగా పనిచేయుగలదు.

పాదరసము 1 భాగము, గంధకము 1 భాగము, అభ్రకము 1 భాగము, లోహము 1 భాగము. వీటిని కలబంద రసముతో 8 జాములు మర్దించి శనగగింజ ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. డోసు - 1 మాత్ర. ఉదయము సాయంత్రము జీలకర్ర కషాయముతో పుచ్చుకొనవలెను.

## 203 కామాంధకార వటిక

పూనాలో యిది పేటెంటు చేయబడినది. 40 మాత్రలు గల సీసా ఖరీదు 5 రూపాయిలు. మందు చాల అత్యుత్తమ మైనది.

చల్లగడ్డలు 1 భాగము. ఉల్లి విత్తులు 1 భాగము, పిండ ఖర్జూరము 1 భాగము, ఊరపిచ్చుక (మొగదాని) మాంసము 1 భాగము, సాలామిశ్రి 1 భాగము అడవి వెల్లుల్లి విత్తులు 1 భాగము, జున్ను 1 భాగము. రేనాడు 1 భాగము, కస్తూరి $\frac{1}{4}$ భాగము. వీటిని మెత్తగా తేనెతో నూరి పెద్ద బటానీగింజ ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. డోసు - 1 నుండి 2 మాత్రల వరకు. ఉదయమున గాని లేక రాత్రి పరుండబోవునప్పుడు గాని 5 తులముల ద్రాక్షరసముతో పుచ్చుకొనవలెను. దీనిచే ప్రత్యేకముగా ఒకనూతన శక్తి, మందు పుచ్చుకొసిన దినమునుండే కనుపింపగలదు. ఇదినరములకు బలమునిచ్చి వాజీకరణశక్తిని వృద్ధినొందించగలదు. మందు పుచ్చుకొను కాలములో పుష్టికరమగు ఆహారమును పుచ్చుకొనుచుండవలెను. దీనిని పుచ్చుకొనుకాలము లో మైథున క్రియనుండి విముక్తి పొందగలిగినచో వృద్ధాప్యములోగూడ తరుణత్వసుఖమును పొందవచ్చును. దీనితోపాటు ఒక్క పావుశేరు పాలలో 3 తులములు కోడిగ్రుడ్డు రసమును కలిపి పుచ్చుకొనినచో మిక్కుటముగు లాభము చేకూరగలదు.

## 204 గ్యారంటీ అశ్మరీ

ఇది ''అక్సీర్ పథరీ'' అను పేరుతో పేటెంటు చేయబడినది. ఒక్క నెలకు సరిపోవు మందు ఖరీదు 3 రూపాయిలు. వర్ణనాను

సారము మందు చక్కగా పనిచేయ గలదు. కొద్ది దినములు పుచ్చు కొనిన తోడనే అశ్మరి ముక్కలు ముక్కలై వెలువడి పోగలదు.

నాటు సూరేకారము 10 తులములు, యెర్రపటికి 10 తులములు. వీటిని ఒక మట్టి పాత్రలోనుంచి అందు అడవి యెద్దునాలుక చెట్టు రసము ఒక్క శేరు (80 తులములు) పోసి నిప్పుపై నుంచి రసము యింకిపోవునంతవరకు కాచుము. పిమ్మట అందుండి మందును తీసి మెత్తగా చూర్ణ మొనర్చి దానికి సమ భాగ ముండు నట్లు * సంగ్‌యహూద్, ముల్లంగి క్షారము, కలిపి తిరిగి నూరుము. డోసు - 4 మాషముల ప్రమాణము. 2 తులముల * వజూరీ షర్బత్తుతో పుచ్చుకొనవలెను. మూత్రాశ్మరి ముక్కలు ముక్కలై వెలువడి పోగలదు.

## 205 స్తంభన వటి

మోతీబజారు, బొంబాయిలో యిది పేటెంటు చేయబడినది. 8 మాత్రల ఖరీదు 5 రూపాయిలు, మందు గుణము కలిగినదే! ధర అధికముగా నున్నను యిది అత్యధికముగా విక్రయింప బడుచున్నది.

ఒక్క ఊరపిచ్చుకను (మొగదానిని) చంపి దాని పొట్టను పరిశుభ్రముచేసి అందు 6 మాషముల నల్లమందు నూచి తిరిగి దానిని కుట్టి శీల మన్ను యిచ్చి పదిశేర్ల యెరుడు పిడకలతో పురము పెట్టుము. చల్లారిన పిమ్మట తీసి దానికి సమభాగ ముండునట్లు గవ్వ పలుకు సాంబ్రాణిని కలిపి తేనెతోనూరి ½ మాష ప్రమాణ ముండు నట్లు మాత్రలను చేయుము. సాయంత్రము భోజనానంతరము నాల్గు గంటలకు, మైథున సమయమునకు ఒక్కగంట ముందుగా, ఒక్క మాత్రను పాలతో పుచ్చుకొనవలెను. పిమ్మట దీని చమత్కార మును చూడవచ్చును.

*యూనానీ ఫార్మసీలలో దొరుకగలవు.

## 206 లూటీ మలాము

ఖేత్ వాడి, బొంబాయిలో దీనికి చక్కని ప్రచారము కలదు. ఇది లూటీ వ్రణములకు చక్కగా పనిచేయ గలదు. అరఔన్సు డబ్బీ ఖరీదు 4 అణాలు.

కర్పూరము $1\frac{1}{2}$ భాగము, కాచు $\frac{1}{4}$ భాగము, నువ్వులనూనె 5 భాగములు, మైలతుత్తము 1 భాగము, మైనము 1 భాగము. మైనమును తైలమును కలిపి కాచుము. పిమ్మట మైలతుత్తమును పొంగించి అందు కలిపి కాచు, కర్పూరమును, వేసి చాల చక్కగా నూరి డబ్బీలో నుంచుము. మందు తయారు కాగలదు. ఇది వ్రణములకు, లూటీ కురుపులకు ఉపయోగకరమైనది.

## 207 హబ్బ యిమ్ శాక్

ఇది వాజీకర ణౌషధము. 40 మాత్రలు గల డబ్బీ ఖరీదు 2-8-0. ఢిల్లీలో పేటెంటు చేయబడినది. చక్కగా పనిచేసి శక్తిని వృద్ధి నొందించగలదు.

కుంకుమ పువ్వు 4 భాగములు, నల్లమందు 6 భాగములు, రుమీమస్తగీ 6 భాగములు, శిలాజిత్ 6 భాగములు, హింజలము 6 భాగములు, నాగ కేసరములు 6 భాగములు, లవంగములు 6 భాగములు. మొత్తమును చక్కగా చూర్ణ మొనర్చి తమలపాకు రసముతో నూరి రెండు గురిగింజల ప్రమాణముండునట్లు మాత్రలను చేయుము. ఆవశ్యకతాను సారము ప్రతి దినము ఉదయమున ఒక్క మాత్రను పాలతో పుచ్చుకొనుచుండినచో బల వీర్యములు వృద్ధి నొంద గలవు. మైథున సమయమునకు ముందుగా పుచ్చుకొనినచో వీర్యస్తంభన మగును.

## 208 ప్రభావటి

షాజిహాపూరులో యిది తయారు చేయబడుచున్నది. ఇది విరేచన సాధకౌషధము. ఇది యెనిమిది విధములగు ఉదర జాడ్య

ములను, గుల్మమును, ప్లీహమును పోగొట్ట గలదని పేటెంటు కర్త ప్రకటించి యుండెను. 32 మాత్రలు గల డబ్బీ వెల 8 అణాలు.

యవలచూర్ణము, బొమ్మజెముడు పాలు, శుద్ధి చేయబడిన నేపాళములు, యివి ఒక్కొక్క భాగము, నల్లమిరియాలు 2 భాగములు, వీటిని నూరి 3 గురిగింజల ప్రమాణముండునట్లు మాత్రలను చేయుము. డోసు 1 మాత్ర, చక్కెరతో పుచ్చుకొనినచో విరేచనము లగును.

## 209 అశ్మరీ ఔషధ్

ఇది బెనారస్‌లోని సన్యాసీ అండ్ కంపెనీలో తయారు చేయబడుచున్నది. ఇది బాబాజీచే తయారు చేయబడుచున్న అమోఘమగు మందని ప్రసిద్ధి కలదు. బాబాజీగారు 40 మాత్రలకు 6 రూపాయిలు మాత్రమే పుచ్చుకొనుచున్నారు. మందు గుణము కలదే. ఈ బాబాజీగారి చర్మరోగపు మందు చాల విఖ్యాతి నొందియున్నవి, దానితోపాటు యిదిగూడ ప్రసిద్ధిగా విక్రయింప బడుచున్నది.

కందిరీగచూర్ణము (C ntharidin Pure P wder) 1 భాగము, బెల్లము 6 భాగములు. రెంటినీ కలిపి నూరి అర్ధమాష ప్రమాణముండునట్లు మాత్రలను చేయుము. డోసు - 1 మాత్ర ప్రతిదినము దీనిని ఉలవ కషాయముతో పుచ్చుకొనవలెను. పెసరపప్పు అన్నము భుజింపవలెను. దీనిచే అశ్మరి, చక్కెర. (మూత్రముతో సుగరు వెడలుట) తగ్గిపోగలవు.

## 210 చర్మరోగహర మలహము

ఇది గూడ పై కంపెనీలోనే తయారు చేయబడుచున్నది. ఒక్క డబ్బీ ఖరీదు 3 అణాలు. యిది ప్రతిదినము కొన్ని వందల డబ్బీలు ఖర్చు అగుచున్నవి.

పొంగింపబడిన మైలుతుత్తము 1 భాగము, అమరశిల గంధకము 1 భాగము, పాదరసము 1 భాగము, ముర్దారుసింగు 1 భాగము, మైనము 3 భాగములు, నువ్వులనూనె 5 భాగములు, నల్ల మిరియాలు 1 భాగము, తైలమును, మైనమును వదలి మిగిలిన వాటిని ముందుగా చూర్ణ మొనర్చి పిమ్మట వాటిని కలిపి చక్కగా నూరి ముప్పావు తులము మందును డబ్బీలలో నుంచుము. దీనిని కొద్దిగా గజ్జి, తీట, మురద, తామర, మొదలైన వాటిపై రుద్ద వలయును.

## 211 గంగాధర వటిక

లాహోరులో యిది పేటెంటు చేయబడినది. 40 మాత్రలు గల డబ్బీ ఖరీదు 1-8-0 ఇది జిగట విరేచనములను, నీళ్ళవిరేచనములను కట్టించుటకు పనికివచ్చు.

యింగిలీకము 6 భాగములు రుమీమస్తగీ 6 భాగములు, నల్లమందు 6 భాగములు, వీటిని బేహిపండ్ల జిగురుతో నూరి ఒక్క గురిగింజ ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. డోసు - 1 మాత్ర. బియ్యపు కడుగునీటితో పుచ్చుకొనవలెను. విరేచనములు ఆగిపోగలవు.

## 212 అశ్మరీ ఆయింటుమెంటు

దీని ప్రకటన తరుచు సమాచార పత్రములలో ప్రకటింపబడుచుండును. "ఆరోగ్యము కలిగిన పిమ్మట బహుమానము గూడ యీయవలెను." అని పేటెంటుకర్త ప్రకటించుచుండును. దీనిని మొలలపై వ్రాసినచో మొలల పిలకలు యెండి ఊడిపోగలవు. ఒక్క డబ్బీ ఖరీదు 2 రూపాయలు.

యాసిడ్ టానిక్ 10 గ్రెయినులు, బిస్మత్ సబ్ నయిట్రస్ 20 గ్రెయినులు, కార్బాలిక్ యాసిడ్ 10 గ్రెయినులు, నల్లమందు

1 మాషము, వ్యాసులైను 1 ఔన్సు, వీటిని చక్కగా కలియునట్లు చేసి సీసాలో నుంచుము.

## 213 గనేరియా కిలర్

బొంబాయిలో దీనికి చక్కని ప్రచారము కలదు. 40 కాప్సుల్సు ఖరీదు 2 రూపాయిలు, దీనిచే గనేరియా తగ్గిపోగలదు. మందు ఉపయోగ కరమైనదే.

బెంజాయిక్ యాసిడ్ 1 భాగము, మైలతుత్తపు భస్మము (కర్పూరము చేయబడినది) 4 భాగములు, వీటినిచందన తైలముతో చక్కగా మలాముచలె నూరి 1 నుండి 2 గ్రెయినుల ప్రమాణము వరకు కాప్సుల్సులో నుంచి వాటిని మూసివేయుము. డోసు - ఒక్క కాప్సుల్ను ఉదయము ఒక్క తులము ప్రమాణముగల మీగడతో పుచ్చుకొనవలెను. పాలు అన్నము తినవలెను. గనేరియా తగ్గిపో గలదు.

N B. రెండు తులముల దేశీయ కర్పూరపు మధ్య ఒక్క మాష ప్రమాణము మైలతుత్తమునుంచి శరావసంపుట మొనర్చి ఒక్కజాము నిప్పుపై నుంచినచో మైలతుత్తము భస్మము కాగలదు.

## 214 కామ సంజీవన్ చూర్ణము

దీని విషయమై కలకత్తా ప్రాంతపు పత్రికలలో అత్యధికముగా ప్రకటింపబడుచున్నది. 10 తులముల మందు గల డబ్బీ ఖరీదు 1-8-0. ఇది పూర్తిగా ప్రమేహమును. ధాతు వికారములను, నశింపజేసి వీర్యమును వృద్ధి జేయ గలదని ప్రకటింపబడియున్నది.

జాపత్రి 2 భాగములు, జాజికాయ 2 భాగములు, ఖురాసాని వాము అరభాగము, కుంకుమపువ్వు 1 భాగము, చక్కెర 10 భాగ

ములు. మొత్తమును చక్కగా చూర్ణ మొనర్పుము. డోసు - 3 మాషముల ప్రమాణము, పాలతో పుచ్చుకొన వలెను.

## 215 వాతనాశక తైలము

బొంబాయిలో దీనికి చక్కని ప్రచారము కలదు. 2½ తులముల ప్రమాణము గల సీసా ఖరీదు 1 రూపాయి. దీనిని వ్రాసినచో వాత బాధలన్నియు తగ్గిపోగలవు.

శంఖ పాషాణము 4 తులములు, నెయ్యి 5 శేర్లు. రెంటినీ కలిపి పాషాణము పూర్తిగా అగుపడకుండా కాలిపోవునంత వరకు కాచి దించి వడపోయుము. చూడుడు! మందు తయారైనది దీనిని బాధ గలచోట రుద్ద వలయును.

## 216 యెనోడైన్ (Anodyne)

కాన్‌పూర్‌లో పేటెంటు చేయబడినది. ఒక్క ఔన్సు సీసా ఖరీదు 8 అణాలు. ఇది వివిధములగు నొప్పులను తగ్గించ గలదని ప్రకటింపబడియున్నది.

అమిల్ హైడ్రేట్ 1 భాగము, యెకోనైటిన్ 450 వ భాగము, విరేటిన్ 80 వభాగము, కొలోడియన్ 2 భాగములు, మొత్తమును కలుపుము. నడుమునొప్పులు, తలనొప్పులు, సంధి బాధలు, మొదలగు కఠినములగు నొప్పులన్నియును దీనిని ఉపయోగించినచో తగ్గిపోగలవు.

## 217 న్యురేలేజిక్ పెయిన్ క్యూర్

ఇది కాన్పూరులో పేటెంటు చేయబడినది. 2 ఔన్సుల పరిమాణము గల సీసా ఖరీదు 12 అణాలు. దీనిని వ్రాసినచో నొప్పులు తగ్గిపోగలవు.

నువ్వులనూనె 2 ఔన్సులు, కర్పూరము 1 డ్రాము, లెడనమ్ అర డ్రాము. వీటిని కలిపి నూరి సీసాలో నుంచుము. దీనిని వాత నొప్పులపై నెమ్మది నెమ్మదిగా రుద్దవలయును. బాధను యిది తగ్గించివేయ గలదు.

## 218 అపస్మార ఔషధ్

ఇది "మృగికీ దవా" అను పేరుతో హోబడాలో పేటెంటు చేయ బడినది. ఒక్క మాసమునకు సరిపోవు మందు గల సీసా ఖరీదు 5 రూపాయిలు. మూడు మాసములు విడువక దీనిని సేవించినచో హిస్టీరియా తప్పక తగ్గిపోగలదనియు లేనిచో కిమ్మత్తుకు రెట్టింపు డబ్బు యివ్వగలననియు పేటెంటుకర్త ప్రకటించియుండెను. మందు గుణము కలదే! అయినను ఒక్కమాఱుగా పేటెంటు కర్త ప్రకటించినట్లు పనిచేయలేదు.

అమోనియా బ్రోమయిడ్ 4 భాగములు, పొటాస్ బ్రోమయిడ్ 8 భాగములు, సిరప్ హైపో ఫాస్ఫేట్ 2+ భాగములు, సిరప్ టోలూ 8 భాగములు. లయికర్ పొటాస్ అర్సేనయిట్ 1 భాగము. ఆక్వా మేంథా పిప్పరమెంటు 12 భాగములు. మొత్తమును కలుపుము. డోసు– ఒక్క టీ చంచా ప్రమాణము. ఒక్క ఔన్సు నీటితో కలుపుకొని పుచ్చుకొన వలెను. దినమునకు 3 మారులు. పుష్టికరమగు ఆహారమును పుచ్చుకొనుచుండ వలెను.

## 219 హిస్టీరియా క్యూర్

ఇది గూడ పైచోటనే పేటెంటు చేయబడినది. 2 ఔన్సుల సీసా ఖరీదు 2 రూపాయిలు. మందు గుణయుక్తమైనదే!

అమోనియా బ్రోమయిడ్ 1 భాగము. సోడా బ్రోమయిడ్ 1 భాగము, పొటాస్ బ్రోమయిడ్ 1 భాగము, టించర్ జెన్షన్

కాంపౌండు 4 భాగములు. వీటిని మొత్తము కలుపుము. కరిగి నీరు కాగలదు. డోసు - ఒక్క టీ చంచా ప్రమాణము. దినమునకు 3 పర్యాయములు నీటితో కలిపి పుచ్చుకొనవలెను. పుష్టి కరమగు ఆహారమును పుచ్చుకొను చుండవలెను. హిస్టీరియా కొద్దిదినములలో తగ్గిపోగలదు.

## 220 రక్త రోధక ద్రవము

దీనిని యిటావాప్రాంతములోని గ్రామీణవైద్యులు పేటంటు మందుగా ఉపయోగించుచున్నారు. మందు రక్త మును ఆపివేయ గలదు.

టించర్ అర్గట్ 4 భాగములు, టించర్ డిజిటాలిస్ 1 భాగము, యాసిడ్ గాలిక్ 1 భాగము, యాడిడ్ సల్ఫ్యూరిక్ డయిల్యూట్ 2భాగములు. మొత్తమును కలుపుము. డోసు ½ డ్రాము. ఒక్క ఔన్సు నీటిలో కలిసి పుచ్చుకొనవలెను. రక్తము యెచ్చట నుండి వెలువడు చున్నను వెంటనే ఆపివేయగలను,

## 221 యాంటీ నర్వీన్ (Anti nervin)

ఢిల్లీలోయిది పేటెంటు చేయబడినది. అర ఔన్సుసీసా ఖరీదు ఒక్కరూపాయి. ఇది వివిధములగు నొప్పులను పోగొట్టకలదని ప్రకటింపబడియున్నది.

సాలిసైలిక్ యాసిడ్, పొటాస్ బ్రోమయిడ్, యాంటీ ఫేబరిన్, వీటి సమానభాగములను చక్కగా కలిపి సీసాలో నుంచుము. దీనిచే వివిధములగు నొప్పులు, యెచ్చటనున్నవైనను, యెంతటి తీక్ష్ణ దశలో నున్నవైనను వెంటనే తగ్గిపోగలవు,

## 222 కర్ణ శూల హర తైలము

ఇది బలియా నివాసియగు ఒక డాక్టరుచే పేటెంటు చేయ బడినది. దీనిని కొంచెము వేడిచేసి చెవిలో వేసినచో వెంటనే నొప్పి తగ్గిపోగలదు. అర ఔన్సు సీసా ఖరీదు 4 అణాలు.

కర్పూరము 1 భాగము, క్లోరెల్ హైడ్రేట్ 1 భాగము నువ్వులనూనె 2 భాగములు, మొత్తమును కలుపుము. డోసు - 3. 4, చుక్కలు. చెవిలో వేసినచో నొప్పి తగ్గిపోగలదు.

## 223 పయిల్స్ క్యూర్

ఇది బొంబాయిలోని ఒక యూనానీ చికిత్సకునిచే పేటెంటు చేయబడినది. 100 మాత్రలు గల సీసా ఖరీదు 3 రూపాయిలు. "దీనిని కొలది దినములు పుచ్చుకొనినచో మొలలు యెటువంటి వైనను నిశ్శేషముగా తగ్గిపోగలవు" అని పేటెంటు కర్త ప్రకటించి యుండెను.

రసాంజనము 6 భాగములు, ముసాంబరము 6 భాగములు వేపవిత్తులు 6 భాగములు, కరివేపవిత్తులలోని పప్పు 6 భాగములు, కరక్కాయ 6 భాగములు, నల్లకరక్కాయ 6 భాగములు, అడవిపుల వలు 6 భాగములు, గుగ్గిలము 6 భాగములు, బొప్పాయి 12 భాగ ములు. మొత్తమును చక్కగా చూర్ణ మొనర్చి దీనిని ముల్లంగి రస ముతో 3 గురిగింజల ప్రమాణముండునట్లు మాత్రలను చేసి నీడన యెండించుము. డోసు- 1 మాత్ర ఉదయము, 1 మాత్ర సాయం త్రము, చలినీటితో పుచ్చుకొన వలెను. తేలికగా అరుగు ఆహార మును పుచ్చుకొన వలెను.

## 224 పయిల్స్ ఆయింటుమెంటు

పై మందును లోపలికి పుచ్చుకొనుచూ పైకి వ్రాయుటకై యిది తయారుచేయ బడినది. ఒక్క డబ్బీ ఖరీదు 1 రూపాయి.

మాజుఫలము 6 భాగములు, తెల్లకాచు 6 భాగములు, పొంగింపబడిన పటికి 6 భాగములు, నల్లమందు 6 భాగములు. మైల తుత్తము 1 భాగము, వీటిని చక్కగానూరి 2½ తులముల ప్రమాణము గల ఆవు వెన్నతో బాగుగా కలిపి ఆయింటుమెంటును తయారు చేయుము దీనిని ప్రతిదినము రెండు మూడు పర్యాయములు మొలలపై వ్రాయుచుండ వలెను

## 225 Elephantiasis

ఇది గుద భ్రంశములపై పనిచేయగల మందు. 4 ఔన్సుల ప్రమాణముగల మందు సీసా ఖరీదు 2 రూపాయిలు. లాహోరులో యిది పేటెంటు చేయబడినది. దీనిని గుద్దినచో మహాభయంకరములగు గుదభ్రంశములు కూడ తగ్గిపోగలవని ప్రకటింప బడియున్నది. కాని నూతనముగా వచ్చిన వాటిపై మటుకు చక్కగా పనిచేయగలదు. వ్యాధి పురాతనమైనచో తరచుగా పనిచేయలేదు.

గులాబి ఆయిలు 16 తులములు, స్వదేశీ కర్పూరము 4 తులములు. వీటిరెంటిని చక్కగా కలియునట్లునూరి సీసాలోనుంచుము. దీనిని దినమునకు 3 పర్యాయములు పైన వ్రాయవలయును.

## 226 తి ల

ఇది మధురలో పేటెంటు చేయబడినది. ఇది లోపలికి పుచ్చుకొనుటకు పైకి వ్రాయుటకు పనికివచ్చు వాజీకరణౌషధము. దీనిచే బలవీర్యములు, వాజీకరణశక్తి వృద్ధినొంద గలవు.

ఆవునెయ్యి 5 భాగములు, శంఖ పాషాణము 2 భాగములు, రెంటినీ కలిపి మూడు దినములు మర్దించి పింగాణీ పళ్లెములో నుంచి యెండలో నుంచుము. కరిగి తైలమువలె కాగానే తీసి దానిని తేరుకొనునట్లు చేసి అందు ఆరుద్ర పురుగులు 1½ భాగము, జాజికాయ 1½ భాగము, అక్కలకర్ర 1½ భాగము, కుంకుమపువ్వు 1½ భాగము,

లవంగములు 1/12 భాగము, కలిపి చక్కగామర్దించి సీసాలోనుంచుము. ఇది ఒక్క గురిగింజ ప్రమాణము లోపలికి పుచ్చుకొనుటకును, 2 గురిగింజల ప్రమాణము పైకి వ్రాయుటకును పనికివచ్చును.

## 227 మలేరియా వటి

100 మాత్రలు గల డబ్బీ ఖరీదు 1 రూపాయి. విలాస పూరులో యిది పేటెంటు చేయబడినది. వివిధ జ్వరములపై యిది పనిచేయ గలదు.

కాసీసము 1 భాగము, ముసాంబరము 1 భాగము, శంఖ పాషాణము 1/64 భాగము, వీటిని వెల్లుల్లి రసముతో నూరి రెండు గురిగింజల ప్రమాణముండునట్లు మాత్రలను చేయుము. ఒక్క మాత్రను ఉదయము, మరొక్కమాత్రను సాయంత్రము నీటితో పుచ్చుకొనవలెను. పాలు అన్నము పెట్టవలెను.

## 228 నపుంసకత్వమునకు గ్యారంటీ మందు

ఇది డాక్టర్ అబ్దుల్ హక్ సాహేబుచే తయారు చేయబడి చాల ప్రసిద్ధినొందియున్నది. దీనిచే వారు చాలా మందికి చికిత్స చేయుచున్నారు. మందు గుణము కలిగినది.

10 తులముల నాభిని నిమ్మరసముతో నూరి 7 తులముల శంఖపాషాణపు ముక్కకు కవచమిచ్చి యెండబెట్టి, తీసి. దీనికి ఉలవ పిండితో తిరిగి కవచ మిమ్ము. ఒక కళాయిలో 5 శేర్ల (80 తులముల శేరు) ఆముదమును పోసి అందు దీని నుంచి దీపాగ్నితో 8 జాముల వరకు కాచుము. ముద్దకాలి మధ్యనుంచిన ముక్క స్థిరత్వము నొందగలదు. యిటులకానిచో తిరిగి యిదే విధముగా చేయుము. యిది చాల అత్యుత్తమమైన మందు, దీనిని తీసి చూర్ణ మొనర్చుము. డోసు - గసగసాలగింజ ప్రమాణము. దీనిని 2, 3, వారములు పుచ్చుకొనినచో, రోగి యెంతటి కఠిన పరిస్థితిలో నున్నను వెంటనే సుగుణమును పొందగలడు.

## 229 యింగిలీక భస్మము

రావల్ పిండి వాస్తవ్యులు బీహారీలాలు దీనిని తయారు చేయుచూ అమితముగా ధనమును సంపాదించుచున్నారు. ఇది నపుంసకత్వమునకు చక్కని మందు.

నల్లనువ్వులు, మాల్ కింకిణీ గింజలు, జీడిగింజలు, తేనె, ఆవు నెయ్యి. ఇవి ఒక్కొక్కటి 20 తులములు. ముందు మొదటి మూడు వస్తువులను బాగుగా దంచి అందు తేనె, నెయ్యి, కలిపి ముద్దజేసి దానిమధ్య 5 తులముల యింగిలీకపు ముక్కనుంచి ఆ ముద్దను ఒక యినుప భాండీలోనుంచి క్రింద మంటపెట్టుము. మంట భాండీలో ప్రవేశించగనే క్రింది మంటను తీసివేయుము. భాండీలోని మంట అదంతట అదే చల్లారునంత వరకు వుంచి దించుము. పిమ్మట అందలి యింగిలీకపు ముద్దను తీసి చూర్ణ మొనర్చుము. డోసు- 1 వడ్లగింజ ప్రమాణ ము. వాజీకరణమునకు చాల అత్యుత్తమమైనది. నపుంసకునకు గూడ పుంస్త్వము సిద్ధించగలదు.

## 230 నపుంసకత్వమునకు ఫకీరు చిటిక

1904 సంవత్సరపు ప్రాంతములో హరిద్వారము వద్ద ఒక ఫకీ రుండెడి వాడు అతడు సుప్రసిద్ధుడగు నపుంసకత్వ చికిత్సకుడని అతనిని అనేకమంది చుట్టుముట్టు యుండెడివారు. అతడు తనవద్దకు వచ్చిన వారికి కొన్ని మాత్రలను యిచ్చి రెండు మాసములలో చక్కని ఆరోగ్యము, సుగుణము, కలుగ గలదని చెప్పుచుండెడివాడు. దీనిని పృథక్కరణ మొనర్చిన పిమ్మట మందు సాధారణమైనదే నని తేలినది.

స్వచ్ఛమగు యింగువను 3 గురిగింజల ప్రమాణ ముండునట్లు మాత్రలను చేసి పైన బెల్లముతో కవచమిమ్ము. బస్. మందు తయారు కాగలదు. మందు పనిచేయగలదు. శక్తిలేనివారు, ధన హీనులు, దీనిని వాడుకొని లాభము పొందవచ్చును.

## 231 నేత్ర ద్రవము

కలకత్తాలో యిది పేటెంటు చేయబడినది. ఒక్క ఔన్సు సీసా ఖరీదు 4 అణాలు. దీనిచే కండ్ల యెఱుపులు, నొప్పులు, కలకలు, తగ్గిపోగలవు.

జింక్ సల్ఫేట్ 2 గురిగింజల ప్రమాణము, నల్లమందు 2 గురిగింజల ప్రమాణము, యాసిడ్ బోరిక్ 3 గురిగింజల ప్రమాణము, డిస్టిల్డ్ వాటరు ఒక్క ఔన్సు. మొత్తమును కలుపుము. దీనిని కంటిలో వేయవలెను.

## 232 కుముదాసవ

కలకత్తాలో యిది పేటెంటు చేయబడినది, 2 ఔన్సుల సీసా ఖరీదు 8 అణాలు. దీనిచే మూర్ఛ, అపస్మారము, పిచ్చి, తగ్గిపోగలవని పేటెంటుకర్త ప్రకటించి యున్నాడు.

వాడిపోని తెల్లకలువపూల రసము 1 (ఫిల్టరు చేయబడినది) 1½ ఔన్సులు, పొటాస్ బ్రోమయిడ్ ½ ఔన్సు. రెంటినీ కలిపి సీసాలోనుంచుము. డోసు – 1 డ్రాము. నీటితో కలిపి పుచ్చుకొనవలెను.

## 233 రతి వల్లభ రసాయనము

కలకత్తాలోనే యిది గూడ పేటెంటు చేయబడినది. ఒక్క సీసా ఖరీదు 1-8-0. దీనిని పుచ్చుకొనినచో బలవీర్యములు వృద్ధి నొంద గలవని ప్రకటింప బడియున్నది.

ద్రాక్ష రసము 10 భాగములు, యెక్స్ట్రాక్ట్ డామియానా ½ భాగము, టించరు నక్సువామిక ¼ భాగము. మొత్తమును కలుపుము. డోసు – 1 డ్రాము ప్రమాణము. నీటితో కలిపి పుచ్చుకొనవలెను.

## 234 సరల బేది వటిక

ఇది గూడ పై చోటనే తయారు చేయబడుచున్నది. 30 మాత్రల ఖరీదు 8 అణాలు. తేలికగా విరేచనములు కాగలవు. సక్ మూనియా (Scammony) 1 భాగము, జాలప్ 1 భాగము, ముసాంబరము, రేవల్చిన్ని సత్వము, రుమీమస్తగీ, యివిఒక్కొక్క భాగము శొంఠి ½ భాగము, బోళము (Myrrha) ½ భాగము. వీటిని మెత్తగా చూర్ణ మొనర్చి నీటితో నూరి 2 గింజలప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. డోసు - 1 మాత్ర. దీనిని పుచ్చుకొనినచో సాఫీగా విరేచనములు కాగలవు.

## 235 యాంటీ యిన్ ఫ్లూయింజా

ఇది గూడ పై చోటనేపేటెంటు చేయబడినది. సంక్రామిక జ్వరములపై గ్యారంటీగా పనిచేయ గలదు. ఈ మందు నాల్గు రకములుగా తయారు చేయబడు చున్నది. ఖరీదు 2-8-0. కాని నా వద్దకు బిళ్లల రూపముగా నున్న మందు మాత్రమే చేరినది. దానినే యిచ్చుట పృథక్కరణ మొనర్చి ప్రకటించు చున్నాను. మందు ఉపయోగకరమైనది.

ఇంగువ, కర్పూరము, నవాసాగరము. యవాక్షారము. వీటిని నూరి మిరపనుమీాద 8 గ్రెయినుల ప్రమాణ ముండునట్లు బిళ్ళలను చేయింపుము. డోసు 1 బిళ్ళ. వేడినీటితో పుచ్చుకొనవలెను.

## 236 శ్వాసాసవ

పై చోటనే యిదిగూడ పేటెంటు చేయబడినది. ఇది శ్వాసకు అమోఘమగు మందని పేటెంటుకర్త ప్రకటించియున్నాడు. కాని మిక్కిలిగా నున్న శ్వాసను తగ్గించి రోగికి విశ్రాంతిని మటుకు యీయగలదు.

వాసారిష్ట 10 భాగములు, పొటాస్ బ్రొమయిడ్ ½ భాగము పొటాస్ అయోడయిడ్ ½ భాగము, వయినమ్ యిపికాకుయేనా 1 భాగము, లయికర్ ఆదర్శనిక్ ½ భాగము. మొత్తమును కలుపుము, డోసు - 1 డ్రాము నీటితో కలిపి పుచ్చుకొనవలెను.

## 237 సప్తతిక్త

ఇది జన్ స్టన్ గంజ్ బొంశాయిలో పేటెంటు చేయబడినది సర్వవిధ జ్వరములపై యిది అత్యద్భుతముగా పనిచేయ గలదని తలంచబడు చున్నది. కాని మలేరియా జ్వరముపై మటుకు యిది విశేషముగా పనిచేయగలదు

సప్తపర్ణ అడ్డసరము, నేలవేము, వాకుడు, తిప్పతీగ కాలమేఘము వేపచెక్క వీటి సమాన భాగములను తీసికొని క్వాథముగా తయారు చేయుము. వడకట్టబడిన యీక్వాథము 50 భాగములను సీసాలోపోసి అందు ¼ భాగము క్వినైను ⅛ భాగము లయికర్ ఆర్శనిక్ కలుపుము. డోసు - 1 తులము. ప్రమాణము. నీటితో కలుపుకొని పుచ్చుకొనవలెను.

## 238 అమృతార్క మధు

బెల్‌గావు నుండి ద్రాక్షార్క మను వెలువడు చున్నది. దానికి నకలుగా యిది జల్‌గావులోని ఒక వైద్యునిచే తయారు చేయబడునున్నది. 2 ఔన్సుల ప్రమాణముగల సీసా ఖరీదు 1 రూపాయి. దీనిచే ధాతువికారములు తగ్గి శక్తి వృద్ధినొంద గలదని ప్రకటింపబడియున్నది.

ద్రాక్షరసము 8 భాగములు, తేనె 2 భాగములు, రెంటినీ కలిపి ఒక సీసాలో నుంచుము డోసు 1 డ్రాము ప్రమాణము. నీటితో కలిపి పుచ్చుకొన వలెను. దీనిచే సాఫీగా విరేచనమై రక్తము శక్తి వృద్ధి నొందగలవు. ప్రమేహము తగ్గిపోగలదు.

## 239 రాజ వంశ ప్రమేహ హరణ్

ఇదిగూడ జల్‌గావ్‌లో పేటెంటు చేయబడినది. 4 మాత్రలు గల సీసా ఖరీదు 2 రూపాయలు. దీనిచే ప్రమేహము నశించి పోగలదని ప్రకటింపబడి యున్నది. ప్రకటనాను సారము మందు పనిచేయ గలదు.

చింతవిత్తులలోనిపప్పు 5 భాగములు, వటపత్రసత్వము, బహుఫలీ (నక్కనారాయణ చెట్టు), రెండు 5 భాగములు, బూరుగు బంక 5 భాగములు, త్రినంగ భస్మము 3 భాగములు వీటినన్నింటినీ మర్రి పాలతో ఒక్క వారము దినముల వరకు మర్దించి ½ మాషప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. ఉదయము సాయంత్రము ఒక్కొక్క మాత్రను పుచ్చుకొని అర్థ శేరు పాలను పుచ్చుకొను చుండవలెను. ప్రమేహముల కిది ఉపయోగకర మైనది.

## 240 కామసుందరీ వటి

దీని ప్రకటన ప్రతి స్టేషనులోను ప్రకటింపబడు చుండును. "నేను వైద్యుడను గాను. నేనొకప్పుడు రోగిగా మరణించుటకు సిద్ధముగా నున్నప్పుడు, ఒక బాబాజీ నాస్థితినిజూచి నాకీ మందును ఉపదేశించెను. దీనిచే నేను పూర్తిగా ఆరోగ్యవంతుడ నైతిని. అదియే యీ మందు". ఇదియే పేటెంటు కర్త ప్రకటనలోని సారాంశము, యిటుల ప్రకటనలు చేయు వ్యక్తులు, యిటావా, అలీగఢ్, ఉన్నావ జల్లాలలో అత్యధికముగా కానుపించు చుందురు. యిది ఒక యిటావా మహాశయుని పేటెంటు మందు.

పల్లేరు, నేలతాడి, తుమ్మకాయలు, అశ్వగంధ. వీటి సమాన భాగములను చూర్ణ మొనర్చి కలబంద రసముతో బాగుగా నూరి 3 గురిగింజల ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. యిదే బాబాజీచే యీయబడిన దివ్యౌషధము ఉదయము సాయంత్రము ఒక్కొక్క మాత్రను పాలతో పుచ్చుకొనవలెను.

## 241 ఉన్నావజిల్లా మహాశయుని మందు

ఇది గూడ బాశాజీచే యీాయబడు దివ్యౌషధమే! ఖరీదు 2 రూపాయిలు. మందు చూర్ణరూపముగా నుండును.

తుమ్మకాయలు, బూరుగ వేరు, చింతవిత్తులు, సాలామిశ్రి, తెల్లనేలతాడి, కొడిశపాలు, సన్నరాస్నము, తుమ్మబంక. వీటి సమాన భాగములను చూర్ణించి 20 తులముల ప్రమాణము ఒక డబ్బీలో నుంచుము. డోసు - 6 మాషముల ప్రమాణము. ఉదయము సాయంత్రము పాలతో పుచ్చుకొనవలెను.

## 242 ధాతు వర్ధన

ఇది "ధాతు పుష్టి కీ దవా" అను పేరుతో శాందాలో పేటెంటు చేయబడునది. 20 తులముల మందుగల డబ్బీ ఖరీదు 1 రూపాయి. దీనిని గాడినచో ప్రమేహము తగ్గి ధాతుశక్తి వృద్ధి నొందగలదు.

తుమ్మ జిగురును ఒక కళాయిలో వేసి అంతుకొద్దిగా నెయ్యి వేసి నిప్పుపైనుంచి చక్కగా వేగువరకు వుంచి దించి చూర్ణము చేయుము. దీనికి సమాన భాగము చక్కెరను కలిపి డబ్బాలో నుంచుము, డోసు—6 మాషములు ఉదయము. 6 మాషములు సాయంత్రము ఒక్క పావుశేరు పాలతో పుచ్చుకొన వలెను.

## 243 కామాత్తేజ వటి

ఇది మీారట్‌లో పేటెంటు చేయబడినది. 60 మాత్రల వెల 5 రూపాయిలు. మందు చక్కని గుణము కల్గిన దగుటచే ప్రతి మాసము యిది అత్యధికముగా విక్రయించ బడుచున్నది.

నల్లమందు 2 భాగములు, యింగిలీకము 1 భాగము, పాషాణము 1 భాగము, కుంకుమపువ్వు 2 భాగములు. కస్తూరి 2 భాగములు

ముత్యములు 4 భాగములు, గంజాయి ఆకులమీద పేరుకున్న మంచు 2 భాగములు, అక్కలకర్ర 6 భాగములు, విషముష్టి 4 భాగములు. జాజికాయ 3 భాగములు, జాపత్రి 3 భాగములు, ఆరుద్రపురుగులు 3 భాగములు, యర్రలు 9 భాగములు, వీటిని మొత్తము చూర్ణ మొనర్చి కోడిగ్రుడ్డులో నుండు పచ్చని సొనచో 10 దినములు నూరి 2 గురిగింజల ప్రమాణముండునట్లు మాత్రలను చేయుము. డోసు – 1 మాత్ర. దీనిని పుచ్చుకొను కాలములో పుష్టికరమగు ఆహార మును భుజింప వలెను.

## 244 బాలామృత వటి

ఇది పూనాలో పేటెంటు చేయబడినది. 100 మాత్రలు గల సీసా ఖరీదు 6 అణాలు. యిది బాలుర సమస్త జాడ్యములను పోగొట్ట కదలని ప్రకటింప బడియున్నది. మందు గుణము కలిగినదే. పిల్లల యెండు రోగముపై యిది విశేషముగా పనిచేయ గలదు.

సహదేవి వేరు చూర్ణము, ఉత్తరేణివేరు చూర్ణము, యివి సమాన భాగములు, నల్లమిరియాలు $\frac{1}{2 \cdot 16}$ భాగము, మొత్తమును చక్కగానూరి పెసరగింజప్రమాణముండునట్లు మాత్రలనుచేయుము. డోసు – 1 మాత్ర. ఉదయము సాయంత్రము యీయవలెను.

## 245 అరోంవా సెంగిం తైలము

ఇది బొంబాయిలో చాలా ప్రసిద్ధినొంది యున్నది. ఔన్సు సీసా ఖరీదు 4 అణాలు. దీనిచే చర్మరోగములు, విషకీటకముల బాధలు, దగ్గు, శ్వాస. జలుబు, మొదలగునవి తగ్గి పోగలవనియు, మొలలవ్యాధి నశించగలదనియు ప్రకటింప బడియున్నది.

యూకలిప్టస్ ఆయిల్ (Eucalyptus Oil) 1 ఔన్సును ఒక్క సీసాలోనుంచి అందు అరడ్రాము కార్బాలిక్ యాసిడ్ను కలుపుము. మందు తయారు కాగలదు. దీనిని సమయానుకూలముగా స్వేచ్ఛాను సారము ఉపయోగింప వచ్చును.

## 246 చెవుడు

బొంబాయిలో పేటెంటు చేయబడినది. చెవుడును పోగొట్టుట కిది అమోఘమగు మందని తలంచబడుచున్నది. ఖరీదు 5 రూపాయిలు. "చెవుడు యెంత పురాతనమైన దైనను చాల త్వరగా దీనితో తగ్గిపోగలదు" అని పేటెంటుకర్త ప్రకటించి యుండెను.

బాదము ఆయిలు 8 భాగములు, యూకలిప్టస్ ఆయిలు 3 భాగములు, రెంటెనికలిపి సీసాలో నుంచుము. దీనిని చెవిలో వేయు చుండవలెను. మందు ఉపయోగకరమైనదే.

## 247 అద్వితీయ మంజన్

ఇది లక్నోలో పేటెంటు చేయబడినది. ఒక్క సీసా ఖరీదు 8 అణాలు. సంపూర్ణముగా దంతజాడ్యము లన్నింటిని యిది పోగొట్ట కలదని ప్రకటింప బడియున్నది.

పొంగింపబడిన వెలిగారము 1 భాగము, సుద్ద 1 భాగము. యాసిడ్ కార్బాలిక్ $\frac{1}{10}$ భాగము. మొత్తమును కలిపి నూరుము. సుగంధము కొరకు యిందు రోజు సెంటును కలుపుము. దీనిని ప్రతి దినము పండ్లు తోముకొనుటకై ఉపయోగించుకొన వలెను.

## 248 శ్వేత కుష్ఠ

ఇది వాంచబోటు, బెంగాలులో పేటెంటు చేయబడినది. యేడుదినములకు సరిపోవు మందు ఖరీదు 2-8-0.

హరతాళము $\frac{1}{4}$ భాగము, చిత్రమూలము 1 భాగము, బావంచాలు 2 భాగములు, మానవాస్థి భస్మము 1 భాగము, మొత్తమును గోమూత్రముతో నూరి మాత్రలను చేయుము. గోమూత్రముతో నూరి వీటిని మచ్చలపై వ్రాయవలెను. పుండ్లుపడి క్రమముగా మచ్చలు మాసిపోగలవు.

## 249 అక్సీర్ వాజీకర్ణ

ఇది శ్యాలకోటలోని ఒక వైద్యునిచే పేటెంటు చేయబడినది. ఒక్క ఔన్సు ప్రమాణముగల సీసా ఖరీదు 3 రూపాయిలు. 15 దినములు దీనిని పుచ్చుకొనినచో నపుంసకత్వము పూర్తిగా తగ్గిపోగలదనియు 15 దినములకు మించి యిక దీనిని పుచ్చుకొననే గూడదనియు పేటెంటు కర్త ప్రకటించి యున్నాడు.

శంఖ పాషాణము 1 భాగము, కుంకుమ పువ్వు 4 భాగములు లవంగములు 4 భాగములు, యేలకగింజలు 4 భాగములు, తేనె 48 భాగములు, వీటిని చాల చక్కగా నూరుము. ప్రతిదినము ఉదయము దీనిని నేతితో హల్వావలె కలిపి పుచ్చుకొని పిమ్మట మరొక మాష ప్రమాణ ముండునట్లు గుండును పుచ్చుకొనవలెను. నేతిని పాలను యెక్కువగా ఉపయోగించు కొనవలెను.

## 250 వాజీకర్ణ వటి

దర్భాంగలో యిది పేటెంటు చేయబడినది. 40 మాత్రల వెల 5 రూపాయిలు. దీనిని పుచ్చుకొనినచో నపుంసకత్వము, వీర్యక్షీణత, వీర్యస్రావము, ప్రమేహము, తగ్గిపోగలవని పేటెంటుకర్త ప్రకటించి యున్నాడు.

వెండి భస్మము $4\frac{1}{2}$ భాగములు, జాపత్రి $1\frac{1}{2}$ భాగము, కుంకుమ పువ్వు $1\frac{1}{2}$ భాగము, రేనాడు $1\frac{1}{2}$ భాగము, జాజికాయ 9 భాగములు, హిజ్జలము 9 భాగములు, పావుదార 1 భాగము, కస్తూరి $1\frac{1}{2}$ భాగము. మొదట కుంకుమ పువ్వును, వెండి భస్మమును గులాబీ రసముతో నూరుము. మిగిలిన వాటిని చూర్ణించి వస్త్రఘాలిత మొనర్చి పై వాటితో కలిపి తమలపాకుల రసముతో నూరి శనగగింజ ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. డోసు—1 మాత్ర అవశ్యకతాను సారము పావుశేరు పాలతో పుచ్చుకొనవలెను, మందు ఉపయోగకర మైనదే.

## 251 కామ వినోద వటి

ఇది సహారాన్‌పూర్ లోని ఒక డాక్టరుచే పేటెంటు చేయబడినది. 30 మాత్రలుగల డబ్బీ ఖరీదు 1-8-0. ఇది సంపూర్ణముగా ప్రమేహమును, ధాతు వికారములను పోగొట్టి వాజీకరణశక్తి నిచ్చునని ప్రకటింపబడి యున్నది.

వంగ భస్మము 2 భాగములు. దుప్పికొమ్ము భస్మము 4 భాగములు, లవంగములు 5/12 భాగము, తెల్లకాచు 2/3 భాగము, పాదరసము 2/3 భాగము, పాషాణము 1/12 భాగము, కతీరా గోందు 1/12 భాగము, తెల్ల యాలక గింజలు 1 భాగము, తుమ్మ జిగురు 3 భాగములు. వీటి నన్నింటినీ చూర్ణమొనర్చి కోడి గ్రుడ్డు లోనుండు పచ్చని ద్రవముతో చాల మెత్తగా నుండునట్లు మర్దించి పెద్ద బటానీగింజ ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. డోసు-1 మాత్ర. ఉదయము సాయంత్రము పాలతో పుచ్చుకొనవలెను.

## 252 తాడికొండ మందు

గుంటూరు జిల్లా ప్రాంతీయులు దీనిని "తాడికొండ మందు" అని వాడుచుందురు. ఇది అచ్చటి ఆయుర్వేద వైద్యులగు టి. యస్. టి. వెంకటరామయ్య గారిచే తయారు చేయబడుచున్నది యిది వారి పూర్వీయుల రహస్య యోగమట! యిది వాతాధిక్యతచే కలుగు కడుపునొప్పికిని, శూలలకును, ఉష్ణాధిక్యతచే కలుగు శూలలకును, కడుపులో పుండని బాధపడు వారికిని ఉపయోగకర మైనది. 5 రోజులలో మందు చక్కని గుణ మీయగలదని పేటెంటు కర్త ప్రకటించియున్నాడు. పది మాత్రలుగల సీసా 10 రూపాయలట! అసలు పది పైసలకన్న యెక్కువ కాజాలదు.

గచ్చపప్పు 1 తులము, వాయు లవంగాలు 1 తులము, మిరియాలు 1 తులము, గంటు బోరంకి 1 తులము, యింగువ 1 తులము

మొదటి రెండువస్తువులను నేతితో యెఱ్ఱగా వేయించి మిగిలిన మూడు వస్తువులను అందు కలిపి నూరి రెండణాల ఎత్తు ప్రమాణముండునట్లు మాత్రలనుచేయుము. మందును పుచ్చుకొను కాలములో నెయ్యి, పుల్లిపాయ, కారము, కందిపప్పు, మజ్జిగ పుచ్చుకొనగూడదు. మందు చాలించిన వెంటనే అన్నింటిని పుచ్చుకొనవచ్చును కాఫీగాని, పాలుగాని, పాలతో వండినవిగాని సంవత్సరము వరకు తినగూడదు.

## 253 స్తంభన వటిక

ఇది ఢాకాలో పేటెంటు చేయబడినది. 16 మాత్రలు గల డబ్బీ ఖరీదు 1 రూపాయి. మందు బలవీర్యములను వృద్ధిచేసి స్తంభనమును చేయగలదని ప్రకటింపబడి యున్నది. స్తంభన గుణము మాటుకు యిందు సరిగా కలదు.

కుంకుమపుప్వు 4భాగములు, నల్లమందు 6భాగములు, రుమీమస్తగీ 6 భాగములు, శిలాజిత్తు 4 భాగములు, హిజ్జలము 6 భాగములు. నాగకేసరములు 6 భాగములు, లవంగములు 6 భాగములు, వీటిని మెత్తగా చూర్ణ మొనర్చి శనగగింజ ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము, డోసు-మాత్ర. మందును పుచ్చుకొని పాలను త్రాగవలయును.

## 254 వీర్య వినోద వటి

అలహాబాదులో యిది ప్రసిద్ధినొంది యున్నది. 60 మాత్రలు గల సీసా ఖరీదు 1-8-0. ఇది సమస్త ప్రమేహములను పోగొట్టి బల వీర్యములను వృద్ధి జేయ గలదనియు ధాతుక్షీణతచే కలిగిన సమస్త వికారములపై చక్కగా పనిచేయ గలదనియు ప్రకటింపబడి యున్నది.

శుద్ధి చేయబడిన విషముష్టి 1 భాగము, చింతవిత్తులు 3 భాగములు. రెంటినీ మెత్తగా నూరి శనగగింజ ప్రమాణముండునట్లు మాత్రలను చేయుము. ఉదయము, సాయంత్రము ఒక్కొక్క మాత్రను పాలతో పుచ్చుకొనవలెను. వీర్య స్రావము దీనిచే తగ్గిపోగలదు.

## 255 అర్క గంగోదక్

3 ఔన్సుల ప్రమాణము గల సీసా ఖరీదు 12 అణాలు. జీర్ణశక్తి లేకుండుట, సంగ్రహణి, కడుపునొప్పి, పులిత్రేన్పులు. అజీర్ణము మొదలగు వాటిపై పనిచేయగలదని ప్రకటింపబడి యున్నది. మందు ప్రకటనానుసారము పనిచేయగలదు.

నవాసాగరము 5 భాగములు, పొంగింపబడిన యింగువ $\frac{1}{2}$ భాగము, పొంగింపబడిన వెలిగారము $\frac{1}{2}$ భాగము, సూరేకారము $\frac{1}{2}$ భాగము, యవక్షారము $\frac{1}{4}$ భాగము, మిరియాలు $\frac{1}{4}$ భాగము, గంధకధృతి $\frac{1}{8}$ భాగము, అల్లపురసము 5 భాగములు, పిప్పరమెంటు $\frac{1}{12}$ భాగ , సౌవర్చలవణము 1 భాగము. సైంధవలవణము 1 భాగము, సాంభారు లవణము $\frac{3}{4}$ భాగము. లవంగములు, $\frac{1}{12}$ భాగము. వీటిని మెత్తగా నూరి సీసాలో నుంచి అందు నీరుపోయుము మొత్తము 230 తులము లుండునట్లు చూడుము. సీసాను చక్కగా కదలించి దీనిని చిన్న చిన్న సీసాలలో యిక పోయవచ్చును. డోసు - 1 డ్రాము. నీటితో కలిపి పుచ్చుకొనవలయును.

## 256 జ్వర కుఠార వటి

హోశంగాబాదులో యిది తయారు చేయబడుచున్నది. 60 మాత్రల సీసా ఖరీదు 12 అణాలు. ఇది వివిధ జ్వరములను పోగొట్ట కలదని ప్రకటింప బడియున్నది. కాని మలేరియా జ్వరములపై నుటుకు చక్కగా పనిచేయు చున్నది.

పొంగించబడిన పటికి 1 భాగము. పొంగింపబడిన వెలిగారము 1 భాగము, సైంధవలవణము 1 భాగము, ఖురాసానివాము 1 భాగము మొత్తముగు ఉమ్మెత్త ఆకుల రసముతో నూరి శనగగింజ ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. డోసు-1 మాత్ర, నీటితో పుచ్చుకొనవలెను.

## 257 క్షయాంతక

కరాచీలో యిది పేటెంటు చేయబడినది. 3 ఔన్సుల సీసా ఖరీదు 2-8-0. ఇది క్షయను, దగ్గును, దాని ఓహ్నములను పోగొట్ట కలదని ప్రకటింపబడి యున్నది. మందు ఉపయోగకరమైనదే!

సితోఫలాది చూర్ణము 6 భాగములు. గ్వాయ్‌కోల్ కార్బో నస్ అరభాగము. స్వర్ణమాక్షిక భస్మము $\frac{1}{4}$ భాగము, మొత్తమును కలుపుము. డోసు-3 మాషముల ప్రమాణము. తేనె. నెయ్యి. లేక. వెన్న. కలకండతో పుచ్చుకొనవలెను. శక్తిని వృద్ధి పరిచి క్షయను పోగొట్ట కలదు.

## 258 పక్షవాతము

ఇది "లక్ వాకీ దవా" అను పేరుతో జబ్బల్‌పూర్‌లో పేటెంటు చేయబడినది. 30 మాత్రలు గల సీసా ఖరీదు 2 రూపా యిలు. ఇది పక్షవాతములను పోగొట్ట కలదని ప్రకటింపబడియున్నది.

శంఖపాషాణము 1 భాగము, వెదురుప్పు 1 భాగము, కాచు 2 భాగములు. వీటిని అల్లపురసముతో చక్కగా నూరి గురిగింజ ప్రమాణముండునట్లు మాత్రలను చేయుము. ఒక్క మాత్రను ఉద యము. ఒక్క మాత్రను సాయంత్రము యివ్వవలెను. యేడు దిన ముల పెస్మాట చక్కెర పర్బత్తును యీయవలెను. దీనితో విరేచన ములు వమనములు కాగలవు. ఈ స్థితిలో యిచ్చు ఆహారములో

ఉప్పును యేమాత్రమును ఉపయోగింపరాదు. మందును పుచ్చుకొనుటకు పూర్వము శరీరమును పరిశుభ్ర మొనర్చుకొనవలెను.

## 259 ట్రయిఫోలియం సిరప్ కాంపౌండ్

ఇది కెంప్ కంపెనీ. బొంబాయిలో పేటెంటు చేయబడినది. ఇది రక్తశోధకమగు ఔషధము. ప్రకటనానుసారము యిది చక్కగా పనిచేయగలదు.

Tryfoliam Protense 32 గ్రయినులు, Stellingia 16 గ్రయినులు, Berberis 16 గ్రయినులు, కాక్ కేరా అమార్గా 16 గ్రయినులు, Orectim Lappa 16 గ్రయినులు, Phytolacca 16 గ్రయినులు. Potass Iodide 8 గ్రయినులు, Xanthexlum 4 గ్రయినులు. సిరప్ 1 ఔన్సు, మొత్తమును కలుపుము. డోసు- 1 డ్రాము. ఒక్క ఔన్సు నీటితో కలిపి పుచ్చుకొనవలెను.

## 260 బహు మూత్రాంతక

బొంబాయిలో యిది పేటెంటు చేయబడినది. 4 ఔన్సుల సీసా ఖరీదు 1-4-0. దీనిని పుచ్చుకొనినచో బహు మూత్రవ్యాధి తగ్గిపోగలదు.

సోడియం బెంజోయేట్ 150 గ్రయినులు, సోడియం సిల్సిలేట్ 150 గ్రయినులు. యెక్స్ట్రాక్ట్ బెల్లోనా 5 గ్రయినులు, సినామమ్ వాటర్ 4 ఔన్సులు, మొత్తమును కలుపుము. డోసు- 1 టీ చంచా ప్రమాణము. దినమునకు 3 పర్యాయములు.

## 261 రక్త శోధక్

జామ్నగర్, కథియవాడ్‌లో యిది పేటెంటు చేయబడినది. 4 ఔన్సుల ప్రమాణముగల సీసా ఖరీదు 1 రూపాయి. దీనిని పుచ్చుకొనినచో పూర్తిగా రక్త వికారములు, చర్మరోగములు, పుండ్లు,

గజ్జి, తీట, తామర, దురద, ఉపదంశము మొదలగునవి తగ్గిపోగల వని ప్రకటింప బడియున్నది.

పొటాస్ అయోడయిడ్ 2 డ్రాములు స్పిరిట్ అమోనియా ఆరంమేటిక్ 2 డ్రాములు. యెక్స్‌ట్రాక్ట్ వికేటా 4 డ్రాములు, స్వచ్ఛమగు నీరు 3 ఔన్సులు. మొత్తమును కలుపుము. డోసు–1 డ్రాము. దినమునకు 3 పర్యాయములు. నీటితో పుచ్చుకొనవలెను.

## 262 కస్తూరి కల్పము

కలకత్తాలో యిది పేటెంటు చేయబడినది 2 ఔన్సుల సీసా ఖరీదు 1 రూపాయి. ఇది ఉత్తేజకరమగుఔషధము. సన్నిపాతము, కలరా, మొదలగు తీక్ష్ణావస్థలోని రోగికి దీనిని వాడినచో రోగికి వేడికలిగి నాడి సరిగా నడువ గలదు. రోగి మృత్యుముఖమునుండి రక్షింపబ డగలడు.

మృతసంజీవినీ సురా 1½ ఔన్సులు, టించర్ మస్క్ 3 డ్రాములు, స్పిరిట్ అమోనియా ఆరంమెట్ 1 డ్రాము. మొత్తమును కలుపుము. డోసు – 1 డ్రాము నీరు లేక బ్రాందీతో కలిపి యీయవచ్చును. రోగి వెంటనే ఆరోగ్యమును జెందగలడు.

## 263 ఆమ్ల పిత్తాంతక చూర్ణము

కలకత్తాలో పేటెంటు చేయబడినది. 10 తులముల డబ్బీ ఖరీదు 1 రూపాయి. ఇది ఆమాశయ జాడ్యములను, ఆమ్లపిత్తమును, సంపూర్ణముగా పోగొట్టకదలని ప్రకటింపబడి యున్నది. మందు గుణము కలదే.

నల్లజీలకర్ర, తెల్లజీలకర్ర, వాము, అజామోదము, లవంగాలు, నల్లకరక్కాయ, యవక్షారము. స్వర్జిక క్షారము, సౌవర్చ లవణము, సైంధవలవణము, ఔషరలవణము, సాంబారు లవణము,

యివి సమానభాగములు, వీటిని మెత్తగా చూర్ణము చేయుము. డోసు-౩ మాషముల ప్రమాణము. నీటితోగాని నారికేళరసముతో గాని పుచ్చుకొనవలెను. ఆమ్లపిత్తము తగ్గిపోగలదు.

## 264 వాతహర పిల్స్

కలకత్తాలో పేటెంటు చేయబడినది. 50 మాత్రలుగల డబ్బీ ఖరీదు 1 రూపాయి. ఇది ఉదర రోగములన్నింటిని పోగొట్టకలదని ప్రకటింపబడి యున్నది.

పొంగింపబడిన యింగువ 1 భాగము, యవక్షారము, స్వర్జిక క్షారము, సైంధవలవణము, సౌవర్చ లవణము, సాంభారు లవణము, పిప్పలి, పిప్పలి మూలము, చిత్రమూలము, మిరియాలు. కర్పూరము ధనియాలు, చింతపండు, వస, వాము, పుష్కరమూలము, శొంఠి, కానుగపప్పు, నల్లజీలకర్ర, కరక్కాయ, చిరుబొద్ది, మొత్తము సమాన భాగములు. వీటిని చూర్ణ మొనర్చి నిమ్మరసముతో నూరి ½ మాషప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. డోసు - 1 మాత్ర. అనుపాన భేదముచే వివిధ రోగములకును, కలరా, శూల, మొదలగు వాటికిని ఉపయోగకరమైనది.

## 265 రక్తజ్ అర్శవటి

అలీగఢ్‌లో యిది తయారు చేయబడుచున్నది. 25 మాత్రలు గల డబ్బీ ఖరీదు 1 రూపాయి. దీనిని పుచ్చుకొనినచో రక్తపుమొలలు తగ్గిపోగలవని ప్రకటింపబడి యున్నది.

నిమ్మవిత్తులు 1 భాగము, నోదుగ విత్తులు 1 భాగము, రసాంజనము 1 భాగము, గైరికము ½ భాగము. మొత్తమును చక్కగా చూర్ణమొనర్చి గులాబీరసముతో బాగుగానూరి ½ మాష ప్రమాణముండునట్లు మాత్రలను చేయుము. దీనిని సోపు రసముతో ఉదయము, సాయంత్రము ఒక్కొక్క మాత్రను పుచ్చుకొనవలెను. రక్తపుమొలలు తగ్గిపోగలవు.

## 266 చర్మరోగ హరణ్

కలకత్తాలో యిది పేటెంటు చేయబడినది. దీనిని కొలది కాలము పుచ్చుకొనినచో చర్మరోగములు తగ్గిపోగలవు. 8 ఔన్సుల సీసా ఖరీదు 1 రూపాయి.

సొల్యూషన్ బిస్మత్ 4 డ్రాములు, సొల్యూషన్ పైప్సిన్ 6 డ్రాములు, టించర్ నక్సువామిక ½ డ్రాము, టించర్ కార్డమ్ కో 2 డ్రాములు, క్యాంఫర్ వాటర్ 2½ డ్రాములు. మొత్తమును కలుపుము. డోసు - ½ ఔన్సు. నీటితో పుచ్చుకొనవలెను.

## 267 చంద్రకాంతి తైలము

కలకత్తాలో యిది పేటెంటు చేయబడినది. ఇది కేవలము స్వదేశీ వస్తువులతోనే తయారుచేయబడినది. దీనిని ఉపయోగించినచో వెంట్రుకలకు యెట్టిహానియు కలుగక వెంట్రుకలు నల్లగా నుండగలవు.

చందనపు పొడి, జటామాంసి, శిలాపుష్పము, కచ్చూరము. యివి రెండు రెండు భాగములు, అగరు, గ్రంథితగరము, చలువ మిరియాలు, రత్నజ్యోతి, వట్టివేళ్ళు, కర్పూరము, చిన్నయేలకులు, గోరంట్ల ఆకులు, ధనియాలు, ఉసిరిక, జాపత్రి. యివి ఒక్కొక్క భాగము. వీటిని మొత్తము మెత్తగాదంచి 60 భాగముల నీటితో కలిపి ఒకదినము నానపెట్టుము. మరునటి ఉదయమున దీనిని సగము మిగులునంత వరకు కాచి దించి అందు 80 భాగములు చేమంతి నూనెను గాని, నువ్వులనూనెను గాని కలిపి నిప్పుపైనుంచి నూనె మాత్రము మిగులునంతవరకు కాచి దించి వడపోయుము. సుగంధము కొరకు యిందు యేలకుల అరఖు. గులాబీ అరఖు, కమలాఫలపు అరఖు, బర్గామొంటు ఆయిలు, లెమన్ ఆయిలు. అర్ధ అర్ధ భాగము కలిపి సీసాలో నుంచుము.

## 268 కఫక్యూర్

కరాచీలో యిది పేటెంటుచేయబడినది. 5 తులముల ప్రమాణముగల సీసా ఖరీదు 1-8-0. డోసు - 1½ ప్రమాణము. దినమునకు 3 పర్యాయములు దీనిని పుచ్చుకొనినచో దగ్గు తగ్గిపోగలదు.

అడ్డసరపు సత్వము (Extractum Vasica) 1 భాగము, బెంజాయిక్ యాసిడ్ ½ భాగము, తేనె 8 భాగములు. మొత్తమును కలిపి మెత్తగా నూరి డబ్బీలో నుంచుము. ఆవశ్యకతానుసారము ఉపయోగింప వచ్చును.

## 269 శిశు కుమార్

అంబాలాలో పేటెంటు చేయబడినది. 100 మాత్రలుగల సీసా ఖరీదు 8 అణాలు. దీనిని ఉపయోగించిన "బాలుర సమస్త జాడ్యములు తగ్గిపోగలవు. యెల్లప్పుడూ వాడుచుండినచో వారు చాల ఆరోగ్యవంతులై యుండగలరు" అని ప్రకటింపబడి యున్నది. మందు గుణము కలిగినదే.

శుద్ధిచేయబడిన పాదరసము 4 భాగములు, శుద్ధిచేయబడిన అమరశిల గంధకము 4 భాగములు, స్వర్ణమాక్షిక భస్మము 2 భాగములు. వీటిని మెత్తగా నూరి వావిలి రసముతో చక్కగా మర్దించి ¼ గురిగింజ ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. డోసు - 1 మాత్ర. తల్లి చనుపాలతో యీయవలెను.

## 270 నిమోనియా పిల్స్

ఇది బులంద్ పట్టణములో తయారు చేయబడుచున్నది. ఇది నిమోనియాను పోగొట్ట కలదని ప్రకటింపబడి యున్నది. ప్రకటనానుసారము మందు చక్కగా పనిచేయగలదు.

పగడపు భస్మము 1 భాగము, దుప్పికొమ్ము భస్మము 3 భాగములు, శుద్ధిచేయబడిన నాభి 1 భాగము. వీటిని వాకుడురసముతో

నూరి ఒక్క గురిగింజ ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. ఆవశ్యకతానుసారము ఒక్క మాత్రను తేనెతో యిచ్చి వావిడు కషాయమును పుచ్చుకొనునట్లు చేయుము. దీనిని దినమునకు రెండు పర్యాయములు యివ్వవలెను.

## 271 అండవృద్ధి పిల్స్

ఇది గంజాములోని ఒక డాక్టరుచే పేటెంటు చేయబడినది, దీనిచే అండవృద్ధి తగ్గిపోగలదని ప్రకటింపబడియున్నది.

రేవల్చిన్ని 1 భాగము. ముసాంబరము 1 భాగము, గుగ్గిలము 1 భాగము, మేదా కాష్ఠము 1 భాగము, పొగాకు 1 భాగము మొత్తమును నీటితో నూరి మాషప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము దీనిని ప్రతిదినము నీటితో నూరి పైనవ్రాసి లంగోటాను బిగించి కట్టుకొనవలెను. అండవృద్ధి తగ్గిపోగలదు, మందు ఉపయోగకర మైనదే. కాని దీనితోపాటు మలబద్ధకము కలుగకుండునట్లు చూడవలెను.

## 272 ప్రదరారి

కామిటిలోని ఒక వైద్యునిచే పేటుంటు చేయబడినది. 4 ఔన్సుల సీసా ఖరీదు 1-8-0. దీనిచే శ్వేత ప్రదరము, రక్త ప్రదరము, ధాతు స్రావము మొదలగు స్త్రీల సమస్త జాడ్యమును తగ్గిపోగలవని ప్రకటింప బడియున్నది.

కాచు 1 భాగము, పొంగింపబడిన పటికి 1 భాగము, యూసిడ్ టానిక్ 2 భాగములు, * పత్థర్ కా జీవ్ 2 భాగములు, వెదురుప్పు 2 భాగములు. చక్కెర 12 భాగములు. మొత్తమును మెత్తగా చూర్ణమొనర్చి సీసాలో నుంచుము. డోసు - 3 మాషముల ప్రమా

* యూనానీ వస్తువు "కల్ బుర్తా హాజర్" అని గూడ యందురు

ణము, ఉదయము, సాయంత్రము, నీటితో యివ్వవలెను . ప్రదర జాడ్యములు తగ్గిపోగలవు.

## 273 స్థూల్

ఇది ఢాకాలో పేటెంటు చేయబడినది. దీనిని మర్దించినచో లింగము స్థూలత్వము నొందగలదని ప్రకటింప బడియున్నది. 2 ఔన్సుల సీసా ఖరీదు 2 రూపాయిలు. మందు ఉపయోగకరమైనదే!

చేమంతినూనె 2 ఔన్సులు, యెఱ్ఱ చీమలు 100 లేక 200 వీటిని ఒక సీసాలో వేసి ఒక్క మాసము వరకు వుంచుము. పిమ్మట వడకట్టి ఉపయోగించుకొన వచ్చును.

## 274 టానిక్ పిల్స్

ఇది లండనులో తయారు చేయబడుచున్నది. 100మాత్రలు గల సీసా ఖరీదు 2-8-0. మందు ఉపయోగకరమైనదే.

ఫాస్ఫేట్ అయిరన్ 4 భాగములు, జింక్ వెలేరియన్ 2భాగములు, యెక్స్‌ట్రాక్ట్ నక్సువామిక 1 భాగము, యెక్స్‌ట్రాక్ట్ డామియానా 3 భాగములు, యక్స్‌ట్రాక్ట్ కెన్నబిస్ యిండికా ½భాగము. మొత్తమును కలిపి 3 గ్రెయినుల ప్రమాణముండునట్లు మాత్రలను చేయుము డోసు - 1 మాత్ర. దినమునకు 3 పర్యాయములు. వేడిచేసినట్లు కానుపించినచో ఉదయము. సాయంత్రము, రెండు మాత్రలనే ఉపయోగించుకోవలెను. శీఘ్రస్ఖలనమును, పోగొట్టుటయేగాక బలమునుగూడ వృద్ధినొందించ గలదు.

## 275 గోల్డెన్ వటి

ఇది కలకత్తాలో పేటెంటు చేయబడినది. 40 బిళ్లల ఖరీదు 2-8-0.

సోడియంగోల్డ్‌క్లోరైడ్ ¼ భాగము, కోడీనాసల్ఫ 1 భాగము, క్వినైన్ సల్ఫ 1 భాగము, ఫెర్రీకార్బ 1 భాగము, యక్స్ట్రాక్ట్ నక్సువామిక అరభాగము. యెక్స్ట్రాక్ట్ డామియూనా 1 భాగము. మొత్తమును నూరి 5 గ్రెయినుల ప్రమాణముండునట్లు మిషనుపై టాబిలెట్సు చేయింపుము. దీనిచే శక్తి వృద్ధి నొందగలదు. మధు మేహమున కిది ఉపయోగకరమైనది.

## 276 కస్తూరీ వటి

48 మాత్రలు గల సీసా ఖరీదు 6 రూపాయిలు. మైసూరులో యిది తయారు చేయబడుచున్నది. యిది ధాతువికారములనన్నింటిని పోగొట్టి వాజీకరణ శక్తిని వృద్ధిచేయ గలదని ప్రకటింపబడియున్నది. మంచి గుణము కలిగినదే.

ఇంగిలీకము 4 భాగములు, రేనాడు 4 భాగములు, మాజు ఫలము 4 భాగములు, కుంకుమపువ్వు 1 భాగము, కస్తూరి 1 భాగము నల్లమందు 1 భాగము, ముక్కు తుమ్మడు 3 భాగములు, బంగారపు రేకులు 3 భాగములు, కాయఫలము 7 భాగములు, దాల్చిన చెక్క 7 భాగములు, వెండిరేకులు 7 భాగములు. మొత్తమును తమల పాకు రసముతో చక్కగా నూరి ½ గురిగింజ ప్రమాణముండునట్లు మాత్రలను చేయుము. దీనిని పుచ్చుకొని పాలను త్రాగవలయును.

## 277 విజయ వటిక

ఇది భాగల్‌పూరులో పేటెంటు చేయబడినది. 40 మాత్రలు గల సీసా ఖరీదు 1-8-0 ఇది వీర్యరోగములనన్నింటినీ సంపూర్తిగా పోగొట్ట కలదని ప్రకటింప బడియున్నది

జాజికాయ 7 భాగములు, సన్న రాష్నము 7 భాగములు, షాలామిశ్రి 7 భాగములు; జాపత్రి 3½ భాగములు, నిర్విషి 3½ భాగ

ములు, నల్లమందు $3\frac{1}{2}$ భాగములు, దాల్చినచెక్క $3\frac{1}{2}$ భాగములు, కుంకుమ పువ్వు $3\frac{1}{2}$ భాగములు, గంజాయి 33 భాగములు, మొత్త మును చూర్ణ మొనర్చి వస్త్రఘాళితముపట్టి సీటితోనూరి అరమాష ప్రమాణముండునట్లు మాత్రలను చేయుము. ప్రతిదినము ఉదయము సాయంత్రము ఒక్కొక్క మాత్రను పాలతో పుచ్చుకోవలెను. మందు పుష్టికరమైనది.

## 278 అజీబ్ దవా

లాహోరులోని ఒక డాక్టరుచే పేటెంటు చేయబడినది ఇది మిక్కిలి పుష్టికరమగు వాజీకరణౌషధము, పుచ్చుకొనుటకును, పైకి వ్రాయుటకును, ఉపయోగపడ గలదు.

మాలకింకిణీ 8 భాగములు, అమరశిల గంధకము 5 భాగ ములు, పెద్ద జీలకర్ర 8 భాగములు, విషముష్టి 10/12 భాగము. నాభి 9/34 భాగము, గురిగింజ 2/3 భాగము పాషాణము 5/12 భాగము. వీటిని కచ్చాపచ్చగా నూరి పాలతో యేడు దినములవరకు నానబెట్టుము. పిమ్మట దీనిని గాజు అర్కయంత్రముద్వారా తైల మును తీసి సీసాలో నుంచుము. డోసు-1 చుక్క. తగిన అనుపాన ముతో పుచ్చుకొనవలెను.

## 279 గోలీ బుఖార్ (రిజిష్టర్డు)

కాన్‌పూర్‌లో యిది పేటెంటు చేయబడినది. 40 మాత్రలు గలసీసా ఖరీదు 12 అణాలు. దీనితో జ్వరము తగ్గిపోగలదని ప్రక టింపబడి యున్నది.

వేపాకులను నూరి గుండ్రముగా ముద్దజేసి దీనికి మట్టి గుడ్డతో కవచమిచ్చి నిప్పులోనుంచి యెర్రగా కాలునంతవరకు వుంచి తీసి చల్లార్చుము. యిది యెర్రరంగుగా నుండగలదు. యీ మందు 2 భాగములు, క్వైనైను 1 భాగము, మిరియాలు $\frac{1}{4}$ భాగము. మొత్త

మును కలిపి చక్కగా నూరి 2 గురిగింజల ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయును. డోసు - 1 మాత్ర. దినమునకు 3 పర్యాయములు. నీటితో యివ్వవలెను.

## 280 జ్వరాంకుశ వటి

ఆగ్రాలో యిది పేటెంటు చేయబడినది. 50మాత్రలుగలసీసా ఖరీదు 14 అణాలు. మలేరియా జ్వరమును యిది పోగొట్ట కలదు.

గోదంతీ భస్మము 3 భాగములు, తిప్పసత్తు 2 భాగములు. జాపత్రి 2 భాగములు. మొత్తమును తిప్పతీగ రసముతో నూరి మాషప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. డోసు - 1 మాత్ర. దినమునకు 3 పర్యాయములు నీటితో యివ్వవలెను.

## 281 వాయు గోలా

ఇది యిటావా ప్రాంతములోని ఒక పల్లెటూరిలో పేటెంటు చేయబడినది. 10 మాత్రలు గల సీసా ఖరీదు 2 రూపాయిలు. ఇది ఉదర రోగముల నన్నింటినీ సంపూర్తిగా పోగొట్ట కలదని ప్రకటింపబడి యున్నది.

సౌవర్చ లవణము, సాంభారు లవణము పిప్పలి, మిరియాలు, శొంఠి, సైంధవ లవణము, నల్లజీలకర్ర, పెద్దజీలకర్ర, అజామోదము, యింగువ. వీటి సమానభాగములను చూర్ణించి మునగర సముతో నూరి మాషప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. డోసు - 1 మాత్ర. దినమునకు 3 పర్యాయములు, నీటితోగాని లేక సోపు రసముతో గాని పుచ్చుకొనవలెను. గుల్మవ్యాధి కిది ఉపయోగకరమైనది.

## 282 సుర్ఖ మాదహ్ వటి (Arrisi ples)

100 మాత్రలుగల సీసా ఖరీదు 1 రూపాయి. బరేలీలో యిది పేటెంటు చేయబడినది. మందు చాల ఉపయోగకర మైనది.

రసాంజనము 9 భాగములు, తెల్లచందనము 2 భాగములు, గంట్ల కచోరము 3 భాగములు, చనపాల విత్తులు (కనుగోటిగింజలు) 2 భాగములు, ముర్దారసింగు ½ భాగము, నల్లమందు 1 భాగము గోరంట్ల 1 భాగము, పసుపు 1 భాగము, వేపాకుల చూర్ణము 1 భాగము, పెనువేప ఆకులు 1 భాగము. మొత్తమును మెత్తగా చూర్ణమొనర్చి ½ గురిగింజ ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. డోసు – 1 నుండి 3 మాత్రలవరకు. శక్తిని అనుసరించి పిల్లలకు యీయవలెను.

## 283 వ్రణ హరణ్

ఇది గురుదాస్ పూర్‌లో పేటెంటు చేయబడినది. ఒక్క ఔన్సు డబ్బీ ఖరీదు 12 అణాలు. యిది వివిధములగు వ్రణములను పోగొట్ట కలదని ప్రకటింప బడియున్నది. మందు చాల ఉపయోగ కరమైనది.

శ్రీవాసము 2 తులములు. మైనము 1 తులము, ముర్దారు సింగు 3 మాషములు, శంఖ జీరకము 3 మాషములు; వెలిగారము 3 మాషములు, నల్లమందు 3 మాషములు, అవిశనూనె 2 తులములు, మొదట తైలమును మైనమును కలపి పిమ్మట శ్రీవాసమును కలుపుము. పిమ్మట మిగిలిన వాటి నన్నింటినీ కలిపి ఆయింటుమెంటును తయారు చేయుము దీనిని వివిధములగు వ్రణముల పైనను ఉపయోగింప వచ్చును.

## 284 గ్యారంటీ గనేరియా హరణ్

20 తులముల డబ్బీ ఖరీదు 1–4–0. యిది "సుజాక్ కీహుక్మీ దవా" అను పేరుతో పాపధునీ, బొంబాయిలో, ఒక వైద్యుని దుకాణములో తయారు చేయబడుచున్నది. యిది వివిధములగు ప్రమేహములను, ధాతు వికారములను, గనేరియాను, సంపూర్తిగా నిర్మూలించ గలదని ప్రకటింపబడి యున్నది.

పసుపు చూర్ణము 10 తులములు ఉసిరిక చూర్ణము 10 తులములు. రెంటిని మెత్తగానూరి వస్త్రఘాళిత మొనర్చి డబ్బీలో నుంచుము. డోసు – 9 మాషముల ప్రమాణము. ఉదయము. సాయంత్రము, అప్పుడు తోడినసీటితో ఉపయోగింపవలెను.

## 285 అక్ సీర్ అత్ఫాల్

యిది హెల్థ్ హోమ్, లాహోరులో పేటెంటు చేయబడినది. దీనిచే బాలుర సమస్త జాడ్యములు తగ్గిపోగలవని ప్రకటింపబడి యున్నది.

* అకీక్ (యవనదేశపు రాళ్ళు) భస్మము * యశబ్ (ప్రఖ్యాతిగలరాయి) భస్మము యివి ఒక్కొక్క భాగము, పగడపు భస్మము 6 భాగములు, పావుదారు (ఖతాదేశముది) 6 భాగములు, గులాబీ కేశరములు 6 భాగములు, పచ్చ కరక్కాయ 6 కాయల్ను, చిన్న ఏలకులు 6 భాగములు తామరగింజలలోని పప్పు 6 భాగములు, * హజ్ రుల్ యహూద్ భస్మము 6 భాగములు ముత్యము 1/3 భాగము, బంగారపు రేకలు ½ భాగము మొత్తమును చక్కగా మొగలి రసముతో నూరి పెసరగింజ ప్రమాణముండునట్లు మాత్రలను చేయుము డోసు – ½ మాత్ర ప్రమాణముండి 1 మాత్ర వరకు చనుపాలతో దినమునకు రెండు పర్యాయములు యివ్వవలెను. దీనిచే బాలుర సమస్త జాడ్యములు తగ్గిపోగలవు.

## 286 అక్సీర్ హాజిమ్

పై వోటనే యిదిగూడ పేటెంటు చేయబడినది.

జిల్లేడు పువ్వులలోని కింజల్కములు 2½ తులములు పచ్చకరక్కాయ 5 తులములు వాము 5 తులములు సౌవర్చ లవణము 5 తులములు సైంధవ లవణము 5 తులములు సాంభారు లవణము 5

* యూనానీ ఫార్మసీలలో యివి దొరుక గలవు.

తులములు చవిటిఉప్పు 5 తులములు నవాసాగరము 5 తులములు, మిరియాలు 5 తులములు దానిమ్మ గింజలు 5 తులములు, శొంఠి 5 తులములు, నిమ్మఉప్పు 2 తులములు, కలబంద గుజ్జు 10 తులములు సిరకా 15 తులములు. మొత్తమును మెత్తగా నూరి యెండించి చూర్ణము చేయుము. డోసు - ½ మాషప్రమాణము. దీనిచే సంపూర్తిగా ఆమాశయ ఆంత్ర వ్యాధులు తగ్గి పోగలవు. కొలది నిముషములలోనే మందు గుణమును చూపింప గలదు. మందు గుణము కలదే.

## 287 యాంటీ ఫ్లొజెస్టీన్

ఇది విదేశపుమందు. రకరకములుగా సైజువారి డబ్బీలతో దిగుమతి చేయబడు చున్నది..

కెవోలీన్ 20 తులములు, బోరిక్ యాసిడ్ 10 తులములు ఆస్పిరిన్ 10 తులములు థయిమల్ 6 మాషములు పిప్పరమెంటు 6 మాషములు సోడాసాలిసైలన్ 1తులము, యూకలిప్టస్ ఆయిల్ 1 తులము, క్లోరెల్ హైడ్రేట్ 6 మాషములు, టర్పెంటాయిల్ 1 తులము, గ్లిసరిన్ కావలసినంత మొదట 4, 5, 9 వస్తువులను చక్కగా నూరి అందు 2, 3, 6 వస్తువులను కలుపుము తరువాత 1వ మందును గ్లిసరిన్‌ను కలిపి నూరగా గాఢమగు లేపనముతయారు కాగలదు. దీనిని డబ్బీలలో నుంచి ఆవశ్యకతానుసారము ఉపయోగింప వచ్చును వివిధములగు నొప్పులు, వాపులు పుండ్లు మొదలగు నవి తగ్గిపోగలవు.

## 288 కర్పూరాది వటి

లాహోరులో పేటెంటు చేయబడినది. దీనిచే ప్రమేహములు వీర్యదోషములు స్వప్నదోషములు వివిధమగు నొప్పులు తగ్గిపోగలవు.

కర్పూరము ¼ భాగము, యెక్స్ట్రాక్ట్ హైశ్యామస్ ¾ భాగము, నల్లమందు 1/12 భాగము. మొత్తమును చక్కగా నూరి 2 గురిగింజల ప్రమాణముండునట్లు మాత్రలను చేయుము. డోసు - 2 మాత్రలు. ఉదయమున 2 మాత్రలను. సాయంత్రము 2 మాత్రలను అప్పుడు తోడిన నీటితో పుచ్చుకొనవలెను

## 289 మెథాలేటెడ్ వ్యాసలీన్

ఇది విదేశములనుండి తయారు చేయబడి దిగుమతి యగుచున్నది. విదేశపు మందుల దుకాణములలో దొరక గలదు.

వ్యాసలీన్ 2⅓ భాగములు, పిప్పరమెంటు 1/6 భాగము, థయిమల్ 1/6 భాగము. మొత్తమును కలిపి సీసాలో నుంచుము. ఆవశ్యకతానుసారము దీనిని కొద్దిగా నొప్పిగలచోట రుద్దుము. నొప్పి తగ్గిపోగలదు.

## 290 మెంథల్ పెంటు

ఇది ప్రసిద్ధమగు మందు. విదేశపు మందులమ్ము అన్ని దుకాణములలోను యిది దొరుక గలదు.

మెంథల్ 3 గ్రయినులు, అయోడిఫార్మ్ 3 గ్రయినులు, పొటాస్ అయోడయిడ్ 5 గ్రయినులు, గ్లిసరిన్ 1 ఔన్సు. మొత్తమును చక్కగా కలుపుము. దీనిని యీాక మొదలగు వాటితో పుండ్లపై వ్రాయవలెను.

## 291 గ్రైప్ వాటర్

ఇది ఒక విధమగు తరళౌషధము. అన్నిచోట్లను విక్రయింపబడుచున్నది. సీసాలో షుమారు 5 ఔన్సుల మందుండును. ఖరీదు 1 రూపాయి.

సోడియం బై కార్బొనేట్ 1 3/10 భాగములు, ఆల్కాహాలు 3/100 భాగములు. చక్కెర 0½ భాగములు, సోపుతైలము 3/100 భాగములు, కాల్షియం హైపొ ఫాస్పేట్ ½ భాగము. మిగిలినది నీరు. మొత్తము 00 భాగము లుండునట్లు చూడుము. మెరుపు రంగు కొరకు కోచనీల్ కలుపుము. డోసు – ½ నుండి 1 చంచా ప్రమాణము వరకు. దీనిని ప్రతిదినము పిల్లలకు యిచ్చుచుండ వచ్చును. దీనిచే అజీర్ణము, మలబద్ధకము, మొదలగునవి తగ్గి వారు పుష్టికలిగి యుందురు.

## 292 బాల పుష్ట సిరప్

ఇది బొంబాయిలో తయారు చేయబడుచున్నది. 4 ఔన్సుల సీసా ఖరీదు 1 రూపాయి.

కాల్షియం హైపొ ఫాస్ఫేట్ 40 గ్రయినులు, మామూలు షర్బత్తు 4 ఔన్సులు, యాసిడ్ హైపొఫాస్ఫొరిక్ 5 చుక్కలు, టించర్ కోచనీల్ 20 చుక్కలు. మొదట కాల్షియం హైపొఫాస్ఫేటును, షర్బత్తులో కలుపుము. పిమ్మట యాసిడ్‌ను, కోచనీలును కలిపి సీసాలో నుంచుము. డోసు – టీ చంచా ప్రమాణమునుండి 10 చుక్కలవరకు. పాలతో యివ్వవలెను. దీనిచే పిల్లలు పుష్టినొంది శక్తియుక్తులై యుండగలరు.

## 293 రెడ్ పౌడర్

"లాల్ చూర్ణ" అను పేరుతో యిది లాహోరులో పేటెంటు చేయబడినది. రక్తస్రావమును ఆపివేయుటయే దీని ముఖ్య కర్తవ్యము. మందు గుణము కలిగినదే.

శంఖజీరక భస్మము, గైరికము, * దంబుల్ అఖవయిన్ (హీరాదుషీ), కహరుబా *, తుమ్మకాయలలోని గుజ్జు (యెండినది)

* యివి యూనానీ ఫార్మసీలలో దొరకును.

వీటి సమాన భాగములను తీసుకొని చూర్ణము చేయుము. డోసు - $1\frac{1}{2}$ మాషప్రమాణము నుండి 2, 3, మాషప్రమాణముల వరకు తగిన అనుపానముతో యీయవలెను. వెలుపలనుండిగాని, లోపల నుండిగాని వచ్చురక్తము అణగిపోగలదు.

## 294 డోంగరే బాలామృతము

బొంబాయిలో పేటెంటు చేయబడినది. 4 ఔన్సుల సీసా ఖరీదు 12 అణాలు. పిల్లల సమస్త జాడ్యములను పోగొట్టకలదని ప్రకటింపబడి యున్నది. విశేషముగా బాలురకు పుష్టినిచ్చుటకు పనికి వచ్చును.

సోపు తైలము 1 డ్రాము, హైపో ఫాస్ఫేట్ ఆఫ్ సోడా $\frac{1}{2}$ డ్రాము. కాల్షియుం ఫాస్ఫేట్ $\frac{1}{2}$ డ్రాము, చక్కెర 1 ఔన్సు, లయిమ్ వాటర్ 3 ఔన్సులు. మొత్తమును కలుపుము. రంగుకొరకు టించర్ కోచనీల్ వేయుము.

## 295 ఆరోగ్య వటి

ఇది బులంద్ పట్టణములో పేటెంటు చేయబడినది. దీనిచే త్ర్యాహ్నిక, చాతుర్థ్యాహ్నిక జ్వరములు, రొంప, పడిశము, తల నొప్పి, యెముకలలోని నొప్పులు, మొదలగునవి తగ్గిపోగలవని ప్రకటింపబడి యున్నది.

ఉమ్మెత్త విత్తులు 3 భాగములు, రేవలచిన్ని 2 భాగములు శొంఠి 1 భాగము. మొత్తమును చక్కగా చూర్ణము చేసి వస్త్రకాయిత మొనర్పుము. దీనిని తుమ్మబంక నీటితో నూరి శనగగింజ ప్రమాణ ముండునట్లు మాత్రలనుచేసి నీడన యెండించుము. జ్వరము వచ్చుటకు ముందు ఒక్కొక్క మాత్రను నీటితో దినమునకు రెండు మూడు పర్యాయములు యివ్వవలెను.

## 296 అలాహ్మర్

ఇది ఢిల్లీలో డాక్టరు అజమల్‌ఖా సాహేబుచే పేటెంటు చేయబడినది. ఇది ఉత్తమమగు వాజీకరణౌషధము.

నాభిని తగినంత తీసుకొని సూరణ కందరసముతో మెత్తగా నూరి ముద్దజేసి దానిమధ్య 2 తులముల యింగిలీకపు ముద్దను వుంచి దానిపై దట్టమగు గుడ్డను చుట్టి వేయుము. ఒక తామ్రపాత్రలో 3 శేర్లు కుసుమ నూనెను పోసి అందుపై ముద్దనుంచి పాత్ర పైభాగమున పళ్ళెమును బోర్లించి దానిపై బరువగు రాతిని పెట్టుము. యీ పాత్రను పొయ్యిపైనుంచి క్రింద 1 జాము వరకు చాల తేలికగాను 9 జాములవరకు చాల గాఢముగాను మంట బెట్టుము ఆవిరిపోకుండునట్లు చూచు చుండుము. ఇట్టిస్థితిలో పాత్రలో చాల పెద్ద ధ్వని కలుగుచుండును. నాల్గు జాముల పిమ్మట ముద్దను తీసి చక్కగా నూరి జాగ్రత్త పెట్టుము. డోసు – 1 వడ్లగింజ ప్రమాణము నుండి 2 వడ్లగింజల ప్రమాణము వరకు, పుష్టికరమగు అనుపానముతో యివ్వవలెను.

## 297 అమృతాంజన్

అత్యధికముగా యిది విక్రయింప బడుచున్నది. అర ఔన్సు ప్రమాణము గల సీసా ఖరీదు 8 అణాలు. మందు ఉపయోగకరమైనదే.

నూనె 1 భాగము, మైనము 1 భాగము, రెంటినీ కలిపి వడ గట్టుము, యీ మిశ్రణము 1 భాగము, కర్పూరము ½ భాగము. పిప్పరిమెంటు ½ భాగము క్లోరెల్ హైడ్రేట్ ½ భాగము, థయిమల్ ½ భాగము, ఆయిల్ చినామోమి ½ భాగము. యాసిడ్ సాలిసైలక్ ¼ భాగము. మొత్తమును చక్కగాకలిపి సీసాలోనుంచుము. ఇందు సుగంధము కొరకు లెమన్ గ్రాస్ ఆయిల్‌ను కలుప వలెను. దీనిని పైనరుద్దినచో వివిధములగు నొప్పులు, విషకీటకము బాధలు తగ్గిపోగలవు.

## 298 క్రుషన్ సాల్ట్

దీని ప్రకటన మనకు నలుదిక్కులలోను చాల విరివిగా పత్రికలలో కనుపించు చుండును. వాతరోగమునకు ముఖ్యమగు మందని తలంచబడు చున్నది. ఇది యింగ్లాండు నుండి దిగుమతి చేయబడు చున్నది.

పొటాషియం బ్రోమయిడ్ 15 భాగములు, సోడియం సిల్‌సిలేట్ 40 భాగములు. యాస్పిరిన్ 45 భాగములు, సుగర్ ఆఫ్ మిల్కు 25 భాగములు. మొత్తమును తైల మిశ్రిత మొనర్చి (Oiled) చాలా చక్కగా నూరుము. మందు తయారు కాగలదు.

## 299 యిన్‌గోరైడ్

ఈ బిళ్ళలు యార్కుషైరులో తయారుచేయ బడుచున్నవి. 54 బిళ్ళలు గల పెట్టె ఖరీదు, యెరుపు రంగు పైన తెల్ల కవరు కల్గినది – 3 రూపాయిలు. ఇది నపుంసకత్వము, సర్వబలహీనములు, నరముల నొప్పులు, మొదలగు వాటికి పనికివచ్చును.

యెక్స్‌ట్రాక్ట్ నక్సువామిక 10 భాగములు. జింక్ ఫాస్ఫేట్ 12/50 భాగములు, సెకరేటెడ్ కార్బోనేట్ ఆఫ్ అయిరన్ 18 భాగములు, యింగువ 9 భాగములు, మిగిలినది పంచదార 62 38/50 భాగములు. మొత్తమును నీటితో చక్కగా కలిపి నూరి 3 గ్రెయినుల ప్రమాణముండునట్లు బిళ్ళలను చేయుము. డోసు – 1 బిళ్ళ. దినమునకు 3 పర్యాయములు.

## 300 యెమీసిన్

విదేశమునుండి దిగుమతి చేయబడుచూ యిది ప్రపంచమందంతటను విక్రయింప బడుచున్నది. ప్రమేహమునకు, శీఘ్ర స్ఖలనమునకు, యిది ఉపయోగకరమైనది.

అయోడయిడ్ 2 గ్రెయినులు, ఆర్సనేటెడ్ సింకోనా 1/30 గ్రెయిను, ఫేవరేటెడ్ స్ట్రిచినస్ 1/60 గ్రయను, ఫాస్ఫరైజెడ్ ల్యుప్యూలిన్ 1 గ్రెయిను. మొత్తమును కలిపి ఒక్క మాత్రను చేయుము. యిటులనే కావలసిన వాటిని తయారుచేసుకొన వచ్చును. డోసు - 1 మాత్ర. ఉదయమునగాని లేక రాత్రి పరుండబోవు నప్పుడుగాని పావుశేరు పాలతో పుచ్చుకొన వలెను.

## 301 కెనావిన్ ఫాస్ఫేట్ పిల్స్

విదేశమునుండి యిది దిగుమతి యగుచున్నది. ఇది నరముల బలహీనతకు, వాజీకరణశక్తికి పనికివచ్చునని ప్రకటింప బడియున్నది.

స్ట్రిచినియా నయిట్రేట్ 1/48 గ్రయిను, యెక్సట్రాక్ట్ కెన్నబిన్ ½ గ్రెయిలు, ఫాస్ఫరస్ 1/100 గ్రెయిను, హైస్యామిన్ ¼ గ్రెయిను. మొత్తమును కలిపి ఒక్కమాత్రను చేయుము. యిటులనే కావలసిన వాటిని తయారు చేసుకొన వచ్చును. భోజనానంతరము అర్ధగంట ఆగి ఒక్కమాత్రను వూరికే పుచ్చుకొన వలెను.

## 302 డాక్టర్ పికరట్ టానిక్ పిల్స్

ఇదిగూడ విదేశమునుండే దిగుమతి చేయబడు చున్నది. ప్రపంచమం దంతటను దీనికి ప్రచారము కలదు.

ఫెర్రీ రెడక్టమ్ ¼ గ్రెయిను, యెక్సట్రాక్టు నక్సువామిక 1/4 గ్రెయిను, యక్సట్రాక్టు డామియానా 2 గ్రెయినులు, ఫాస్ఫరస్ ¼ గ్రెయిను, క్వైనైన్ సల్ఫాస్ 1/100 గ్రయిను, యూహింమలీన్ 1/100 గ్రెయిను. మొత్తమును కలిపి ఒక్క మాత్రను చేయుము. యిటులనే కావలసిన వాటిని తయారు చేసుకొన వచ్చును. ప్రతి దినము సాయంకాలము భోజనానంతరము ఒక్క మాత్రను పుచ్చుకొన వలెను. వాజీకరణ శక్తిని వృద్ధి నొందించుటలో యిది అద్వితీయమైనది.

## 303 డాక్టర్ మార్ గంజ్ పిల్స్

లండనులో యిది తయారు చేయ బడుచున్నది. 20 బిళ్ళలు గల పెట్టె ఖరీదు 3 రూపాయిలు. మాత్రలపై సుగర్ కోటింగ్ యివ్వ బడి యుండును. ఇది అలసట, బలహీనము, క్షీణత్వము, వాత జాడ్యము, తలనొప్పి, అజీర్ణము, మొదలగువాటిని పోగొట్ట గలదని ప్రకటింప బడియున్నది.

రెడ్ యూసడైరన్ నూటికి 70 భాగములు, క్వైనైన్ సల్ఫ నూటికి 59 భాగములు, ఫాస్ఫరస్ నూటికి 13/100 భాగములు. మొత్తమును కలిపి $3\frac{1}{4}$ గ్రెయినుల ప్రమాణముండునట్లు బిళ్ళలను చేయుము. ఉదయము ఒక్క బిళ్ళను సాయంత్రము భోజనానంత రము మరొక్క బిళ్ళను పుచ్చుకొన వలయును.

## 304 డెమ్‌రాయ్ డస్

ఈ బిళ్ళల డబ్బీలు లండనులో తయారు చేయ బడుచున్నవి. డబ్బీలు చిన్నవి, పెద్దవి, రెండు రకములుగా నున్నవి. 36 బిళ్ళలు గల చిన్న డబ్బీ ఖరీదు 2 రూపాయిలు. ఇది పూర్తిగా అన్ని విధములగు బలహీనములను పోగొట్టి వాజీకరణశక్తిని వృద్ధినొందించు టకు పనికివచ్చునని ప్రకటింపబడి యున్నది.

అయిరన్ హైపో ఫాస్ఫేట్ 55/100 గ్రెయినులు, క్వైనైన్ సల్ఫేట్ 13/100 గ్రెయినులు, యక్స్‌ట్రాక్ట్ డామియానా 2 గ్రెయి నులు. మొత్తమును కలిపి ఒక్క బిళ్ళను చేయుము. కావలసిన వాటిని యిటులనే తయారు చేసుకొన వచ్చును. డోసు–1 బిళ్ళ దినము నకు 3 పర్యాయములు. భోజనానంతరము పుచ్చుకొనవలెను.

## 305 కోకాఫోస్

లండనులో తయారు చేయ బడుచున్నది. 94 బిళ్ళలు గల పెట్టె ఖరీదు 3–3–0. ఇది నరములకు శక్తినిచ్చి ఉత్సాహమును, వాజీకరణశక్తిని వృద్ధి పరచునని ప్రకటింప బడియున్నది.

అయిరన్ హైపోఫాస్ఫేట్ 78/100 గ్రెయిను, క్వినైన్ సల్ఫేట్ 1/10 గ్రెయినును, యెక్స్ట్రాక్ట్ డామియానా 2 గ్రయినులు. మొత్తమును కలిపి ఒక్క బిళ్ళను చేయుము. ఇటులనే కావలసిన వాటిని తయారు చేసుకొనవచ్చును. డోసు – 1 బిళ్ళ. ఆహారమును తీసుకొనిన పిమ్మట పుచ్చుకొనవలెను. దీనిచే ధాతు వికారములు తగ్గి శక్తి వృద్ధి నొందగలదు.

### 306 హబూబ్ తిలా

చశ్మా జిందగీ, లాహోరులో యిది తయారు చేయబడుచున్నది. మంచు గుణము కలిగినదే!

లోహభస్మము 2 గురిగింజల యెత్తు, ఫాస్ఫరస్ 2 గురిగింజల యెత్తు, గోల్డ్ క్లోరైడ్ 4 గురిగింజలయెత్తు, కుంకుమ పువ్వు, 6 మాషములు, కస్తూరి 3 మాషములు, బంగారపు రేకులు 1 మాషము, బంగారపు భస్మము ½ మాషము, క్వినైన్ సల్ఫ 3 మాషములు, యెక్స్ట్రాక్ట్ నక్సువామిక 1½ మాషములు, యెక్స్ట్రాక్టు బెల్డోనా 6 గురిగింజల యెత్తు. యర్రలు (యెండినవి) 1 తులము, ఓలియం కాజపుటాయీ 1 డ్రాము, దాల్చిన అరఖు 1½ డ్రాము. మొత్తమును చక్కగా నూరి 150 మాత్రలను చేయుము. డోసు–1మాత్ర. ఉదయము సాయంత్రము పాలతో పుచ్చుకొనవలెను. దీనిచే రక్తము వృద్ధినొంది సంపూర్ణముగా శారీరకశక్తి, వాజీకరణశక్తి వృద్ధి నొందగలవు.

### 307 గోర్డంజ్ వైటల్ సెక్సియోలిన్ రెస్టోరెటో

యర్రనిరంగుగల యీ తరళౌషధము యార్కుషైరునుండి దిగుమతి యగుచున్నది. సీసాలో 21 ఔన్సుల పరిమాణము గల మందుండును.

అయిరన్ హైపోఫాస్ఫేట్ 28 గ్రెయినులు, కాల్షియం హైపోఫాస్ఫేట్ 28 గ్రెయినులు, సోడియం హైపోఫాస్ఫేట్ 32 గ్రెయి

నులు. పొటాషియం హైపో ఫాస్ఫేట్ 7 గ్రయినులు, క్వైనైన్ సలు. 28 గ్రయినులు, సయిట్రిక్ యాసిడ్ 48 గ్రయినులు, చక్కెర 8 ఔన్సులు. మొత్తమును కలిపి చక్కగా నూరి సీసాలో నుంచుము. మిగిలినది నీరు కలిపి మొత్తమును 21 ఔన్సులుండునట్లు చేయుము. డోసు – 1 టీ చంచా ప్రమాణము. 1 ఔన్సు నీటితో కలిపి పుచ్చు కొనవలెను. బలహీనతను పోగొట్టి వాజీకరణ శక్తిని వృద్ధి నొందించును.

## 308 నపుంసక పిల్స్

ఇది లక్నోలో డాక్టర్ అబ్దుల్ అజీజ్ సాహేబుచే "నామర్ది కీ గోలియా" అను పేరుతో పేటెంటు చేయబడినది. నపుంసకత్వ మును పోగొట్టుట కిది చాల అత్యుత్తమమైన మందని తలంచబడు చున్నది.

జాజికాయ 3 భాగములు. ఆకుద్ర పురుగులు 3 భాగములు, అక్కలకర్ర 3 భాగములు వీటిని మెత్తగా చూర్ణ మొనర్చుము. ఒక ఊరపిచ్చుక పొట్టను చీల్చి పరిశుభ్రము చేసి అందు యీ చూర్ణమును పోసి తిరిగ కుట్టుము. దీనిని ఆవునేతితో వేసి చక్కగా కాల్చి తీసి గట్టి వేప పుల్లతో నూరుము. మందు తయారు కాగలదు. డోసు – 1 గురిగింజ ప్రమాణము. బెంగాలీ తమలపాకుతో 40 దిన ములు ప్రతిదినము ఉదయమున పుచ్చుకొనుచుండ వలెను. మందును పుచ్చుకొను కాలములో స్త్రీ సంగమును విసర్జింపవలెను.

## 309 డాక్టర్ హామండ్ టానిక్ పిల్స్

న్యూయార్కులో తయారు చేయుబడుచున్నది. ప్రపంచ మందలి అన్ని భాగములకు యిది దిగుమతిచేయుబడుచూ విక్రయింప బడుచున్నది. 60 మాత్రలు గల సీసా ఖరీదు 2–8–0. ఇది శరీరము నకు పుష్టినిచ్చి నపుంసకత్వమును పారద్రోలునని ప్రకటింపబడి యున్నది.

జింక్ సల్ఫేట్ 1/10 గ్రయిను, యెక్స్ట్రాక్ట్ నక్సువామిక 1 గ్రయిను, సుగర్ ఆఫ్ మిల్కు 2 గ్రయినులు. మొత్తమును కలిపి ఒక్క మాత్రను చేయుము. ఇటులనే కావలసిన వాటిని తయారు చేసుకొనవచ్చును. దినమునకు 3 పర్యాయములు పుచ్చుకొనవలెను.

## 310 బహారే చమన్ ఖుశ్బూ

ఈ సుగంధ ద్రవ్యము అన్ని అత్తరు దుకాణములలోను విక్రయింపబడు చుండును. ఇందు చక్కని సుగంధము కలదు.

ఒక్క పయింటు రెక్టిఫయిడ్ స్పిరిటులో 10 చుక్కలు గులాబీ యెసెన్స్, 5 చుక్కలు మొగలి యెసెన్సు, 4 ఔన్సులు నారింజ యెసెన్సు, 1 డ్రాము లవంగముల తైలము. 3 గ్రయినులు కస్తూరి, ½ డ్రాము చేమంతి యెసెన్సు, 5 గ్రయినులు అంబరు, 2 ఔన్సులు లెవండరు వాటరు. మొత్తమును సీసాలో కలిపి మూత పెట్టి ఒక్క వారము వరకు అట్టిపెట్టుము. చక్కని సుగంధద్రవ్యము తయారు కాగలదు.

## 311 శరీరసుందర తైలము

లాహోరులో యిది పేటెంటు చేయబడినది. 10 తులముల సీసా ఖరీదు 2 రూపాయిలు. దీనిని ఉపయోగించినచో చర్మము మృదువుగాను యెర్రగాను తళతళలాడుచూ వుండగలదు.

బాదాము ఆయిలు 1 భాగము, తెల్లనువ్వుల నూనె 1 భాగము, మైనము 1/32 భాగము, స్పెరమాసిటీ 1/32 భాగము. వీటిని నిప్పుపైనుంచి మొత్తము కలియునంతవరకు వుంచి అందు 10/30 భాగము గులాబీ అత్తరును కలిపి సీసాలో నుంచుము. దీనిని శరీరమునకు రుద్దుకొని స్నానము చేయుచుండవలెను.

## 312 ఫ్రూట్ సాల్ట్

ఇది ప్రతిచోటను అత్యధికముగా విక్రయింపబడు చున్నది. పేరు వినినతోడనేయిది కేవలము పండ్లరసములతోనే తయారు చేయబడినదని తోచును ఇది కేవలము అసత్యము. మోసపు ప్రకటనయే !

బైకార్బోనేట్ ఆఫ సోడా 75 భాగములు, టార్టారిక్ యాసిడ్ 6 భాగములు, రోసెల్ సాల్టు 40 భాగములు, మొత్తమును కలుపుము. డోసు – 1 టీ చంచా ప్రమాణము. నీటితో కలుపుకొని పుచ్చుకొనవలెను. దీనికి చెమ్మతగులకుండునట్లు జాగ్రత్త పరుపవలెను. లేనిచో చెడిపోవును.

## 313 హడెన్సా (Hadensa)

మొలల కిది గ్యారంటీయుందని ప్రకటింపబడి యున్నది. రేకు ట్యూబులతో యిది మందులమ్ము అన్ని దుకాణములలోను దొరకు చుండును.

పరిశుభ్రమగు వ్యాసులైను తెల్లది 1 భాగము, సల్ఫేట్ మార్ఫిన్ 1/30 భాగము. టెనీక్ 1/22 భాగము, సల్ఫేట్ యెట్రోఫిక్ 1/112 భాగము, హైడ్రో క్లోరేట్ ఆఫ్ కొకీన్ 1/600 భాగము, సువాసన కొరకు లెవండరు ఆయిలు, మిగిలినది గ్లిసరిక్, మొత్తము 5 ఔన్సు లుండునట్లు చూడుము. దీనిని చక్కగా కలిపి ట్యూబులలో నుంచుము. ఆవశ్యకతానుసారము మొలలపై వ్రాసినచో మొలల పిలకలు యెండి బాధ తగ్గిపోగలదు.

## 314 రెక్టో సెరోల్ (Recto Serol)

ఇది గూడ మొలలకు పనికివచ్చు మందే! విదేశపు మందులమ్ము అన్ని దుకాణములలోను యిది విక్రయింపబడు చుండును.

వ్యాసలీన్ నూటికి 49/2 వంతులు, మైనము నూటికి 2/3 వంతులు, ఫినోలిన్ నూటికి 1/3 వంతులు, జింకాక్సయిడ్ నూటికి 11/2 వంతులు, క్యాల్‌మెల్ నూటికి 10 వంతులు, మొత్తమును చక్కగా కలిపి దీనిని గూడ ట్యూబులలో నుంచుము. దీనిని పైన వ్రాసినచో మొలల పిలకలు యెండిపోగలవు.

## 315 మంత్ర తైలము

బొంబాయిలో యిది "జాదూ కా తేల్" అను పేరుతో తయారు చేయబడు చున్నది. వాతనొప్పులకిది ఉపయోగకరమైనది.

నువ్వుల నూనె 1 గ్యాలను, ఆయిల్ ఆఫ్ హామ్‌లక్ 2 ఔన్సులు, క్లోరోఫారమ్ 2 ఔన్సులు, లయికర్ అమోనియా 4 ఔన్సులు, కర్పూరము 8 ఔన్సులు, మొత్తమును కలుపుము. దీనిని నొప్పిగలచోట రుద్దవలెను.

## 316 ఆ రో గ్య సు ధ

ఇది జంబూలో పేటెంటు చేయబడినది. 6 పొట్లములు గల ప్యాకెట్టు ఖరీదు 1 రూపాయి. అయిదు నిమిషములలో యెట్టి బాధనైనను తగ్గించగలదని ప్రకటింపబడి యున్నది. ఇదిగూడ విదేశపు మందే.

యాస్పిరిన్ 1 భాగము, కెఫీన్ సిట్రస్ 1 భాగము, యాంటీఫేబరిన్ ½ భాగము, మొత్తమును కలిపి 15 గ్రయినుల ప్రమాణముండునట్లు పొట్లములను కట్టుము. అవసరమగునప్పుడు ఉపయోగించుకో వచ్చును. నొప్పి వెంటనే తగ్గిపోగలదు.

## 317 యాంటీఫేట్ పిల్స్

శరీర స్థూలత్వము పోగొట్టుట కిది ప్రసిద్ధి నొంది యున్నది. మందుమాత్రల రూపముతో గలదు. "దీనిని పుచ్చుకొనుచుండినచో

లావాంటి మనుష్యులు సన్నగా కాగలరు'' అని ప్రకటింపబడి యున్నది.

పొటాషియం అయోడయిడ్ 3 భాగములు, సాలిసైలిక్ యాసిడ్ 1 భాగము. రెంటినీ కలిపి 6 గ్రయినుల ప్రమాణముండు నట్లు ఒక్క మాత్రను చేయుము. ఇటులనే కావలసిన వాటిని తయారు చేసుకొనవచ్చును. డోసు - 1 మాత్ర. దినమునకు 3 పర్యాయములు.

## 318 ప్రాణ సంజీవన్

కలకత్తాలో యిది పేటెంటు చేయబడినది. ప్రమేహములపై పనిచేయగలదు. 20 తులముల డబ్బీ ఖరీదు 1-8-0. ప్రమేహము లను, ధాతు వికారములను నశింప జేయగలదని ప్రకటింపబడి యున్నది.

శతావరి, సన్నరాస్నము, తెల్లపోక, కత్తిరించిన పోక కాయలు, బహమన్ సఫేద్, మాజుఫలము, తుమ్మకాయలు, తుమ్మ పూలు, తుమ్మచెక్క తుమ్మబంక, వీటి సమాన భాగములనుదంచి మెత్తగా చూర్ణమొనర్చి వస్త్రకాగితము పట్టుము. ఉదయము సాయంత్రము దీనిని 6 మాషముల ప్రమాణము పుచ్చుకొని 15 తుల ముల ప్రమాణము నీటిని త్రాగవలెను వీర్యస్రావము తగ్గిపోగలదు.

## 319 తిలా సామర్థ్

హైదరాబాదులో యిది పేటెంటు చేయబడినది. బలహీనత, వీర్యక్షీణత, నపుంసకత్వము, మొదలగు వాటిపై పనిచేయగలదని యెంచబడుచున్నది.

నాభి 2 తులములు, అక్కలకర్ర 1 తులము, గంగసింధూ రము 6 మాషములు, జిల్లేడుపాలు 8 తులములు, ఆవునెయ్యి 8 తులములు, మొదట అక్కలకర్రను, నాభిని, మెత్తగా చూర్ణమొ

నర్చి వస్త్రకాయితము పట్టుము. మిగిలిన వాటిని యినుప బాండీలో వేసి అందు యీ చూర్ణమును కలిపి దీనిని, ఒక వైపు రాగి పైసాను తాపటము చేసిన వేప కర్రతో (రాగి పైసావున్న భాగముతో) 24 గంటల వరకు నూరుచుండుము. మందు చక్కగా కలిసిన పిమ్మట తీసి జాగ్రత్త పరుపుము. అవసరమగునప్పుడు యీ మందును ఒక్క మాష ప్రమాణమును వెచ్చచేసి లింగముపై (లింగాగ్రమును పోక వరకు వదలి) మూడు నాల్గు దినముల వరకు రుద్దుచుండుము. చిన్న చిన్న పొక్కులు లేచినచో మందును రుద్దుట ఆపివేసి వెచ్చచేసిన నేతిని వ్రాయుము. పొక్కులు తగ్గిపోగలవు. పొక్కులు తగ్గిపోయిన పిమ్మట తిరిగి మందును రుద్దుచుండవలెను.

## 320 బాద్‌శాహీ పౌష్టిక పిల్స్

బొంబాయిలో పేటెంటు చేయబడినది. మందు చాల గుణవంతమైన దగుటచే విదేశములలోగూడ చాల ప్రఖ్యాతి నొంది యున్నది. ఇది అంతర్బహిః శ్శక్తులను రెండింటినీ వృద్ధినొందించుటలో సాటిలేనిది.

నకలు శిలాజిత్తు, రుమీ మస్తగీ, ముత్యము, వెదురుప్పు, లవంగములు, జాపత్రి, జాజకాయ, * బహామన్ లాల్, * బహామన్ సఫేద్, దాల్చిన చెక్క, శీరకాకోళి, శొంఠి. వృశ్చికాలీ (తేలుమణి చెట్టు). సాంబ్రాణి, * ఊద్ సలీబ్ (గారకాయవలె నుండు ప్రఖ్యాతమగు మూలిక), సాలామిశ్రీ. నిర్విషీ, యివి ఒక్కొక్కటి 12 భాగములు, అంబరు. కస్తూరి, ఒక్కొక్కటి 16 భాగములు, బంగారపు రేకులు ½ భాగము, గసగసాల తైలము కావలసినంత. మొదట ముత్యము, అంబరు, కస్తూరి, వీటిని వేరువేరుగా * లతాకస్తూరీ అర్కములో నూరుము. నకలుశిలాజిత్తును. గసగసాల తైలమును కాచి కలుపుము. మిగిలిన వస్తువులను దంచి వస్త్రకాయి

* యూనానీ ఫార్మసీలలో దొరుకగలవు.

తము పట్టుము. వీటి నన్నింటినీ కలిపినూరి ఒక్కగురిగింజ ప్రమాణ ముందునట్లు మాత్రలను చేయుము. డోసు - 2 మాత్రలు. రాత్రి ఆవుపాలతో పుచ్చుకొనవలెను. దీనిని పుచ్చుకొనినచో సంపూర్ణ ముగా ధాతు వికారములన్నియు తగ్గిపోయి వాజీకరణశక్తి వృద్ధి నొందగలదు. మందును పుచ్చుకొనుకాలములో పుష్టికరమగు ఆహార మును పుచ్చుకొనుచుండ వలెను.

## 321 బ్లడ్ క్యూర్

అలహాబాదులో యిది పేటెంటు చేయబడినది. ఒక్క సీసా ఖరీదు 1 రూపాయి. మందు చాల గుణయుక్తమైనది. నాలుగయిదు దినములు పుచ్చుకొనిన తోడనే సుగుణము కానుపింప గలదు. విదేశపు సారసపరిల్లాలకంటె అనేకవందల రెట్లు గుణము కలిగినది.

కరక్కాయ, తాడికాయ, ఉసిరిక, బోడతరము, నేలవేము, వేపచెక్క, గంగరేగు, బ్రహ్మదండి, వీటిని ప్రత్యేక ప్రత్యేకముగా 3 తులములను తీసుకొని, దంచి 2 శేర్ల (80 తులముల శేర్లు) నీటిలో వేసి 3 వంతులు మిగులునంత వరకు కాచి దించి బాగుగా వడ గట్టుము. దీనిని కొంచెముసేపు కదలకుండా వుంచినచో మడ్డి క్రిందికి దిగిపోగలదు. జాగ్రత్తగా పై తేటను సీసాలోనికి వంచి అందు రసాంజనము 1 తులము, గైరికము 1 తులము, కలుపుము. మందు తయారు కాగలదు. డోసు - 1 తులము ప్రమాణము. ఉదయము సాయంత్రము పుచ్చుకొన వలెను. శనగ రొట్టెను నేతితో ఆహార ముగా పుచ్చుకొనుచుండ వలెను. నేతిని అధికముగా ఉపయోగించు కొన వలెను.

## 322 సుగంధపురాణి

పూనాలో "ఖుశ్ బూ కీ రానీ" అనుపేరుతో యిది తయారు చేయబడు చున్నది. ప్రతి దినము యిది అత్యధికముగా విక్రయింప బడుచున్నది.

రెక్టిఫయిడ్ స్పిరిట్ 1 పౌను, అంబర్ యెసెన్సు 1 డ్రాము, కస్తూరి యెసెన్సు ½ డ్రాము, ఆరంజ్ తైలము 1 డ్రాము, లవంగాల తైలము 21 చుక్కలు, రోజు యెసెన్సు 7 చుక్కలు, చేమంతి యెసెన్సు 1 డ్రాము మొత్తమును కలిపి 15 దినముల వరకు వుంచి పిమ్మట ఉపయోగించుకొన వచ్చును. ఇందు చక్కని సుగంధము కలదు చిన్న చిన్న సీసాలతో దీనిని విక్రయింప వచ్చును.

## 323 ఖిజాబ్ బాద్‌శాహీ

కరాచీలో పేటెంటు చేయబడినది. వెంట్రుకలను నలుపుగాను, దృఢముగాను వుంచగలదు. ఒక్క సీసా ఖరీదు 8 అణాలు.

మాజుఫలము 5 భాగములు, పచ్చకరకాయ 5 భాగములు, నల్ల కరక్కాయ 5 భాగములు, ఉసిరిక 5 భాగములు, దొడ్డి పాషాణము 2 భాగములు, తెల్లకాచు 2 భాగములు, కాల్చబడిన లవంగములు 2 భాగములు, లాహోరు లవణము 1 భాగము మైలతుత్తము ½ భాగము. మొత్తమును మెత్తగా నూరి కలుపుము. ఆవశ్యకతానుసారము దీనిని గోరంట్ల రసముతోగాని, లేక ఉసిరిక రసముతోగాని కలిపి వెంట్రుకలకు వ్రాసి పైన గుడ్డ కట్టవలెను. రెండు మూడు గంటల పిదప గుడ్డను వూడిదీసి వెంట్రుకలను సబ్బుతో కడిగి నూనెను వ్రాసుకొన వలెను.

## 324 అక్సీర్ ఖారిక్

ఇది లాయల్‌పూరులో పేటెంటు చేయబడినది. 4 తులముల ప్రమాణము గల సీసా ఖరీదు 1-4-0. దీనిని కేవలము అరచేతులకు రుద్దుకొనుట వలననే శరీరమం దంతటను వున్న తీట, గజ్జి, తగ్గిపోగలదు. మందును శరీరమం దంతటను వ్రాసుకొన వలసిన అగత్యము లేదు. ఈ విశేషముచే యిది ప్రతి దినము అత్యధికముగా విక్రయింపబడుచున్నది.

పాదరసము 6 మాషములు, అమరశిల గంధకము 6 మాషములు, ముర్దారు సింగు 6 మాషములు, మైలతుత్తము 6 మాషములు, పసుపు 6 మాషములు, కంపిల్లము 6 మాషములు, మిరియాలు 6 మాషములు, బావంచాలు 6 మాషములు. వీటిని చక్కగా నూరుము. కోడిగ్రుడ్డుకు బెజ్జముపెట్టి సొనను తీసివేసి అందు పై చూర్ణమును పోసి బెజ్జమును గుడ్డు పెంకుతో మూసి ఉలవ పిండితో గుడ్డుకు అంగుళ ప్రమాణముండునట్లు కవచమిమ్ము. దీనిని నిప్పులో నుంచి యెర్రగా కాలునంత వరకు వుంచి తీసి చల్లార్చి అందలి మందును నూరి జాగ్రత్తపెట్టుము. మోసు – 6 మాషములు. యిరువదిఒక్కమారు నీటితో కడిగి పరిశుభ్రపరచబడిన వెన్నలో 6 మాషముల ప్రమాణము మందును కలుపుము. దీనిని చక్కగా యింకిపోవునంత వరకు అరచేతులకు రుద్దుకొని చేతులను నిప్పుపై కాచుకొనుము. ఒక్క వారము దినముల వరకు యిటుల చేయుచుండిన చాలును.

## 325 కర్ణ రోగాంతక తైలము

నాగపూర్‌లో పేటెంటు చేయబడినది. ఔన్సు సీసా ఖరీదు 8 అణాలు.

నువ్వుల నూనె 20 భాగములు, ఉమ్మెత్త ఆకుల రసము 10 భాగములు. జిల్లేడు ఆకులరసము 10 భాగములు. వీటిని కలిపి తైలము మిగులునంత వరకు కాచి దించి వడకట్టుము. యిందు చక్కగా నూరబడిన కర్పూరము 4 భాగములు, గ్లిసరిన్ 5 భాగములు, కలిపి సీసాలో నుంచుము. దీనిని 4 చుక్కలు చెవిలో వేసినచో చెవినొప్పి, హోరు, చీము, చెముడు, మొదలగునవి తగ్గిపోగలవు.

## 326 యెండు రోగము

ఇది నైతవాలోని ఒక కొండజాతివాని పేటెంటు మందు. అతను నీ మందుకు 5 రూపాయిలు పుచ్చుకొనుచున్నాడు. మందును

పుచ్చుకొనిన రెండు గంటలలోనే కుర్రవాని ముఖము వికసించి తేటగా కనుపింప గలదు. మందు తక్షణమే గుణమీయగలదు. 4, 5, దినములలో జాడ్యము తగ్గిపోగలదు.

గలిజేరు వేరు 4 గురిగింజలయెత్తు, నల్లమిరియము ఒకటి. రెంటినీ మెత్తగా నూరి పిల్లవానిచే నాకించుము. రెండు గంటల పిదప కుర్రవాని ముఖము మార్పు జెంది ఆరోగ్యముగా కనుపింప గలదు. 6 మాషముల ప్రమాణము మందు పిల్లవాని పూర్తి ఆరోగ్యమునకు సరిపోవునని పేటెంటు కర్త యిచ్చుచుండును.

## 327 కైలాస వీర్య వజ్ర చూర్ణము

ఇది కాన్పూరులో పేటెంటు చేయబడినది. ఖరీదు 2 రూపాయిలు. "దీనిని యేడు దినములు మాత్రము పుచ్చుకొనుట చేతనే వీర్యస్ఖలనము ఆగి వీర్యము పుష్టిని, వృద్ధిని, జెందగలదు" అని ప్రకటింప బడియున్నది.

అతిమధురము 10 భాగములు, అక్కలకర్ర 1 భాగము, జాజికాయ 1 భాగము, జాపత్రి 1 భాగము, దాల్చినచెక్క 1 భాగము, లవంగములు 1 భాగము, సీమగోరింట విత్తులు 1 భాగము, నల్లనినువ్వులు 1 భాగము. వీటి నన్నింటినీ మెత్తగా చూర్ణ మొనర్చి చూర్ణమునకు సగభాగము కలకండను కలుపుము. దీనిని ఉదయము, సాయంత్రము 6 మాషముల ప్రమాణముండునట్లు పుచ్చుకొనుచుండవలెను.

## 328 సిండోల్ (Sindol)

బొంబాయిలో యిది పేటెంటుచేయుబడినది. మందు విడి విడి పొట్లములగాను, సీసాలతోను విక్రయింప బడుచుండును. ఖరీదు 1-6-0. నొప్పులను యిది తగ్గించగలదని ప్రకటింప బడియున్నది. ఏ స్థితిలో గల్గిన నొప్పియైనను, దీనిని పుచ్చుకొనినట్లోడనే తగ్గిపోగలదు,

కెఫీన్ సిట్రస్ 2 గ్రయినులు. యాంటీఫేబరిన్ 2 గ్రయినులు, యాస్పిరిన్ 2 గ్రయినులు, షుగర్ ఆఫ్ మిల్కు 1 గ్రయిను. మొత్తమును కలిపి ఒక్క పొట్లమును కట్టుము. ఇదే ప్రమాణముతో కావలసిన పొట్లములను తయారు చేసుకొన వచ్చును. ఆవశ్యకతానుసారము దీనిని ఉపయోగింప వచ్చును. నొప్పులు వెంటనే తగ్గిపోగలవు.

## 329 యిండోబామ్

బొంబాయిలో పేటెంటు చేయబడినది. నొప్పులకు పైన వ్రాయుట కిది ఉపయోగింప గలదు. ఒక్క డబ్బీ ఖరీదు 4 అణాలు.

ఫరఫీన్ 1 భాగము, లార్డ్ 2 భాగములు థయిమల్ $\frac{1}{4}$ భాగము, పిప్పరమెంటు $\frac{1}{4}$ భాగము, కర్పూరము $\frac{1}{2}$ భాగము, క్లోరెల్ హైడ్రేట్ $\frac{1}{2}$ భాగము. సుగంధము కొరకు లెమన్ గ్రాస్ ఆయిలు. మొత్తమును కలిపి అరఔన్సు సీసాలలో నుంచుము. దీనిని నొప్పి గల చోట రుద్దవలయును.

## 330 చంద్రప్రభా సుర్మా

లాహోరులో యిది పేటెంటు చేయబడినది. ఒక్క తులము ప్రమాణము గల మందు సీసా ఖరీదు 1 రూపాయి. దీనినివాడిన వో కంటి జాడ్యములు అన్నియు తగ్గిపోగలవనియు, యితర వికారము లేవియు కనుల కాన్పించవనియు ప్రకటింప బడియున్నది.

స్రోతాంజనము 10 భాగములు, కర్పూరము 2 భాగములు, చలువ మిరియాలు 1 భాగము, మిరియాలు $\frac{1}{2}$ భాగము, సముద్రపు నురుగు 4 భాగములు, గైరికము 1 భాగము, మనిశిల 1 భాగము. మొత్తమును కలిపి చక్కగా నూరి సీసాలో నుంచుము. దీనిని సన్నని శలాకవంటి సాధనముతో కనులలో వేయుచుండవలయును.

## 331 శ్వాస సంజీవన్

ఇది ఫీరోజపూర్‌లో పేటెంటు చేయబడినది, 5 తులముల ప్రమాణముగల సీసా ఖరీదు 6 రూపాయిలు 40 దినముల దీనిని పుచ్చుకొనినచో కఫము మలద్వారము వెంటనే పడిపోయి ఆరోగ్యము కల్గునని ప్రకటింపబడి యున్నది. మందు ఉపయోగకరమైనది.

నేతితో కాల్చబడిన యింగువ 1½ భాగము, చిన్న పిప్పళ్ళు. 3 భాగములు. ఉలవ చాయపప్పు 3 భాగములు. వీటిని జిల్లేడు పాలతో నూరి బిళ్ళలను చేయుము. యీ బిళ్ళను నిప్పుపైనుంచి సగము కాలినతోడనే తీసి పొగ పోకుండునట్లు ఒక పాత్రలో పెట్టి మూత వేయుము. పిమ్మట తీసి నూరి జాగ్రత్త పరుపుము. డోసు - 2 మాషముల ప్రమాణము. తేనెతో పుచ్చుకొనవలెను. 40 దినములు పుచ్చుకొనినచో శ్వాసజాడ్యము నిశ్శేషముగా పొలుకువ కనుపడకుండునట్లు తగ్గిపోగలదు.

## 332 తిలా మస్తానా

సద్యఃప్రభావకమగు యీ తైలము శ్రీరంగపురములో పేటెంటు చేయబడినది. తులము సీసా ఖరీదు 5 రూపాయిలు. దీనిని వ్రాసినచో లింగము వంగిపోవుట, వ్రాలిపోవుట, లేపనశక్తి, బిగతరము లేకుండుట మొదలగు అన్ని లింగవికారములు తగ్గిపోగలవు. మందు చాలా ఉపయోగకరమైనది.

సింహపు కొవ్వు, పంది కొవ్వు, యివి ఒక్కొక్కటి 17 భాగములు, లవంగములు, జాపత్రి, కుంకుమ పువ్వు, వెలిగారము. మాలకింకిణీ, ఖురాసాని వాము, యింగువ, కర్పూరము. కర్ణమలము, యింగిలీలము. గన్నేరుపట్ట. యివి ఒక్కొక్కటి 26 భాగములు, ఆరుద్ర పురుగులు, జాజికాయ మొగ్గలు, వసనాభి, తెల్లగురిగింజలు అక్కలకర్ర, దాల్చినచెక్క, యివి ఒక్కొక్కటి 14 భాగములు, ఎండిన జలగలు 7 భాగములు, గద్దపక్షి మాంసము 72 భాగములు,

జీడికాయ 12 భాగములు. ఉమ్మెత్త కొవ్వు 24 భాగములు వెల్లుల్లి 14 భాగములు, వత్సనాభి 14 భాగములు, మెలుగుబంటి కొవ్వు 72 భాగములు. మొత్తమును చక్కగా కలిపి నూరుము. మందు తయారు కాగలదు. దీనిని కొంచెము మెత్తటి అరటి పండుకు రాత్రి పూట వ్రాసి ఉదయమున చూచుము మెత్తని ఆ అరటిపండు గట్టి పడి కఠినముగా నుండినచో మందు తయారైనట్లు యెంచుకొనుము. లేనిచో మందును తిరిగి నూరి పైవిధముగా పరీక్షించుము. అరటి పండును కఠినముగా నుంచగల్గినప్పుడే మందు తయారైనట్లు తలంచుము. అంతమటుకు నూరుచూ మందు తయారైన పిమ్మట తీసి జాగ్రత్త పరుపుము దీనిని లింగముపై వ్రాయుచుండ వలయును. దీనిచే లింగముపై పుండ్లు మొదలగునవి యేమియు పడవు.

## 333 స్వదేశీ యాంటీ ఫ్లొజిస్టిన్

కాన్‌పూర్‌లో యిది పేటెంటు చేయబడినది. ఒక్క డబ్బీ ఖరీదు 12 అణాలు.

మున్సాంబరము 10 భాగములు, తేనె 15 భాగములు, గ్లిజరిన్ 5 భాగములు, కర్పూరము 2 భాగములు వెలిగారము 3 భాగములు. గుగ్గిలము 8 భాగములు. మొత్తమును కలిపి మెత్తగానూరి డబ్బీలో నుంచుము. దీనిని నొప్పిగలచోట రుద్దినచో నొప్పి తగ్గిపోగలదు.

## 334 ప్రసూతి వటి

సూరతులో పేటెంటు చేయబడినది. 64 మాత్రలుగల సీసా ఖరీదు 1 రూపాయి. "స్త్రీలు ప్రసవించిన పిదప వారికిగలుగు సమస్త వ్యాధులు దీనిచే తగ్గిపోగలవు" అని ప్రకటింపబడియున్నది.

ఇంగిలీకము 5 భాగములు, పొంగింపబడిన వెలిగారము 6 భాగములు, అక్కలకర్ర 6 భాగములు, పిప్పలి 6 భాగములు మిరియాలు 6 భాగములు, లవంగములు 6 భాగములు, నల్లమిరియాలు

6 భాగములు, శుద్ధిచేయబడిన నాభి 6 భాగములు. మొత్తమును నూరి ఒక్క గురిగింజ ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. ఒక్క మాత్రను ఉదయము, ఒక్క మాత్రను సాయంత్రము పుచ్చుకొనవలెను.

## 335 కఫ క్యూర్

అలహాబాదులో యిది పేటెంటు చేయబడినది. యింగ్లీషు మందులమ్ము ఒక దుకాణదారునిచే ఇది తయారు చేయబడుచున్నది. 3 ఔన్సుల ప్రమాణముగల సీసా ఖరీదు 1 రూపాయి. దీనిచే వివిధ మాలగు దగ్గులు తగ్గిపోగలవని ప్రకటింపబడి యున్నది.

పొటాస్ బైకార్బ 3 భాగములు, వయినమ్ యిపికాక్ 3 భాగములు, టించర్ స్క్విల్లా 3 భాగములు, స్పిరిట్ అమోనియా ఆరంమేటిక్ 3 భాగములు, స్పిరిట్ క్లోరోఫారమ్ 3 భాగములు, సిరప్ టలూ 6 భాగములు. గ్లిసరోల్ ½ భాగము. అన్నింటిని కలిపి సీసాలో పోయుము. డోసు ¼ డ్రాము నుండి ఒక్కడ్రాము ప్రమాణము వరకు. ఔన్సు నీటితో కలుపుకొని దినమునకు మూడు పర్యాయముల చొప్పున పుచ్చుకొనవలెను.

## 336 స్వప్నారి

జబ్బల్పూరులో యిది పేటెంటు చేయబడినది. స్వప్నస్ఖలనము నిది పోగొట్టకలదు. 20 మాత్రలు గల డబ్బీ ఖరీదు 1 రూపాయి. మందు ఉపయోగకరమైనదే.

శిలాజిత్ 1 భాగము. పొటాసియం బ్రోమైడ్ 2 భాగములు, ఉసిరిక చూర్ణము 6 భాగములు, వంగభస్మము 1 భాగము మొత్తమును మర్రిపాలతో నూరి 3 గురిగింజల ప్రమాణముండునట్లు మాత్రలను చేయుము. ఒక్క మాత్రను రాత్రి పరుండబోవు నప్పుడు పుచ్చుకొనవలయును. స్వప్నదోషము తగ్గిపోగలదు.

## 337 మదన చూర్ణము

ఇది గూడ జబ్బల్‌పూరులోనే పేటెంటు చేయబడినది. 15 తులముల ప్రమాణము గల డబ్బీ ఖరీదు 1-2-0. వివిధములగు ప్రమేహములను, స్వప్నదోషములను, ధాతు వికారములను యిది వశింప జేయగలదని ప్రకటింప బడియున్నది.

అశ్వగంధ చూర్ణము 1 భాగము, వృద్ధదారు చూర్ణము 1 భాగము, శంఖజీరక భస్మము $\frac{1}{2}$ భాగము ధనియాలు 1 భాగము. మొత్తమును కలిపి చక్కగా చూర్ణము చేయుము. డోసు - 4 మాషముల ప్రమాణము. ఉదయము సాయంత్రము పాలతో పుచ్చుకొన వలెను. దీనిని పుచ్చుకొనినచో ప్రమేహము ధాతువికారములు తగ్గిపోగలవు.

## 338 ఆనంద వటి

ఇది లక్నోలో పేటెంటు చేయబడినది 10 మాత్రలు గల సీసా ఖరీదు 1 రూపాయి. యిందు స్తంభన గుణము కలదని ప్రకటింప బడియున్నది.

జాజికాయ 3 భాగములు జాపత్రి 3 భాగములు, సీమ గోరింట విత్తులు 2 భాగములు రుమీమస్తకీ 3 భాగములు నాగ కేసరములు 3 భాగములు బూరుగ బంక 3 భాగములు గుగ్గిలము 2 భాగములు పోక చెక్కలు 3 భాగములు చిన్న యేలకులు 3 భాగములు కుంకుమ పువ్వు 3 భాగము వెమురుప్పు 3 భాగములు ఖురాసాని వాము 3 భాగములు, యాసిడ్ గ్యాలిక్ 4 భాగములు యెక్స్‌ట్రాక్ట్ హైయోశ్యామస్ 8 భాగములు నల్లమందు 2 భాగములు యెక్స్‌ట్రాక్ట్ బెల్లోనా 1 భాగము. మొత్తమును మెత్తగా చూర్ణ మొనర్చి యునుపగోలు గింజల జిగురుతో నూరి మాషప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము, ఆవశ్యకతాను

సారము మైథున సమయమునకు 2 గంగల పూర్వము, ఒక్క మాత్రను పాలతో పుచ్చుకొన వలయును.

## 339 యకృత్ వటి

చింద్వాడలో యిది పేటెంటు చేయబడినది. యకృత్ జాడ్యములపై యిది పనిచేయగలదని ప్రకటింపబడి యున్నది.

నవాసాగరము సైంధవ లవణము. సాంభారు లవణము, సౌవర్చ లవణము వెలిగారము గంట్లకచోరము శొంఠి నల్లకర క్కాయ వాయు విడంగములు మిరియాలు మొత్తమును దంచి చూర్ణమొనర్చి వస్త్ర ఘాళితము పట్టుము. దీనిని గులాబీ రసముతో నూరి 5 గింజల ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. డోసు - 1 మాత్ర. ఉదయము సాయంత్రము నీటితో పుచ్చుకొన వలయును,

## 340 కామేశ్వర చూర్ణము

ఇది బరోడాలో పేటెంటు చేయబడినది. 20 తులముల డబ్బీ ఖరీదు 2 రూపాయిలు.

పల్లేరు 4 భాగములు దూలగొండి విత్తులు 8 భాగములు పిప్పలి మూలము 4భాగములు పిల్లపీచర 4భాగములు నేలగుమ్మడి 8 భాగములు దోసవిత్తులు 8 భాగములు అశ్వగంధ 8 భాగములు, దాల్చినచెక్క 4 భాగములు ఆకుపత్రి 4 భాగములు పెద్దయాల కులు 4 భాగములు ఉసిరిక 4 భాగములు లవంగములు 4 భాగ ములు నాగ కేసరములు 4 భాగములు తామర విత్తులు 4 భాగ ములు గొబ్బి విత్తులు 4 భాగములు తెల్లనేలతాడి 4 భాగములు వెదురుప్పు 4 భాగములు తిప్పసత్తు 4 భాగములు యెర్రచందనము 4 భాగములు పరిక గడ్డలు 4 భాగములు మొత్తమును చక్కగా చూర్ణమొనర్చి కలుపుము, యీ చూర్ణము ½ భాగము బహు

ఫలీ (నక్క నారాయణ చెట్టు) చూర్ణము ½ భాగము కలిప డబ్బీలో నుంచి మూతపెట్టుము. డోసు - 6 మాసముల ప్రమాణము. ఉదయము సాయంత్రము పంచదార కలిపిన పాలతో పుచ్చుకొనవలెను. వీర్యము అత్యమితముగా వృద్ధినొంది ధాతువికారములన్నియును తగ్గిపోగలవు.

## 341 శివా

మధు మేహముపై పనిచేయగల మందు. షోలాపూరులో పేటెంటు చేయబడినది. 40 మాత్రలు గల సీసా ఖరీదు 2-8-0. మందు ఉపయోగకర మైనది.

కోడయిన్ 5 భాగములు లిథియం కార్బ 10 భాగములు. సోడా ఆర్సనస్ 1 భాగము యెక్స్ట్రాక్ట్ నక్సువామిక 7 భాగములు యెక్స్ట్రాక్టు బెల్డోనా 2 భాగములు, యెక్స్ట్రాక్టు జెన్షన్ 15 భాగములు, మొత్తమును నూరి ఒక్క గురిగింజ ప్రమాణముండునట్లు మాత్రలను చేయుము. డోసు - 1 మాత్ర. ఉదయము సాయింత్రము పాలతో పుచ్చుకొనవలెను

## 342 రింగోలా

మిహిగాం లో యిది పేటెంటు చేయబడినది. తామర, తీట, మొదలగు వాటిపై పనిచేయ గలదు. మందు గుడ్డలకు తగిలినను మకరగాదు. తామరయేగాక పేను కొరుకుడు, చుండు, మొదలగు వాటికి గూడ ఉపయోగపడ గలదు.

ఆల్కాహోలు 1 భాగము, గ్లిసరిన్ 1 భాగము, థయిమల్ 1 భాగము, సాలిసైలిక్ యాసిడ్ 1 భాగము. మొత్తమును చక్కగా కలియునట్లు కలుపుము. అవసరమగు నప్పుడు దినమునకు రెండు మార్లు వ్రాయవలయును.

## 343 రక్త రోధక్

ఇటావా ప్రాంతములో పేటెంటు చేయబడినది ఔన్సు సీసా ఖరీదు 1 రూపాయి. మందు విదేశముదే! స్వదేశీ పేరుతో చలామణి చేయబడుచున్నది. మందు గుణము కలది.

టించర్ అర్గట్‌ను ఔన్సు సీసాలలో పోసి విక్రయింపుము. యిదే "రక్త రోధక్". డోసు 10 నుంచి 20 చుక్కల వరకు. నీటితో గాని లేక తగిన అనుపానముతో గాని అవశ్యకతానుసారము యివ్వవలెను.

## 344 షఫూల్ షౌలాదీ

హిందూస్థానీ దవాఖానా ఢిల్లీలో యిది పేటెంటు చేయబడినది. ఆమాశయ వ్యాధులపై యిది పనిచేయ గలదు.

సముద్ర లవణము, సైంధవ లవణము, సౌవర్చ లవణము, స్వాంభారు లవణము. యివి ఒక్కొక్కటి 1 భాగము, ఉసిరిక 2 భాగములు, తాడికాయ 2 భాగములు, కాబూలీ కరక్కాయ 3 భాగములు, పచ్చకరక్కాయ, 2 భాగములు, సోపు 2 భాగములు, కాసినీ గింజలు 2 భాగములు, తిప్ప సత్తు 1/6 భాగము, ఉక్కు చూర్ణము 8 1/12 భాగము. మొత్తమును దంచి చూర్ణ మొనర్చి, వస్త్రఘాళితము పట్టుము. డోసు – 7 మాషముల ప్రమాణము నీటితో గాని, సోపురసముతోగాని పుచ్చుకొన వచ్చును. యీ చూర్ణము ఆమాశయ జీర్ణశక్తులను వృద్ధిపరిచి రక్తరోధ శోధకరమై శక్తిని వృద్ధిపరుప గలదు, రక్త మొలలపై గూడ యిది పనిచేయ గలదు.

## 345 ధాతుస్రావ విదారణ వటి

ఢిల్లీలోని ఒక వైద్యునిచే యిది పేటెంటు చేయబడినది. 60 మాత్రలు గల డబ్బీ ఖరీదు 1–8–0. ప్రమేహపు ప్రారంభ దశలో యిది పనిచేయు గలదు.

వెదురుప్పు, శిలాజిత్తు, రుమీమాస్తగీ, గవ్వాపలుకు సాంబ్రాణి గుగ్గిలము, చలువ మిరియాలు, చిన్నయేలకగింజలు పసుపు తెల్ల నేలతాడి. వీటిని మెత్తగా చూర్ణ మొనర్చి చందన తైలము కలిపి నూరి 3 గురిగింజల ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. డోసు –2 మాత్రలు ఉదయము సాయంత్రము పాలతో పుచ్చుకొనవలయును. ప్రమేహము తగ్గిపోగలదు.

## 346 పీడాంతక్

ఇటావా ప్రాంతములో పేటెంటు చేయబడినది. ½ఔన్సు సీసా ఖరీదు 1 రూపాయి. మంచి గుణము కలదే!

కర్పూరము 1 భాగము, క్లోరెల్ హైడ్రేట్ 1 భాగము, రెంటినీ కలిపి బాగుగా నూరుము. తైలమువలె కాగలదు. దీనిని తేలు కందిరీగ, మొదలగు విష బాధలకు వాతనొప్పులకు పైన వ్రాయవలయును. నొప్పులు తగ్గిపోగవు.

## 347 వ్రణాంతక్

గుజరాతు ప్రాంతములో యిది ప్రచారమందున్నది. 3 ఔన్సుల డబ్బీ ఖరీదు 1 రూపాయి. వివిధములగు వ్రణములపై పనిచేయగలదు, అని ప్రకటింప బడియున్నది. కాని చిన్న చిన్న కురుపులు మామూలు వ్రణములు తెగిన గాయములు, పగిలిన కురుపులు మొదలగు వాటిపై మాత్రమే పనిచేయగలదు. మందును గుడ్డపై వ్రాసి పైన అంటించవలయును.

కాచు 6 భాగములు కంపిల్లము 6 భాగములు గుగ్గిలము 6 భాగములు యింగిలీకము 6 భాగములు ముర్దారుసింగు 3 భాగములు మైలతుత్తము 2 భాగములు మైనము 8 భాగములు నెయ్యి

18 భాగములు. మొదట మైనమును నేతిని కాచి కలుపుము. పిమ్మట మిగిలిన వాటిని కలిపి మెత్తగా నూరి డబ్బీలలో నుంచుము.

### 348 దెబ్బలకు గ్యారంటీ మందు

బొంబాయిలోని ఒకవైద్యుడు యీ మందుచే చాలప్రసిద్ధి నొందయున్నాడు. దెబ్బ యెటువంటిదైనను కేవలము ఒక్క డోసు తోడనే ఆరోగ్యము కలుగగలదు. మందుకు స్థిరమగు ఖరీదేమియు లేదు. శక్తిని అనుసరించి యెవరి యిష్టమువచ్చినట్లు వారు యీయ వచ్చును. మందుచాల గుణయుక్తమైనది.

కమ్మరేగు ఆకుల రసమును నీరు కలవకుండునట్లు తీయుము. యీరసముతో $2\frac{1}{2}$ తులముల ప్రమాణముగల బియ్యమును వండి దెబ్బతగిలిన వానిచే తినిపించి అతని పరుండబెట్టి పైన దుప్పటి కప్పుము, ఆతడు నిద్రలేచునప్పటికి బాధ అంతయు తగ్గిపోగలదు. ఒకవేళ కొద్దిగా మిగిలియున్నచో తిరిగి యిదేవిధముగా యొనర్చినచో బాధ పూర్తిగా తగ్గిపోగలదు.

### 349 సిద్ధ శ్వాస మూలిక (చిత్రకూట్)

ఇది చాల చక్కని ప్రచారమందు దున్నది. చిత్రకూట, లక్ష్మణ్ పర్వతముపై ఒక సాధుమహాశయునిచే యిది తయారు చేయబడుచున్నది. శారద పూర్ణిమ నాటి దినమున మాత్రమే యిది యీయబడుచున్నది. దీనిని ఆ దినమున పుచ్చుకొనుటకై పలుచోట్ల నుండి జనులు వచ్చుచుందురు. మందు చాల ఉపయోగకరమైనదే, కాని అందరికిని ఒకే విధమగు ఫలితమును యిచ్చుచుండుట లేదు.

మద్దిచెట్టు చెక్కను మెత్తగా చూర్ణమొనర్చి వస్త్రఘూళితము పట్టుము. రోగి శారదపూర్ణిమ నాటి దినమున పగలంతయు ఉపవాస ముండవలయును. సాయంత్రమున పాయసమును (రోగి తినతగినంత) తయారుచేసి ఒక పళ్ళెములో దానినిపోసి చంద్రుని కిరణములు సోకు

నట్లుగా దానిని వెన్నెలలో రాత్రి అంతయు వుంచవలయును. రోగి గూడ ఆ రాత్రి నిద్రపోగూడదు. తెల్లవారు జామున షుమారు 4 గంటలకు ఒక్కతులము ప్రమాణముపై చూర్ణమును ఆ పాయసము పై చల్లి దానిని అరుణోదయమునకు ముందుగానే పుచ్చుకొనవలయును పాయసమును పుచ్చుకొనిన పిదప రోగి 12 గంటల వరకు నిద్దురపోగూడదు. యిలా ఒక్కమారు పుచ్చుకొనుటవలననే రోగికి లాభము చేకూరగలదు. ఒక్కొక్కరికి యిలా ప్రతిసంవత్సరము పుచ్చుకొనవలసి వచ్చుచున్నది.

## 350 శ్వాశ మూలిక

బహ్రాయిచ్ జిల్లా (U. P.) నుంచి దీని ప్రకటన తరుచు పత్రికలలో ప్రకటింపబడు చుండును. మందు మాత్రమే భేదము. దీనిని గూడ పైవిధముగానే శారద పూర్ణిమ నాటి దినమున పుచ్చుకొనవలయును. దీనిని యిప్పుడు చాలమంది వాడుకలోనికి తెచ్చుచున్నారు. మరికొందరు దీనిని (V P P) ల ద్వారా యితర ప్రాంతములకు గూడా పంపుచున్నారు.

తెల్ల ఉత్తరేణి వేరును చేతితోగాని లేక కర్రతోగాని పెళ్ళగించి తెచ్చి నీడన యెండబెట్టుము, పిమ్మట దీనిని రాతికల్వములో వేసి నూరి మెత్తగా చూర్ణము చేయుము. చూడుడు! మందు తయారైనది! దీనిని ½ తులము ప్రమాణము పైమందును పుచ్చుకొని నట్లే పుచ్చుకొనవలయును.

## 351 శ్వాసౌషధము

ఇది చంద్రనగరములో అభయకుమార బెనర్జీ చే తయారు చేయబడుచున్నది. ఒక్క వారమునకు సరిపోవుమందు ఖరీదు 5 రూపాయిలు. దీనిచే ఆరోగ్యము కల్గుచున్నది. కాని మందు తాత్కాలికమగు గుణమును మాత్రమే యిచ్చుచున్నదో, లేక శాశ్వతమగు గుణమును యిచ్చుచున్నదో తెలియుట లేదు.

అమావాస్యనాటి రాత్రి వెలుతురు సోకకుండునట్లు ఉత్తరేణి ఆకులను కావలసి నన్నింటిని తీసికొని రమ్ము. ఇవి 2 తులములు, మిరియాలు $1\frac{1}{2}$ తులము కలిపి వెలుతురు తగలనిచోట నూరి యేడు మాత్రలను చేయుము. యీ మాత్రలను గూడ యేమాత్రము వెలుతురు తగలనిచోటనే ఆరునట్లు చేసి జాగ్రత్త పరుపుము. రోగికి మందీయవలసిన అవసర మొచ్చినప్పుడు ఆ రోగిని కృష్ణపక్షములోని నవమిరోజు రాత్రి చీకటి ప్రదేశములో కూర్చుండబెట్టి ఒక్క మాత్రను యిచ్చికొద్దిగా నీటిని త్రాగింపుము. ఇటులనే మిగిలిన మాత్రలను అమావాస్య నాటికి పూర్తియగునట్లుగా ప్రతిదినము రాత్రిపూట చీకటి ప్రదేశములోనే రోగిచే పుచ్చుకొనునట్లుగా చేయుము. శ్వాస తగ్గిపోగలదు. రోగికి శ్వాసానుకూల మగు ఆహారమును యిచ్చుచుండ వలయును.

N, B. సూర్యుని వెలుతురుగాని, దీపపువెలుతుగాని మందుకు యేమాత్రము తగుల గూడదు. సర్వకార్యములు చీకటిలోనే పూర్తి కావలయును.

## 352 యెండురోగపు మందు

భూతవైద్యులు, పకీరులు, డప్పులవాళ్ళు, తరుచుగా యీరోగమునకు చికిత్స చేయుచుందురు. వీరు కేవలము ఒకరిద్దరి భోజనము తోడనే తృప్తిజెంది మందును యిచ్చుచుందురు. నేడు మానవ సంఘము స్వార్థాంధతలతో నిండియున్నది. యిక హిందూజాతి విషయము ప్రత్యేకముగా జెప్పవలయునా! కన్నులుండిన గుడ్డిదికదాయిది!

ఒక నత్తగుల్లను తీసుకొని అందు కొద్దిగా బియ్యపు గింజలను, నీరును, వుంచి వుడికించుము. పిదప రోగియగు బాలకునకు దీనినిపెట్టి అతని గుడ్డలను విడిపించి స్నానము చేయించి క్రొత్త గుడ్డలను కట్టుము. పిల్లవాడు ఆరోగ్యము జెంది పుష్టి నొందగలడు.

నత్తగుల్ల, మరియు శంఖపు పురుగులలో యెండుగోగములను పోగొట్టగలశక్తి కలదను విషయమును గుర్తు తెచ్చుకొనుడు. ఆపురుగులు అందు లేకపోయిననూ వాటి నివాసస్థానములకు వాటికి గూడ ఆ శక్తి గలదు.

## 353 హిమ్‌రోడ్స్ క్యూర్

ఇది శ్వాస జాడ్యములను తగ్గించుటకు ధూమ్రపానమును చేయించగల అమెరికా దేశపు మందు. చాల పరిశ్రమతో ప్రపంచమం దంతటను యిది విక్రయించ బడుచున్నది. మందు గుణము కలదే.

పొటాషిం నయిట్రేట్ 240 భాగములు, లోబీలియా 240 భాగములు, స్ట్రమోనియం పత్రములు 240 భాగములు, నల్ల తేయాకు 240 భాగములు, ఆయిల్ అనీసీ 1 భాగము. మొత్తమును కలిపి జాగ్రత్త పరుపుము. ఆవశ్యకతానుసారము ఒక్క మాష ప్రమాణము దీనిని ధూమపాన మొనర్చినచో వెంటనే శ్వాస జాడ్యము తగ్గిపోగలదు.

## 354 తేలు విషమునకు గ్యారంటీ మందు

బర్మాలో దీనికి విశేషమగు ప్రచారము గలదు. తేలు విషమునకిది గ్యారంటీ మందని యెంచబడుచున్నది, 5 తులముల ప్యాకెట్టు ఖరీదు 8 అణాలు.

వేపచెట్టు చెక్కలోపలి భాగమును నీడన యెండబెట్టి చూర్ణ మొనర్చి ప్యాకెట్టులలో నుంచుము. డోసు-3 నుండి 6 మాషముల వరకు. దీనిని కొత్త చిలుములోనుంచి ధూమపాన మొనర్చినచో తేలువిషము వెంటనే దిగిపోగలదు. గవ్వతో కాదగిన మందు.

## 355 జర్మనీ యాంటీ స్థైమేటిక్ పేపర్

ఈ పేపరు ధూమపాన మొనరించుటకై జర్మనీనుండి దిగుమతి చేయబడుచున్నది. దీనిని ఉపయోగించినచో శ్వాసజాడ్యము తగ్గిపోగలదు.

పొటాషియం నయిట్రేట్ 16 భాగములు, యక్స్ట్రాక్ట్ స్ట్రామోనియం 10 భాగములు, సరేకం ఆల్బం 20 భాగములు, పొంగులు వచ్చునట్లు కాచిన నీరు 84 భాగములు, మొత్తము మందులన్నింటినీ సీసాలో కలిపి అందు బ్లాటింగు పేపరు ముక్కలను నానబెట్టి తీసి యెండించుము. వీటిని ఆవశ్యకతానుసారము బీడీమాదిరిగా చుట్టుకొని కాల్చి ధూమపానము చేయవలయును

## 356 క్లీబత్వ హరణ్

ఈ తరళౌషధము రాంచీలో ప్రసిద్ధి నొందియున్నది. రెండు ఔన్సుల సీసా ఖరీదు 4 రూపాయిలు. ఇది వివిధములగు ధాతు రోగములను, ప్రమేహములను, నపుంసకత్వమును, పోగొట్టునని ప్రకటింప బడియున్నది. కాని ధాతుపుష్టికి మటుకు పనిచేయగలదు.

భరణిక చెట్టు చెక్కను తెచ్చి పాతాళయంత్రము ద్వారా తైలమును తీయుము. డోసు – 1 మాష ప్రమాణము. చెక్కెరతో కలిపి పుచ్చుకొనవలయును. మందును పుచ్చుకొను కాలములో పుష్టికరమగు ఆహారమును పుచ్చుకొనుచుండ వలెను.

## 357 యిం సానిటీ పౌడర్

అల్లాహాబాదులో యిది పేటెంటు చేయబడినది. ఒక్క డ్రాము పరిమాణము గల పొట్లము ఖరీదు 12 అణాలు. దీనిచే రకరకములగు పిచ్చి, నిద్ర రాకుండుట, తల వేడి యెక్కుట, హిస్టీరియా లక్షణములు, మొదలగునవి తగ్గిపోగలవని ప్రకటింపబడి యున్నది. మందు చాల ఉపయోగకరమైనది.

సర్పగంధను తీసికొని చూర్ణము చేయుము. డోసు - డ్రాము ప్రమాణము. 3 తులములు కలకండ 10 తులముల నీరు కలిపి తయారుచేసిన షర్బత్తులో మందును కలిపి ఉదయమున, స్నానానంతరము పుచ్చుకొనవలెను. ఇటులనే ప్రతి దినము పుచ్చుకొనుచుండవలెను. మందును పుచ్చుకొను కాలములో వేడిచేయునట్టియు, తేలికగా జీర్ణమగు నట్టియు పుష్టికరము లగు ఆహారమును పుచ్చుకొనుచుండవలెను. గుణమీయ గలిగిన స్వదేశపు మందు

## 358 ద్రాక్ష రస మధు

బొంబాయిలోని ఒక వైద్యునిచే యిది పేటెంటు చేయబడినది. 8 ఔన్సుల సీసా ఖరీదు 1 రూపాయి. ఇది సంపూర్ణముగా ధాతు రోగముల నన్నింటిని ప్రమేహములను పోగొట్ట కలదని ప్రకటింపబడియున్నది.

ద్రాక్ష రసము 2 ఔన్సులు, తేనె 1 ఔన్సు, లోహభస్మము (మామూలుది) 2 గింజల యెత్తు. మొత్తమును కలిపి సీసాలో పోయుము. డోసు-1 డ్రాము. నీటితో కలుపుకొని దినమునకు 2 పర్యాయములు పుచ్చుకొన వలయును. దీనిచే సాఫీగా విరేచనమగుచూ ఆహారము చక్కగా జీర్ణమై శక్తి వృద్ధి నొందగలదు.

## 359 కఫ క్యూర్

బెంగుళూరులో యిది పేటెంటు చేయబడినది. 3 ఔన్సుల సీసా ఖరీదు 1 రూపాయి. దీనిచే వివిధములగు దగ్గులు తగ్గిపోగలవని ప్రకటింపబడి యున్నది. కాని పొడి దగ్గులపై యేమాత్రము పని చేయలేదు.

వాకుడు చెట్టు పంచాంగములు, అడ్డసరపుఆకులు, ఒక బాండీలో వేసి పాతాళ యంత్రము ద్వారా వీటి రసమును తీయుము. ఈ రసము 1 భాగము తేనె 1 భాగము సైంధవ లవణము 1/40 భాగము

మొత్తమును కలుపుము. మందు తయారు కాగలదు. డోసు 1 గ్రాము. ప్రతి దినము - ఉదయము, మధ్యాహ్నము, సాయంత్రము మందును ఆకులో వేసుకొని నాకుచుండ వలయును దగ్గుతగ్గిపోగలదు.

## 360 పులిపిరి

తంజావూరిలో యిది తయారు చేయబడుచున్నది. 4 గ్రాముల పరిమాణము గల సీసా ఖరీదు 8 అణాలు. మందు గుణముకలదే!

నువ్వులనూనె 10 భాగములు జీడివిత్తులు 5 భాగములు. మణిశిల 4 భాగములు మొదట నూనెను పొయ్యిమీద నుంచి జీడి విత్తులను వేసి అవి కాలునంత వరకు వుంచి వాటిని తీసి వేయుము. తరువాత అందు మణిశిలను కలిపి నిప్పుపైనుంచి దించి కొద్దిగా వేడి తగ్గిన పిమ్మట నీటితోనున్న కళాయిలో పోయుము. నీటిపై పచ్చని ద్రవము కానుపించ గలదు, దీనిని తీసి సీసాలో నుంచుము. పులి పిర్లు వెచ్చటనున్నను దీనిని వ్రాయుము. యెండి వూడి పోగలవు.

## 361 రెడ్ ఆయింట్ మెంటు

అజ్మీరులో పేటెంటు చేయబడినది. ఒక్క ఔన్సు డబ్బీ ఖరీదు. 2 అణాలు. వివిధములగు పుండ్లు దీనిచే తగ్గిపోగలవు. మందు ఉపయోగకరమైనదే!

కంపిల్లము 1 భాగము, గంగసింధూరము 1 భాగము శ్రీవాసము 1 భాగము ముర్దారుసింగు 1 భాగము అంటు సూరేకారము 1 భాగము మైనము 2 భాగములు ఆవనూనె 4 భాగములు. మొత్తమును కలిపి చక్కగా నూరి ఆయింటుమెంటును తయారు చేయుము. దీనిని గుడ్డపై వ్రాసి పైన వేసినచో వ్రణములు గడ్డలు మచ్చలు, ఉపదంశములు బొబ్బలు కురుపులు చర్మవ్యాధులు మొదలగునవి తగ్గిపోగలవు.

## 362 మ్యాజిక్ పెయిన్ కిలర్

ఇది ప్రసిద్ధమగు యింగ్లాండు దేశపు మందు. ఒక్క ఔన్సు సీసా ఖరీదు 2 రూపాయిలు. దీనిని వాడినచో నొప్పులు అతి త్వరగా తగ్గిపోగలవు.

ఆల్కాహాలు 8 భాగములు, లవంగాల తైలము 1/32 భాగము, కొకీన్ 1/12 భాగము, పిప్పరమెంటు ఆయిల్ 1/64 భాగము, క్లోరోఫారము 4 భాగములు, యీథర్ సల్ఫ 4 భాగములు మొత్తమును కలుపుము. డోసు-2 చుక్కల నుండి 10 చుక్కల వరకు. పంచదారతో కలుపుకొని పుచ్చుకొనవలయును. వివిధములగు నొప్పులు తగ్గిపోగలవు. నొప్పులకిది యింద్రజాలమువంటిది.

## 363 హిస్టీరియా క్యూరు

"మృగీ కా బమ్" అను పేరుతో యిది బొంబాయిలో తయారు చేయబడి విక్రయింపబడు చున్నది. 8 ఔన్సులసీసా ఖరీదు 1-12-0. దీనిని విడువక మూడు మాసములు పుచ్చుకొనినచో హిస్టీరియా తగ్గిపోగలదని ప్రకటింపబడి యున్నది. కాని ప్రకటనానుసారము గుణమీయ జాలదు. ఫిట్సు మటుకు వెంటనే ఆగిపోగలవు. కాని మందును విడిచిన కొద్ది దినములకే కొంత కొంత మందికి తిరిగి జాడ్యలక్షణములు కానుపించుచున్నవి. ఒక్కొక్కరికి ఆరోగ్యము గూడ కల్గుచున్నది.

పొటాసు బ్రోమయిడ్ 6 డ్రాములు. అమోనియా కార్బొనైట్ 93 గ్రయినులు, పంచదార షర్బత్తు 3 డ్రాములు, ఆక్వా క్లోరోఫారము 7 ఔన్సులు, మొత్తమును కలుపుము. డోసు — 1 టీ చంచా ప్రమాణము. నీటితో సాయంత్రము, ఉదయము, మధ్యాహ్నము పుచ్చుకొనవలెను. పుష్టికరమగు ఆహారమును పుచ్చుకొనుచుండవలెను.

## 364 మాగ్నేటిక్ టూత్ యిక్ డ్రాప్స్

పంటినొప్పిపై పనిచేయగల యీ మందు లండనులో తయారు చేయబడి ప్రపంచమం వంతటను విక్రయింపబడు చున్నది. ఒక్క ఔన్సుసీసా ఖరీదు 1-2-0 మందు గుణముకలదే. యింద్రజాలము వలె పనిచేయగలదు.

కర్పూరము 1 భాగము, యీథర్ సల్ఫు 1 భాగము, నవాసాగరము 1 భాగము, లెడనమ్ 1 భాగము, టించర్ ఆఫ్ సినేమన్ 1 భాగము, ఆయిల్ క్లోజ్ 1/8 భాగము, మొత్తమును కలుపుము. దీనిని దూదిపుల్లతో నొప్పిగల పంటివద్ద వ్రాయుము. నొప్పి వెంటనే తగ్గిపోగలదు.

## 365 కోల్డ్ క్రీమ్

ముఖ సౌందర్యమును వృద్ధిపరచుటకై ఉపయోగింప బడుచున్న యీ మందు యింగ్లాండులోని ఒక ఫార్మసీలో తయారు చేయబడు చున్నది. బజారులో యిది చాలా విరివిగా విక్రయింపబడుచుండును.

బాదము ఆయిలు 425 భాగములు, లెనాలిన్ 185 భాగములు, తెల్లని మైనము 62 భాగములు, స్పెర్ మా సిటీ 62 భాగములు, బోరిక్ యాసిడ్ 45 భాగములు, రోజు వాటరు 30 భాగములు. మొదటి నాలుగువస్తువులను చక్కగా కలియునట్లు చేయుము. పిమ్మట బోరిక్ యాసిడ్‌ను, రోజువాటరులో కలిపి కరుగునట్లు చేసి అందు కలుపుము. క్రీమ్ తయారు కాగలదు.

## 366 యింద్రజాలపు రంగు

కలకత్తాలో యిది "తిలస్మీ రంగ్" అను పేరుతో ప్రచారమందున్నది. అచ్చటి పత్రికలలో దీని ప్రకటనను తరుచుగా చూడవచ్చును. ఇది గుడ్డలకు మొదట రంగునిచ్చి కొద్దిసేపటిలోనే ఆ

రంగుతోపాటు గుడ్డలలోని మురికనిగూడా హరించివేయ గలదు గుడ్డలు స్వచ్ఛముగా తయారు కాగలవు.

యేదో ఒక యర్ర రంగును కొద్దిగా ఫినాయిల్ (చుక్కలు)తో కలిపి నూరుము. పిమ్మట దీనిని కొద్దిగానున్న నీటిలో కలిపి కరిగించి అందు అమోనియా కార్బ్ను గూడా కొద్దిగా కలుపుము. దీనిని యీమాదిరిగానే సీసాలలో నుంచవచ్చును. లేక యెండించి పౌడరు వలె తయారు చేయవచ్చును.

## 367 తేనె

ఈ నకలు తేనె అమృతసర్‌లో తయారు చేయబడుచున్నది. శేరు ఖరీదు 12 అణాలు.

తెల్ల చక్కెర 5 భాగములు, నీరు 1 భాగము, స్వచ్ఛమగు తేనె 1 భాగము, పిప్పరమెంటు ఆయిల్ 1/2000 భాగము. మొదట చక్కెరలో నీటిని 2 భాగములు కలిపి పాకము తయారు చేసి చల్లార్పుము. పిమ్మట అందు తేనె, పిప్పరమెంటు, కలుపుము, తేనె తయారు కాగలదు. దీనిని బాహ్య పరీక్షలతో నకలు తేనె యని కనిపెట్టుట చాల కష్టము. పృథక్కరణానంతరము గాని తెలుసుకొన లేము.

## 368 వాతరోగమునకు గ్యారంటీ మందు

ఇది "అక్సీర్ గరియా" అను పేరుతో జలంధరులోని ఒక వైద్యునిచే తయారు చేయబడుచున్నది ప్రసిద్ధమగు మందు. 100 మాత్రలు గల డబ్బీ ఖరీదు 2-8-0. మందు చాల ఉపయోగకర మైనది.

పసుపు, సైంధవ లవణము, కరక్కాయ, యివి ఒక్కొక్క భాగము. వెర్రిపుచ్చ రసము 40 భాగములు, కలిపి నూరి మాత్రలు

చేయదగిన స్థితికి వచ్చినప్పుడు _ దీనిని రెండు గురిగింజల ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. దీనిని ఉదయము, సాయంత్రము, ఒక్కొక్క మాత్రను పుచ్చుకొనినచో వాతరోగము తగ్గిపోగలదు. వాతబాధలచే విసుగు జెందినవారు గూడ దీనిని కొద్దిగా పుచ్చుకొనిన తోడనే ఆరోగ్యమును జెందగలరు.

## 369 నొప్పులకు గ్యారంటీ మందు

ఇది గూడ పై చోటనే "అక్సీర్ దర్ద్" అను పేరుతో తయారు చేయ బడుచున్నది. యిది వివిధములగు నొప్పులపైనను పనిచేయ గలదని ప్రకటింపబడి యున్నది. కాని వాతనొప్పులపై మటుకు పనిచేయ గలుగు చున్నది,

వెర్రిపుచ్చ వేరు చూర్ణము 1 భాగము, విషముష్టి 1 భాగము రెంటిని తేనెతో నూరి 2 గురిగింజల ప్రమాణముండునట్లు మాత్రలను చేయుము. ఒక్క మాత్రను అప్పుడు తోడిన నీటితో పుచ్చుకొన వలయును. కడుపునొప్పిపై విశేషముగా పనిచేయ గలదు.

## 370 బ్లాక్ ఆయింటుమెంటు

విజయనగరములోని ధర్మచికిత్సాలయములో తయారుచేయ బడుచున్నది. మందు ఉచితముగా యీయబడుచుండును. మందు చక్కని గుణము కలది. రకరకములగు పుండ్లు, వ్రణములు తగ్గిపోగలవు.

గంగసిందూరము ౪ భాగములు, మైలతుత్తము 1 భాగము, నూనె 6 భాగములు, వేపపత్తులు ౯ భాగములు, మైనము 3 భాగములు. మొదట నూనెలో వేపవిత్తులను వేసి బాగుగా కాచుము. చల్లార్చిన పిదప వీటిని నూరి పిమ్మట మిగిలిన వాటిని అందు వేసి మొత్తమును మెత్తగా నూరుము. దీనిని డబ్బీలలో నుంచి యిక ఉపయోగించుకొన వచ్చును. పుండు యెటువంటిదైనను మెండిపోగలదు,

## 371 అర్శ వటిక

కలకత్తాలో పేటెంటు చేయబడినది. 40 మాత్రలు గల డబ్బీ ఖరీదు 2 రూపాయిలు. దీనిచే మొలలు, రక్త మొలలు, రెండు విధములగునవీ-తగ్గిపోగలవని ప్రకటింపబడి యున్నది. కాని మందు మొలల జాడ్యమును పూర్తిగా నయము చేయలేదు. రక్తపు పతనమును మటుకు ఆపివేయు గలదు.

కాచు 10 భాగములు, రసాంజనము 10 భాగములు, గైరికము 10 భాగములు, మిరియాలు 10 భాగములు, వీటిని మెత్తగా చూర్ణ మొనర్చి 120 భాగముల గుంటకవలర రసముతోనూరి 40 మాత్రలను చేయుము. ఆవశ్యకతానుసారము ఉదయము, సాయంత్రము, ఒక్కొక్క మాత్రను నీటితో పుచ్చుకొనవలెను.

## 372 కలరా శత్రు

రంగూనులో యిది పేటెంటు చేయబడినది. 50 మాత్రలు గల సీసా ఖరీదు 3 రూపాయిలు. మందు గుణము కలదే!

నల్లమందు, యింగువ, కర్పూరము, మిరపగింజలు. వీటి సమాన భాగములను బాగుగా నూరి 2 గురిగింజల ప్రమాణముండు నట్లు మాత్రలను చేయుము ఆవశ్యకతానుసారము ఒక్కమాత్రను సోపు రసముతో గాని, ఉల్లిరసముతోగాని పుచ్చుకొనవలెను. గుణము కనుపించనిచో అరగంట కొక మాత్ర చొప్పున యిచ్చుచుండవలెను. ఆరోగ్యము కల్గిన పిమ్మటనే ఆహారమును యివ్వవలెను. యింతమటుకు మూడవ మాత్రను వాడవలసిన ఆవశ్యకత కానుపించలేదు, మందు అమోఘమైనది.

## 373 ప్లీహ హర

రంగూనులో పేటెంటు చేయబడినది. 100 మాత్రలు గల డబ్బీ ఖరీదు 1-8-0. మందు ఉపయోగకరమైనదే!

పరిశుభ్రమగు గుగ్గులము 1 భాగము, నవాసాగరము 1 భాగము ఉంటు సూరేకారము 1 భాగము, పొంగింపబడ్డ వెలిగారము 12 భాగములు, మొత్తమును నూరి 3 గురిగింజల ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. ప్రతి దినము ఉదయము, సాయంత్రము, 2. 2. మాత్రలను నీటితో యిచ్చుచుండవలెను.

## 374 పాచకచూర్ణ

రంగూనులో యిది అధికముగా విక్రయించ బడుచున్నది. ఆహారమును త్వరగా జీర్ణమగునట్లుచేసి, జీర్ణ అమాశయ శక్తులను వృద్ధి పఱుప గలదు. 5 తులముల మందుగల సీసా ఖరీదు 1-0-0.

అల్లపు రసము 1 భాగము, పిల్లరు చేయబడిన నిమ్మరసము 1 భాగము, సైంధవ లవణము 1 భాగము. వీటిని నిప్పుపైనుంచి కాచి గాని, యెండలోనుంచిగాని రసము యింకి చూర్ణ మగునట్లు చేయుము. డోసు - 1 మాష ప్రమాణము. నీటితో పుచ్చుకొన వలెను.

## 375 పౌష్టిక పిల్సు

కాన్‌పూరులో పేటెంటు చేయబడినది. 40 మాత్రల ఖరీదు 3-8-0. ముఖ్యముగా యిది లింగశిథిలత్వ మునకును, మస్తిష్క శక్తిని వృద్ధిపరచుటకును, వీర్య స్రావములకును, యింకను వివిధము లగు అనేక గుణములకును పనిచేయునని ప్రకటింపబడియున్నది.

ముత్యపు భస్మము 1 భాగము, ముత్యపుచిప్ప భస్మము 1 భాగము, దుప్పికొమ్ము భస్మము 1 భాగము, * అఖీక్ భస్మము 1 భాగము, వెండిరేకులు 1 భాగము, కుంకుమపువ్వు 3 భాగములు. కస్తూరి 1/12 భాగము. వీటిని 12 భాగముల మొగలి రసముతో నూరి 2 గురిగింజల ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము.

* యూనానీ వస్తువు.

డోసు - 1 మాత్ర. ఆవశ్యకతాను సారము తగిన అనుపానముతో పుచ్చుకొనవలయును.

## 376 జీవన్

గిర్‌గావ్, బొంబాయిలో యిది పేటెంటు చేయబడినది. ½ ఔన్సు సీసా ఖరీదు 12 అణాలు. ఇది అమృతధారవలె ఆమాశయ జాడ్యముల పైనను, విషకీటకముల బాధలకును పనిచేయగలదని ప్రకటింపబడి యున్నది.

థయిమల్ 1 భాగము, పిప్పరమెంటు 1 భాగము, కర్పూరము 2 భాగములు, లవంగాల తైలము ¼ భాగము, యేలకుల తైలము 1 భాగము. మొత్తమును కలుపుము. ద్రావకమువలె కాగలదు. డోసు – 4 చుక్కలు. తగిన అనుపానముతో పుచ్చుకొనవలెను.

## 377 ప్రదరారి

దర్భాంగలో యిది పేటెంటుచేయబడినది. 20 తులముల ప్రమాణముగల డబ్బీ ఖరీదు 2 రూపాయిలు. ప్రదర జాడ్యములపై పనిచేయగలదని ప్రకటింపబడి యున్నది.

దేశీయ చక్కెర 18 తులములు, * హీరాదుఖీ 2 తులములు. రెంటినీ కలిపి మెత్తగానూరి సీసాలో నుంచుము. డోసు – 6 మాషముల ప్రమాణము. ఉదయము సాయంత్రము పాలతో పుచ్చుకొనవలయును.

## 378 తిలా

గుజరాతు ప్రాంతములో యిది ప్రచారమందున్నది. అర ఔన్సు సీసా ఖరీదు 4 రూపాయిలు. మందు గుణము కలదే.

---

* యూనానీ వసువు.

దాల్చినచెక్క, మాజుఫలము, యింగిలీకము, కాల్చబడిన చేపయెముకలు, యివి ఒక్కొక్క భాగము, నల్లమందు, తెల్లగురిగింజ, వసనాభి, యివి ఒకటిన్నర భాగములు, యర్రలు 7 భాగములు, ముల్లంగి విత్తులు, గాజర విత్తులు 4, 4, భాగములు, అడవి మిరియాలు, సింహపు క్రొవ్వు, ఉడుముక్రొవ్వు, మాలకింకిణీ విత్తులు, 7, 7, భాగములు. వీటిలో చూర్ణము చేయతగిన వాటినన్నింటినీ చూర్ణ మొనర్చి అందు మిగిలిన వాటిని కలిపి పాతాళయంత్రము ద్వారా వీటినుండి తైలము తీయుము. ఆవశ్యకతానుసారము రాత్రి పూట లింగముపై వ్రాసి పైన తమలపాకులను చుట్టి దారముతో కట్టుము. ఉదయముననే వేడినీటితో కడుగుచుండుము. యిటులనే ప్రతిదినము చేయుచుండవలెను. చిన్న చిన్న పొక్కులు లేచినచో మందును ఆపి పైన చేమంతి నూనెను వ్రాయుము. పొక్కులు నయమైన పిమ్మట మందును తిరిగి వాడుకొనవలెను. దీనిని విడువక. ఒక్క మాసము వరకు ఉపయోగించినచో లింగవికారము లన్నియు తగ్గి వాజీవరణశక్తి వృద్ధినొందగలదు.

## 379 అక్సీర్ వాజీకరణ్

లాహోరులో పేటెంటుచేయబడినది. 5 మాషముల ప్రమాణము గల మందు ఖరీదు 5 రూపాయిలు. ఆకలిని వృద్ధిపరచి వాజీకరణశక్తిని వృద్ధిచేయునని ప్రకటింపబడి యున్నది. ప్రకటనానుసారము మందు పనిచేయగలదు. యిది మరే మిశ్రితౌషధము గాదు! తామ్రభస్మము మాత్రమే! యిది యిటుల తయారు చేయబడినది.

5 తులముల రాగి రజనును జిల్లేడు పాలతో యెడ తెగకుండా ప్రతిదినము క్రొత్తపాలు పోయుచూ పన్నెండు దినములు నూరి గోలీ వలె చేసి యెండబెట్టుము. ఒక్క శేరు (80 తులములు) తెల్లగలిజేరు పంచాంగములను నిమ్మరసముతో నూరి గోలీకి కవచమిచ్చి సీలమన్ను యిచ్చి గజపుటము పెట్టుము. తెల్లని భస్మము తయారు కాగలదు. దీనిని జాగ్రత్త పరుపుము. డోసు - వడ్లగింజ ప్రమాణము నుండి

2 వడ్లగింజల ప్రమాణము వరకు. తమలపాకుల రసముతో పుచ్చుకొనవలెను. మందును పుచ్చుకొను కాలములో పాలను పెరుగును అధికముగా ఉపయోగించు కొనవలయును.

## 380 ఆమాశయాంతక వటి

ఢాకాలో యిది పేటెంటు చేయబడినది. యేడు మాత్రలు గల డబ్బీ ఖరీదు 1 రూపాయి. ఆమాశయతిసారము, రక్తాతిసారము, ఆమవికారము, వీట్లపై యిది అమోఘముగా పనిచేయగలదని ప్రకటింపబడియున్నది. ప్రకటనానుసారము మందు చక్కగా పనిచేయగలదు.

లవంగములు 6 మాషములు. జాజికాయ 3 మాషములు, తెల్లజీలకర్ర 3 మాషములు. హారీతకీ 3 మాషములు, సీమకరక్కాయ 6 మాషములు, సైంధవలవణము 6 మాషములు. మొత్తమును నీటితో నూరి 6 మాత్రలను చేయుము. డోసు – 1 మాత్ర. కొడిశ చెక్క 10 తులములను రెండున్నర శేర్ల నీటితో కలిపి 10 తులములు మిగులునంతవరకు కాచి దించి వడకట్టుము. పైమాత్రను యిందులో కలిపి ఉదయముననే పుచ్చుకొనవలయును. యిటుల యేడు దినములు పుచ్చుకొనినచో వ్యాధి పూర్తిగా తగ్గిపోగలదు.

## 381 పాతుర్ధకారి వటిక

కలకత్తాలో పేటెంటు చేయబడినది. 25 మాత్రలు గల డబ్బీ ఖరీదు 1 రూపాయి, వివిధజ్వరములపై పనిచేయగలదు. మలేరియా జ్వరములపై మటుకు మరింత తీవ్రముగా పనిచేయగలదు. మందు ఉపయోగకరమైనది.

హారతాళము, మైలతుత్తము, పాషాణచూర్ణము, గంధకము, శుద్ధిచేయబడనట్టి వీటి నన్నింటిని కలబంద రసముతో ఆరుగంటలు మర్ధించి ముద్దగా చేసి పైన శీలమన్ను యిచ్చి గజపుటము పెట్టుము.

చల్లారిన పిమ్మట తీసి నీటితో నూరి 2 గురిగింజల ప్రమాణముండు నట్లు మాత్రలను చేయుము. డోసు - మాత్ర. దినమునకు 3 పర్యాయములు అల్లపు రసముతో యివ్వవలెను. జ్వరము వచ్చి యున్నప్పుడు మాత్రము మందును వాడ గూడదు.

## 382 మలేరియా వటి

దీనాజ్‌పూర్‌లో పేటెంటు చేయబడినది. 40 మాత్రలు గల సీసా ఖరీదు 1-8-0. మలేరియా వికారములు తగ్గిపోగలవు. మందు లాభదాయకమైనది.

నిమ్మఆకుల చూర్ణము, కాకరాకుల చూర్ణము, తులసియాకుల చూర్ణము, మిరియాలు, సహదేవి, వీటి సమాన భాగములను తుమ్మపూల రసముతో రెండు దినములునూరి మూడు గురిగింజల ప్రమాణముండునట్లు మాత్రలను జేసి నీడన యెండబెట్టుము. మందు తయారు కాగలదు. డోసు - 1 మాత్ర, తేనెతోగాని, కాకరాకు రసముతోగాని, అల్లపు రసముతో గాని, యివ్వవలెను. వివిధములగు జ్వరములు, తగ్గిపోగలవు. అల్లపు రసపు అనుపానముతో పిత్తజ్వరములు తేనె, తులసిఆకుల రసపు అనుపానముతో పిత్త, కఫ, జ్వరములు గోమూత్రపు అనుపానముతో కఠినములగు యకృత్, ప్లీహజ్వరములు తగ్గిపోగలవు.

## 383 ప్రదరాంతక చూర్ణము

బరోడాలో యిది పేటెంటు చేయబడినది. పావుశేరు ప్రమాణము గల డబ్బీ ఖరీదు 3 రూపాయిలు. ఇది వివివిధములగు ప్రదర జాడ్యముల పైనను, సోమరోగము పైనను, బలహీనము, మొదలగు వాటిపైనను పనిచేయగలదని ప్రకటింపబడియున్నది.

తుమ్మ ఆకుల చూర్ణము 8 భాగములు, కలకండ 8 భాగములు, పల్లేరు ఆకుల చూర్ణము 4 భాగములు. వీటిని కలిపి

నూరుము. డోసు – 6 మాషముల ప్రమాణము. ఉదయము, సాయంత్రము నీటితో పుచ్చుకొన వలయును.

## 384 స్వర సుధారక్

అంబాలాలో యిది పేటెంటు చేయబడినది. 100 మాత్రలు గల సీసా ఖరీదు 2 రూపాయిలు. దీనిచే జిహ్వా జాడ్యములు, కంఠ రోగములు, తగ్గి స్వరము మధురముగా నుండ గలదని ప్రకటింపబడి యున్నది. మందు ఉపయోగకరమైనదే!

బ్రాహ్మి, అతిమధురము, యేలకివిత్తులు, బాదము పప్పు, సొరవిత్తులలోని పప్పు, కతీరాగోందు, కలకండ, మొత్తము సమాన భాగములను బోడసరపు రసముతో నూరి మాష ప్రమాణముండు నట్లు మాత్రలను చేయుము దీనిని నోటిలో నుంచుకొని రసమును మ్రింగుచుండ వలెను.

## 385 శ్వేత కుష్ఠ

లహేరియా సరాయ్‌లో యిది పేటెంటు చేయబడినది. శ్వేత కుష్ఠుపై పనిచేయగలదని తరుచుగా ప్రకటింపబడు చుండును. మందు నూతనముగా పుట్టినట్టి చిన్న చిన్న మచ్చలపైన మటుకు పనిచేయ గలదు.

గంధకము 1 భాగము, వెలిగారము, 1 భాగము గుగ్గిలము 1 భాగము, తగరపు రజను 1 భాగము. వీటిని నిమ్మకాయ రస ముతో నూరి మాత్రలను చేయుము. మాత్రలను నీటితో సాది మచ్చలపైన వ్రాయ వలయును.

## 386 అస్థార్థవ కురార్

బొంబాయిలో పేటెంటు చేయబడినది. 10 తులముల డబ్బీ ఖరీదు 1 రూపాయి. మందు రక్త ప్రదరములపై పనిచేయ గలదు.

లొద్దుగచెక్క 6 భాగములు, ఉసిరిక 2 భాగములు, రుమీమస్తగీ 2 భాగములు, వేయించబడిన శనగలు (పొట్టులేనివి) 5 భాగములు. మొత్తమును మెత్తగా చూర్ణ మొనర్చుము. డోసు - 6 మాషముల ప్రమాణము. ఉదయము, సాయంత్రము. వేసవి కాలములో కాసినీ రసముతోను, చలికాలములో నీటితోను పుచ్చుకొనవలయును.

## 387 దంత శూలఘ్న

కలకత్తాలో పేటెంటు చేయబడినది. అరఔన్సు సీసా ఖరీదు 8 అణాలు. పంటి నొప్పులపై పనిచేయ గలదు.

క్రియసోట్ 20 భాగములు. కార్బాలిక్ యాసిడ్ 40 భాగములు, దాల్చిన అరఖు 10 భాగములు, కర్పూరము 50 భాగములు మొత్తమును కలుపుము. దీనిని దూదిపుల్లతో నొప్పిగల పంటిపైన వ్రాయ వలయును.

## 388 కర్ణ శూల హరణ్

కలకత్తాలో పేటెంటు చేయబడినది. అరఔన్సు సీసా ఖరీదు 8 అణాలు. ఇది వివిధములగు కర్ణరోగములను పోగొట్టునని ప్రకటింప బడియున్నది. దీనిచే చెవిలోని పోటు, పుండు, చీము కారుట, మొదలగునవి యన్నియు తగ్గిపోగలవు.

నువ్వులనూనె $2\frac{1}{2}$ భాగములు, కర్పూరము 1 భాగము, క్లోరెల్ హైడ్రేట్ $\frac{1}{2}$ భాగము, వీటిని కలిపి సీసాలో నుంచుము. దీనిని 4, 5, చుక్కలు చెవిలో వేయవలెను,

## 389 సుధ

మద్రాసులో పేటుంటు చేయబడినది. ఇది వివిధములగు జాడ్యముల పైనను అమోఘముగా పనిచేయు గలదని ప్రకటింప బడి

యున్నది. ఒక్క ఔన్సు సీసా ఖరీదు 1 రూపాయి. అమృతధారకు నకలుగా యిది తయారు చేయబడినది. అనుపాన బలముతో పని చేయ గలదు.

కర్పూరము 1 భాగము, పిప్పరమెంటు ఆయిల్ ½ భాగము, థయిమల్ ½ భాగము, సోపు తైలము 1/4 భాగము, కార్బాలిక్ యాసిడ్ 1/12 భాగము, రెక్టిఫయిడ్ స్పిరిట్ 1 భాగము. మొత్తమును కలుపుము. డోసు 2 నుండి 6 చుక్కలవరకు. నీటితో పుచ్చుకొన వలయును.

## 390 విషమ జ్వర హరణ్

ఆగ్రాలో యిది పేటెంటు చేయబడినది. 4 ఔన్సుల సీసా ఖరీదు 1 రూపాయి. ఇది వివిధములగు జ్వరములను తగ్గించ గలదని ప్రకటింప బడియున్నది. మలేరియా జ్వరములపై మటుకు విశేషముగా పనిచేయ గలదు.

లయికర్ అర్సనిక్ 30 చుక్కలు, మెగ్నిషియా సల్ఫు ½ ఔన్సు, టించర్ నక్సువామిక 25 చుక్కలు, నేలవేము క్వాథము 3 ఔన్సులు. మొత్తమును కలిపి సీసాలో పోసి అందు క్వైనైను 1 డ్రాము, సల్ఫ్యూరిక్ యాసిడ్ డైల్యూట్ 1 డ్రాము, కలుపుము. మందు తయారు కాగలదు. ఇది 16 డోసులకు సరిపోవును. ఒక్క డోసు మందును ఒక్క తులము నీటితో కలిపి పుచ్చుకొన వలెను.

## 391 చర్మరోగ హరణ్

కలకత్తాలో పేటెంటు చేయబడినది. 40 మాత్రలుగల సీసా ఖరీదు 2-8-0. దీనిని పుచ్చుకొనినచో చర్మరోగములన్నియు తగ్గిపోగలవు. మందు ఉపయోగకర మైనది.

యాసిడ్ ఆర్సనియస్ 1/100 భాగము, ఫెర్రీసల్ఫ్ 1 భాగము కాల్షియం సల్ఫేట్ ¼ భాగము, యెక్స్‌ట్రాక్ట్ జెంక్షన్ 2 భాగములు. మొత్తమును కలిపి 3½ గ్రయినుల ప్రమాణ ముండునట్లు మాత్రలను చేసి మాత్రలపై సుగర్ కోటింగ్ నిమ్ము. డోసు - 1 మాత్ర. ఆహారము తీసికొనిన పిదప దినమునకు రెండు మార్లు పుచ్చుకొనవలయును.

## 392 వాయు దమన వటి

పై మందు తయారు చేయబడు చున్నచోటనే యిది గూడ తయారు చేయబడుచున్నది. 100 మాత్రలుగల సీసా ఖరీదు 4 రూపాయిలు. దీనిచే కలరా, వాతవికారములు, వాత నొప్పులు, అతిసారము, హిస్టీరియా, కడుపునొప్పి, మొదలగునవి తగ్గిపోగలవు. మందు గుణము కలదే!

యింగువ 1 గ్రయిను, కర్పూరము 1 గ్రయిను, నల్లమందు 1 గ్రయిను, పిప్పలి చూర్ణము 1 గ్రయిను. మొత్తమును బాగుగా నీటితో నూరి ఒక్క మాత్రను చేయుము. యిటులనే కావలసిన వాటిని తయారు చేసుకొనవచ్చును. దీనిని ప్రతిదినము నీటితో పుచ్చుకొనుచుండ వలెను.

## 393 Chicken pox

అజ్మీరులోని ఒక డాక్టరుచే యిది పేటెంటు చేయబడినది. 40 మాత్రలు గల సీసా ఖరీదు 5 రూపాయిలు. ఇది ఆటలమ్మకును. దాని ఉపలక్షణములకును పనిచేయగలదని ప్రకటింపబడి యున్నది. మందు మామూలుగా పనిచేయ గలదు.

బేజా నఫ్ ఫాల్ 1 భాగము, కార్బోలిగనీ 4 భాగములు, పిప్పరమెంటు ఆయిల్ ½ భాగము. మొత్తమును కలిపి 5 గ్రయి

నుల ప్రమాణ ముండునట్లు మాత్రలను చేసి పైన జలోటినీ తో కోటింగు నిమ్ము. డోసు – 1 మాత్ర. దినమునకు 3 పర్యాయ ములు పుచ్చుకొనవలయును.

## 394 డయేరియా క్యూర్

బొంబాయిలో పేటెంటు చేయబడినది. ఒక్క సీసా ఖరీదు 1–8–0 అతిసారమును, సంగ్రహణిని, పోగొట్టునని ప్రకటింపబడి యున్నది. మందు అతిసారముపై మటుకు చక్కగా పనిచేయగలదు.

బిస్మత్ బేటానఫ్ థాలస్ 1½ గ్రయిను, బిస్మత్ నయిట్రేటస్ 2½ గ్రయినులు, పల్వ యిపికా కుయేనా కాంపౌండ్ 1 గ్రయిను. మొత్తమును కలిపి 5 గ్రయినుల ప్రమాణ ముండునట్లు మాత్రను చేయుము. అటులనే కావలసిన వాటిని తయారు చేసు కొనవచ్చును. డోసు – 1 నుండి 6 మాత్రల వరకు. నీటితో పుచ్చుకొనవలెను.

## 395 అతిసార హరణ్

బొంబాయిలోని ఒక డాక్టరుచే యిది పేటెంటు చేయబడినది ఒక్క సీసా ఖరీదు 1–8–0. మందు ఉపయోగకర మైనది.

బిస్మత్ నయిట్రస్ 3 గ్రయినులు, పల్వ రిహాయీా కాంపౌండు 1 గ్రయిను, సోడా బైకార్బ 2 గ్రయినులు మొత్తమును కలిపి ఒక్క మాత్రను చేయుము. ఇటులనే కావలసిన వాటిని తయారు చేసుకొనవచ్చును. డోసు – 1 నుండి 3 మాత్రలవరకు. భోజనాంతరము రెండు మార్లు నీటితో పుచ్చుకొనవలయును.

## 396 నేత్ర బిందు

కాల్ బాదేవీ, బొంబాయిలో పేటెంటు చేయబడినది. ఔన్సు సీసా ఖరీదు 8 అణాలు, దీనిచే కన్నుల యెరుపు, మంటలు, మస కలు, నీరు కారుట, కలుగుట, మొదలగునవి యన్నియు తగ్గిపోగల వని ప్రకటింపబడి యున్నది.

యాసిడ్ బోరిక్ 60 గ్రయినులు, జింక్ సల్ఫు ½ గ్రయిను, రోజు వాటరు 1 ఔన్సు, నల్లమందు 1 గ్రయిను. మొత్తమును కలుపుము. దీనిని 4, 5, చుక్కలు కంటిలో వేయుచుండవలెను.

### 397 ఉన్మాద్

భూలేశ్వర్, బొంబాయిలో పేటెంటు చేయబడినది. 4 ఔన్సుల పరిమాణముగల సీసా ఖరీదు 3 రూపాయిలు. దీనిచే పిచ్చి హిస్టీరియా, ఫిట్సు, మొదలగునవి తగ్గిపోగలవని ప్రకటింపబడి యున్నది. చాల స్వల్ప ఖరీదుకే యిది తయారు కాగలదు.

సోడా బ్రోమయిడ్ 1 భాగము, పొటాస్ బ్రోమయిడ్ 1 భాగము, అమోనియా బ్రోమయిడ్ 1 భాగము, సోడా ఆర్సనీటెస్ లేక హైడ్రేట్ 1/60 భాగము, ఆక్వాక్లోరోఫారము 14 భాగములు. మొత్తమును కలుపుము. డోసు – ½ డ్రాము ప్రమాణము. ఔన్సు నీటిలో కలుపుకొని పుచ్చుకొనవలయును, మందును పుచ్చుకొను కాలములో పుష్టికరమగు ఆహారమును పుచ్చుకొనుచుండవలెను. మంచి ఉపయోగకరమైనది.

### 398 స్వప్నదోష వటిక

ఆయుర్వేద ఫార్మసీ, కలకత్తాలో యిది పేటెంటు చేయబడినది. 30 మాత్రలుగల సీసా ఖరీదు 2 రూపాయిలు.

త్రిఫలము చూర్ణము 9 భాగములు, కర్పూరము ½ భాగము, బెల్లము 2 భాగములు. మొత్తమును కలిపి నూరి ఒక్కమాష ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. డోసు – 1 మాత్ర. రాత్రి పరుండబోవునప్పుడు చల్లని నీటితో పుచ్చుకొనవలయును.

### 399 కుష్ఠ ధ్వంసక పిల్స్

కలకత్తాలో పేటెంటు చేయబడినది. ఒకటిన్నర తులముల ప్రమాణము మాత్రలుగల సీసా ఖరీదు 2–8–0. శ్వేతకుష్ఠుపై యిది పనిచేయగలదని ప్రకటింపబడి యున్నది.

హరతాళము 3 భాగములు, బావంచాలు (మంచివి) 12 భాగములు. రెంటినీ గోమూత్రముతో బాగుగానూరి మాషప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. మాత్రలను గోమూత్రముతో అరగదీసి మచ్చలపైన వ్రాయవలయును. దీనితో పాటు రక్తపరిశుభ్రతకొరకై లోపలికి ఖదిరారిష్ట పుచ్చుకొనవలెను.

## 400 కుష్ఠ

కలకత్తాలో పేటెంటు చేయబడినది. ఒక్క ఔన్సు పరిమాణము చూర్ణముగల సీసా ఖరీదు 4 రూపాయిలు. ఇది గూడ కుష్ఠుపై పనిచేయగలదని ప్రకటింప బడి యున్నది.

బావంచాలు 10 భాగములు, హరతాళము 4 భాగములు, మనిసిల 1 భాగము మైలతుత్తము 2 భాగములు, చిత్రమూలము 2 భాగములు, మొత్తమును గోమూత్రముతో నూరి యెండించి చూర్ణము చేయుము. డోసు – 3, 4, గురిగింజల ప్రమాణముగాని, ఒక్క మాష ప్రమాణము గాని మందును గోమూత్రముతో కలిపి మచ్చలపై వ్రాసి యెండలో నుండవలయును. కుష్ఠు తగ్గిపోగలదు గుణము కనుపించునంతవరకు యిట్లులనే చేయుచుండ వలయును.

## 401 శ్వేతకుష్ఠ ఔషధ్

జంషెడ్‌పూరులో యిది పేటెంటు చేయబడినది. 5 తులముల ప్రమాణము గల సీసా ఖరీదు 2–8–0 యిదిగూడ శ్వేతకుష్ఠుపై పనిచేయ గలదని ప్రకటింప బడియున్నది. కాని అందరికిని దీనిచే సమమగు లాభము చేకూరుట లేదు.

చిత్రమూలము 1 తులము, తంటెపువిత్తులు 1 తులము, హరతాళము 1 తులము, బావంచాలు 2 తులములు. మొత్తమును మెత్తగా చూర్ణము చేయుము. దీనిని గోమూత్రముతో కలిపి మచ్చలపైన వ్రాయవలెను పుండ్లుపడి మచ్చలు నయము కాగలవు.

## 402 కఫ పిల్స్

అమెరికాలో యిది పేటెంటు చేయబడినది. 45 మాత్రలు గల సీసా ఖరీదు 1-12-0. మందు దగ్గుపై పనిచేయ గలదని ప్రకటింప బడియున్నది. ప్రకటనానుసారము మందు పనిచేయ గలదు

కర్పూరము 1 గ్రయిను యక్స్‌ట్రాక్ట్ హై శ్యామస్ 1 గ్రయిను. రెంటినీ కలిపి ఒక్క మాత్రను తయారు చేసి పైన సుగర్ కోటింగు నిమ్ము. ఇటులనే కావలసిన మాత్రలను తయారు చేసుకొన వచ్చును. డోసు - 1. 2. మాత్రలను ఆవశ్యకతానుసారము పుచ్చుకొన వలెను.

## 403 శ్వాస్ ఔషధ్

ఇది టాంజూరులోని ఒక సుప్రసిద్ధ మహాశయునిచే పేటెంటు చేయబడినది. వీరి వద్దకు జనులు ప్రతిదినము తండోప తండములుగా వచ్చుచుందురు. మందు గుణము కలదే!

వెలుతురు చెట్టు కాడలు లేతవి. యీ కాడలకు 16 వ భాగము ఖురాసాని వాము. రెంటినీ కలిపి పాతాళ యంత్రము ద్వారా వీటినుండి తైలము తీయుము. మందు తయారు కాగలదు.

డోసు - 3, 4, మాషముల ప్రమాణము, రొట్టెపై చిలకరించి దినమునకు 3 పర్యాయములు పుచ్చుకొన వలయును. బియ్యపు ఆహారమును తినువారిపై మటుకు యిది పనిచేయ గల్గుచున్నది. యితరులపై పనిచేయుట లేదు.

## 404 శోధిత్ హరడ్

యూనానీ మెడికల్ హాల్ అలహాబాదులో పేటుంటు చేయ బడినది. 50 కిరక్కాయలు గల డబ్బీ ఖరీదు 5 అణాలు. ఇది వివిధములగు ఉదర రోగముల పైనను పనిచేయ గలదని ప్రకటింప బడియున్నది. పుచ్చుకొనుటకు రుచిగా గూడ నుండగలదు.

కరక్కాయల చూర్ణము 3 తులములు. శొంఠి 2 మాషములు మిరియాలు 2 మాషములు పిప్పళ్ళు 2 మాషములు సైంధవ లవణము 1తులము సాంబారు లవణము 6మాషములు సమ్మరుప్పు 1 తులము మొత్తమును నీటితో నూరి కరక్కాయలవలె చేసి యెండబెట్టుము. దీనిని ఉపయోగించు చున్నచో ఆహారము జీర్ణమగుచూ పాచనశక్తి వృద్ధి నొందగలదు.

## 405 గలిత్ కుష్ఠు

కలకత్తాలో యిది పేటెంటు చేయబడినది ఒక్క తులము ప్రమాణముగల మందు సీసాఖరీదు 2 రూపాయిలు. ఇది కుష్ఠుపై పనిచేయ గలదని ప్రకటింపబడి యున్నది. ప్రథమావస్థనుండియే దీనిని ఉపయోగించు చుండవలెను.

శుద్ధి చేయబడిన హరతాళము శుద్ధిచేయబడిన మనిసిల. రెంటినీ సమభాగములను శరావ సంపుట మొనర్చి 5 శేర్ల యెరుడు పిడకలతో పుటము బెట్టుము భస్మము కాగలదు. డోసు 1 గురిగింజ ప్రమాణము. రెండుతులముల చంద్ర కషాయముతో పుచ్చుకొనవలెను. కుష్ఠుపై మంచు పనిచేయ గలదు.

## 406 గనేరియా

సాత్ రాస్తా బొంబాయిలోని వైద్యునిచే పేటెంటు చేయబడినది. ఒక్క వారములోనే గనేరియా నశింపగలదని ప్రకటింపబడి యున్నది. రెండు ఔన్సుల పరిమాణముగల సీసా ఖరీదు 5 రూపాయిలు. నూతనముగా వచ్చినట్టి గనేరియాపై మటుకు యిది పని చేయుచున్నది.

శిలాజిత్తు 2 డ్రాములు తిప్పసత్తు 2 డ్రాములు, వెమరుప్పు 2 డ్రాములు, శ్రీవాససత్వము 2 డ్రాములు, తెల్ల యేలకులు 2 డ్రాములు శుద్ధి చేయబడిన అమరశిల గంధకము 2 డ్రాములు, తెల్లకాచు 2 డ్రాములు చందన తైలము 2 డ్రాములు. మొత్తమును కలిపి చూర్ణము చేయుము.

డోసు 1½నుండి 3 మాషముల ప్రమాణము వరకు. నీటిని సమభాగముగా కలిపిన పాలతో పుచ్చుకొన వలయును.

## 407 సంగ్రహణీ ఔషధ్

లాహోరులో పేటెంటు చేయబడినది. 60 మాత్రలు గల సీసా ఖరీదు 3 రూపాయిలు. ఇది పూర్తిగా ఉదరరోగములపైనను, సంగ్రహణీ అతిసారములపైనను పనిచేయ గలదని ప్రకటింప బడి యున్నది.

ఇంగిలీకము 1 భాగము రుమీమస్తగీ 2 భాగములు, నల్ల మందు 1 భాగము, వెకుడుప్పు 1 భాగము తెల్ల యేలకగింజలు 2 భాగములు పుదీనా ఆకులు 6 భాగములు, సోపు 6 భాగములు. మొత్తమును చూర్ణ మొనర్చి దానిమ్మగింజల రసముతో నూరి అర్థ మాష ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. డోసు - 2 మాత్రలు. దినమునకు 3 పర్యాయములు. చల్లతో పుచ్చుకొన వలయును.

## 408 నేత్రాంజనము

ఢిల్లీలో, అబ్దుల్ నజీజ్ ఖా చే తయారు చేయబడుచున్నది. దీనిచే కండ్ల కలకలు, మంటలు, కలుగుట, నీరు కారుట, యెర్ర బడుట, పొరలు. మొదలగునవి యన్నియు తగ్గిపోగలవని ప్రకటింప బడి యున్నది. ఒక్క తులము మందు ఖరీదు 2 రూపాయిలు.

సౌవీరాంజనము 20 భాగములు, సముద్రపు నురుగు 1 భాగము, అంటుసూరేకారము 1 భాగము, వెలిగారము 1 భాగము, సోడాప్పు 1 భాగము, పప్పళ్లు 4 భాగములు, మొత్తమును చూర్ణ మొనర్చి నిమ్మకాయ రసముతో నూరి యెండబెట్టుము. దీనిని ఉదయమున, సాయంత్రము కండ్లలో వేయుచుండవలెను.

## 409 ధాతు పుష్టి పిల్స్

కథియవాడులో పేటెంటు చేయబడినది. 40 మాత్రలుగల సీసా ఖరీదు 1-4-0. ఇది ప్రమేహమును పోగొట్టునని ప్రకటింప బడియున్నది.

జాజికాయ, జాపత్రి, మాజుఫలము, రుమీామస్తగీ, నాగ కేసరములు, అక్కలకర్ర రసము, తెల్ల యేలకగింజలు, వెదురుప్పు, ఖురాసానివాము, మొత్తము సమాన భాగములను చూర్ణ మొనర్చి మర్రిపాలతో నూరి అర్థమాష ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. డోసు - 1 మాత్ర, ఉదయము సాయంత్రము పాలతో పుచ్చుకొనవలయును. వీర్యము పుష్టినొంది శక్తి వృద్ధి నొందగలదు.

## 410 స్తంభన వటి

లాహోరులో పేటెంటు చేయబడినది. 30 మాత్రలు గల సీసా ఖరీదు 2 రూపాయి. ఇది స్తంభన గుణముపై పనిచేయగల దని ప్రకటింపబడియున్నది. ప్రకటనానుసారము మందు చక్కగా పనిచేయగలదు.

కుంకుమపువ్వు, శిలాజిత్తు, నల్లమందు, రుమీామస్తగీ, నాగ కేసరములు, అక్కలకర్ర, బలా బీజములు. వీటి సమాన భాగ ములను నూరి 3 గురిగింజల ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. డోసు - 1 మాత్ర. మైథున సమయమునకు ఒక్కగంట ముందుగా పుచ్చుకొని పది తులముల ప్రమాణము పాలను త్రాగ వలయును.

## 411 ఉపదంశ వటి

బొంబాయిలో పేటెంటు చేయబడినది. ఒక్కవారము దిన ములలో ఉపదంశమును పోగొట్ట గలదని ప్రకటింపబడియున్నది. 40 మాత్రలు గల సీసా ఖరీదు 3 రూపాయిలు. మందు చక్కగా పని చేయగలదు దీనిని ఉదయము సాయంత్రము చలినీటితో పుచ్చుకొన వలయును.

కర్పూరము 40 గ్రయినులు, రస కర్పూరము 40 గ్రయినులు, తెల్లకాచు 40 గ్రయినులు, తెల్లనేలతాడి 40 గ్రయినులు. మొత్తమును మెత్తగా చూర్ణమొనర్చి తమలపాకుల రసముతో నూరి రెండు గురిగింజల ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము రోగి ముందుగా విరేచనములకు మందును పుచ్చుకొని పిమ్మట దీనిని పుచ్చుకొనవలెను. ఆశ్చర్య కరముగా పనిచేయగలదు.

## 412 జ్వర ఔషధ్

నాగపూర్‌లో పేటెంటు చేయబడినది. ఒక్క డబ్బీ ఖరీదు 1 రూపాయి. ఇది సర్వ విధ జ్వరములను నశింప చేయగలదని ప్రకటింపబడి యున్నది. కాని మలేరియా జ్వరములపై దప్ప పని చేయలేను. మలేరియా జ్వరమునకు మటుకు యిది పరమ శత్రువని చెప్పవచ్చును.

పిప్పళ్లు పెద్ద జీలకర్ర నేలవేము, యివి ఒక్కొక్క భాగము, పొంగించబడిన యెర్ర పటికి 2 భాగములు. మొత్తమును కాకరాకు రసముతో నూరి అర్ధమాష ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. డోసు 1 మాత్ర. దినమునకు మూడు పర్యాయములు. నీటితో పుచ్చుకొనవలెను.

## 413 సౌ గ ం ధి క వ టి

భూసా మండీ, లక్నోలో యిది పేటెంటు చేయబడినది. ఇది జిన్‌టాన్ వలె పనిచేయగలదని ప్రకటింపబడి యున్నది. 100 మాత్రలు గల సీసా ఖరీదు 4 అణాలు.

అతి మధురపు సత్వము 6 భాగములు, దాల్చిన చెక్క 1/4 భాగము, లవంగాలు 1/12 భాగము, తెల్ల యేలక గింజము 1/6 భాగము, పిప్పరమెంటు ఆయిల్ 1/12 భాగము, మొత్తమును బాగుగా నూరి ఒక్క గురిగింజ ప్రమాణ ముండునట్లు మాత్రలను చేయుము. దీనిని నోటిలోనుంచుకొని రసమును మ్రింగుచుండవలెను.

## 414 కర్పూరీ మంజన్

ఇది మామూలుగా బజారులలో విక్రయింప బడుచుండును. ఒక్క డబ్బీఖరీదు 2 అణాలు.

సీమసున్నము 1 భాగము, కాస్టాయిల్‌సోపు 1/16 భాగము గడుకుల పంచదార 3/2 భాగము, కమలాఫలముల పైనితొక్కలు 1/8 భాగము, కర్పూరము 2/32, మొత్తమును చూర్ణ మొనర్చుము. దీనితో పండ్లు తోముకొనుచున్నచో పండ్లు తెల్లగానుండి నోటి రోగములన్నియు తగ్గిపోగలవు.

## 415 కపూరీ కోల్డ్ క్రీమ్

ఇదిగూడ అత్యధికముగా విక్రయింపబడు చున్నది.

బాదము ఆయిలు 8 భాగములు, స్పెర్ మాసిటీ 1 భాగము, కర్పూరము 1 భాగము, రోజు వాటరు 5 భాగములు, వెలిగారము ½ భాగము, మైనము 1 భాగము, సుగంధముకొరకు గులాబీఅత్తరు.

మొదట మైనమును కరిగించి స్పెర్‌మాసిటీతో కలుపుము. పిమ్మట కర్పూరమును, బాదము ఆయిలును కలిపి పైదానిలో వేసి మొత్తమును నిప్పుపై నుంచుము. వెలిగారమును రోజువాటరులో కలిపి కరగించి పైదానిలో కొద్దికొద్దిగా వేయుచూ క్రముక్కతో బాసందీవలె తయారగునంత వరకు కలియబెట్టు చుండుము. దీనిని ముఖముపై రుద్దుకొనుచున్నచో మచ్చలు, మొటిమలు మొ॥ తగ్గును

## 416 కర్పూరీ వరప్

బజారులలో తరుచుగా విక్రయింపబడు చుండును.

మైనము 16 భాగములు, బెంజాయిడ్ లార్డ్ 48 భాగములు, కర్పూరపు చూర్ణము 8 భాగములు, సువాసన కొరకు కొద్దిగా యేదైనను అత్తరు, మొదట ఒకటవ, రెండవ వస్తువులను కలిపి కరిగించుము. తరువాత మూడవ వస్తువును, అత్తరును కలిపి అచ్చులలో (మూసలలో) పోయుము. ఇది గట్టిగానున్న మైనమువలె తయారు కాగలదు. దీనిని గుడ్డలలో నుంచినచో చిమ్మటలు మొదలగు వానిచే గుడ్డలు చెడక సువాసనగా నుండగలవు.

## 417 ముసప్పి

ఇది హిందూస్తానీ దవాఖానా, ఢిల్లీలో పేటెంటు చేయబడినది. 3 ఔన్సుల ప్రమాణముగల మందు సీసా ఖరీదు 8 అణాలు. ఇది రక్తమును పరిశుభ్రము చేయగలదని ప్రకటింపబడి యున్నది. మందు ఉపయోగకరమైనది.

నేలవేము, తిప్పసత్తు, వేపచెక్క, సమాన భాగములనుదంచి దీనికి పదిరెట్లు అధికముగా నున్న నీటిలో వేసి సగము మిగులునంత వరకు కాచి దించి వడగట్టుము. పిమ్మట దీనిని కళాయిలోపోసి నిప్పుపైనుంచి లేహ్యమువలె అగునంత వరకు కాచుము తరువాత దించి తీసి యెండపెట్టుము. దీనిని 9 మాషముల ప్రమాణమును 6⅓ మాషముల ప్రమాణముగల తేనెతోనూరి సీసాలోనుంచి అందు లయికర్స్ ఆర్సనిక్ 20 చుక్కలు కలుపుము. మందు తయారు కాగలదు. డోసు – 2 డ్రాములు. దీనిని 10 తులముల నీటితో గాని పాలతోగాని కలిపి పుచ్చుకొనవలెను.

## 418 గ్యారంటీ హిస్టీరియా హరణ్

సిల్‌హాట్‌లోని ఒక డాక్టరుచే యిది పేటెంటు చేయబడినది. యీ డాక్టరు చాల ఉత్తమ చికిత్సకుడని తలంచబడు చున్నాడు. వీరివద్దకు ప్రతిదినము యీ జాడ్యచికిత్స కొరకై రోగులు చాలా దూర ప్రదేశములనుండి వచ్చుచుందురు. రోగివద్దనుండి నగదుగా 50 రూపాయిలు పుచ్చుకొనును. దాన ధర్మములకొరకు, బ్రాహ్మణ సమారాధన కొరకు మరికొంత ఖర్చు పెట్టించును. మందు రెండు రకములుగా నున్నది. 1 వ మందు 3 దినముల వరకును, 2 వ మందు 40 దినముల వరకును పుచ్చుకొనవలెను. వీటిని వాడుకొని నచో హిస్టీరియా తగ్గిపోగలదు.

1 వ మందు, జున్ను, నీడలో యెండించబడిన నల్లతేలు (Scorpion), కాళజెర్రి, వీటి సమాన భాగములను చాల మెత్తగా చూర్ణ మొనర్చుము. దీనిని 2, 3, గురిగింజల ప్రమాణము మూడు దినముల వరకు నస్యమువలె ఉపయోగించవలెను.

2 వ మందు, కొండపిండి చెట్టు చూర్ణము 20 భాగములు, తేనె 100 భాగములు. రెంటినీ కలిపి లేహ్యమువలె తయారు చేయుము. డోసు – 2½ తులముల ప్రమాణము. 40 దినముల వరకు ఉదయము సాయంత్రము పుచ్చుకొనుచుండ వలెను. యీ రెండు మందులను ఉపయోగించినచో హిస్టీరియా తగ్గిపోగలదు.

## 419 అస్థి జోడ్

మోతె బజారు, బొంబాయిలో విరిగిన ఎముకలను బాగు చేయుచున్న ఒక వైద్యునిచే యీ మందు పేటెంటు చేయబడినది. యెముకలు విరిగిన రోగులందరు యీతని వద్దకు వచ్చుచుందురు. ఇతడు విరిగిన యెముకలను సరిగా నుండునట్లు చేసి కట్టు గట్టి మందును ఒక్కమాటు తినిపించి 12 గంటల పిమ్మటనే కట్టును విప్పివేయును. రోగి ఆరోగ్యమును జెందగలడు. దీని ఖరీదు 5 రూపాయిలు. మందును అతని వద్దనే పుచ్చుకొన వచ్చును. లేక యింటికి తీసుకొని వెళ్ళి పుచ్చుకొన వచ్చును, మందు చాల ఉపయోగకర మైనది.

ఒక్క తులము నల్లేరును (అప్పుడు కోసినది) తీసుకొని చాల మెత్తగా నూరుము. దీనిని 2 తులములు ఆవువెన్నతోగాని, లేక నేతితోగాని, కలిపి ఒక్క గంట వరకు తిరిగి నూరుము. మందు తయారు కాగలదు. ఇది ఒక డోసుకు సరిపోవును. దీనిని రోగిచే తినుపింపవలయును. మూడు గంటల కాలములో యెముక తిరిగి అంటుకొనునని ఆతడు చెప్పుచుండును.

## 420 దేశాయీ విరేచన్

ఇది గోవాలో ప్రసిద్ధి నొంది యున్నది. ఆయుర్వేదిక్, యెల్లోపతిక్ మందులు పనిచేయలేని స్థితిలోగూడ ఈమందు తప్పక పనిచేయఁ గలదు. ఒక్క ఔన్సు మందు ఖరీదు 1 రూపాయి.

శుద్ధి చేయబడని నేపాళముల లోని పప్పు. అంటు సూరేకారము, బాదము పప్పు. చిన్న పిప్పలి. మొత్తము సమానభాగము

లను చాల మెత్తగా నూరుము. దీనిలో కొద్దిగా నేయి కలిపి కొంచె ముగా వేయించుము. డోసు – 2 గురిగింజల ప్రమాణము. వేడి నీటితో పుచ్చుకొన వలెను. విరేచనమాయిన పిమ్మట ప్రతిసారి రెండుగుక్కలు మంచినీటిని త్రాగుచుండ వలెను. విరేచనము లగు చుండును. విరేచనములు ఆగవలెనన్నచో వేడి పాలలో పంచ దారను కలిపి పుచ్చుకొన వలెను.

## 421 శ్వాస్

ఇది నీలగిరి యందున్న ఒక మద్రాసీ సాధువుచే పేటెంటు చేయబడినది. ప్రతి పూర్ణిమ దినమునను అత డీ మందును యిచ్చు చుండును. చాల దూర ప్రదేశములనుండి గూడ శ్వాసరోగులు యీ మందును పుచ్చుకొనుటకై వచ్చుచుందురు. మందును పరీ క్షించి వ్రాయుచున్నాము. దీనికి ఖరీదు పుచ్చుకొనుట చాల అను చితము. ఉచితముగా యిచ్చుట చాల మంచిది. మందు ఉప యోగకర మైనది.

తుమ్మగోదును బాగుగా చూర్ణ మొనర్చి వస్త్రఘాళితము బట్టుము. చూడుము! మందు తయారైనది! అవసరమగు నప్పుడు రోగి తినగలిగినంత అన్నమును. బియ్యముతో వండి దానిని నాలుగు భాగములుగా చేయుము. అందలి 1 భాగమును ఒక పళ్ళెములో పల్చగా నుండునట్లు పరచి పైన 6 మాషముల ప్రమాణము చూర్ణ మును చల్లుము. తిరిగి ఆ అన్నముపై మరి ఒక భాగమును పరచి పై విధముగా 6 మాషముల ప్రమాణము చూర్ణమును చల్లుము. యిటుల నాల్గు మారులు చేయుము. దీనిలో నేతిని కలిపి రోగి పుచ్చుకొనవలెను. మందును పుచ్చుకొనిన పిదప 15 దినముల వరకు తొట్టి, ఉలవ పప్పు, పెసర పప్పు, దప్ప మరేమియు భుజింపగూడదు.

సంపూర్ణము.

# జ్యోతిష గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| జ్యోతిష ప్రథమబోధిని | | 0 | 8 |
| జాతకమార్తాండము | 1 వ భాగము | 2 | 0 |
| డిటో | 2 వ భాగము | 2 | 0 |
| డిటో | 3 వ భాగము | 2 | 0 |
| జ్యోతిష రహస్యము | 1 వ భాగము | 2 | 0 |
| డిటో | 2 వ భాగము | 2 | 0 |
| జ్యోతిష విద్యాప్రకాశిక | | | |
| సంజ్ఞాధ్యాయము | 1 వ భాగము | 1 | 0 |
| గణితాధ్యాయము | 2 వ భాగము | 1 | 0 |
| భావఫలాధ్యాయము | 3 వ భాగము | 3 | 0 |
| ద్వాదశభావఫలము | 4 వ భాగము | 3 | 0 |
| అదృష్టదీపిక | | 0 | 10 |
| హస్తసాముద్రికము | | 0 | 6 |
| జ్యోతిషఫలప్రదర్శిని | | 0 | 12 |
| స్వప్న ఫలదీపిక | | 0 | 8 |
| సకల సమస్తగుణ అదృష్టఫలదీపిక | | 1 | 0 |
| గౌతమసంహిత | | 0 | 8 |
| వాంఛానాధీయము | | 0 | 8 |
| కోడిపుంజుల శాస్త్రము | | 0 | 8 |
| అంగసాముద్రికము | | 0 | 8 |
| జాతకదర్పణము | | 0 | 12 |
| జాతకపారిజాతము | | 1 | 0 |
| జాతకరాజీయము | | 1 | 0 |
| ప్రపంచ జ్యోతిషము | | 0 | 4 |
| జ్యోతిషపల్లగ్రంధము | | 0 | 4 |